# "కేర్‌ఫ్రీ రక్షణ —దానిలా మరొకటి లేదిక!"

మిమ్మల్ని దృష్టిలో పెట్టుకుని తయారుచేసారు కేర్‌ఫ్రీ. ఇబ్బందైన ఆ 5 రోజుల్లో ఆధునిక యువతికి కావలసిన శుభ్రత కూడిన ఆ సంరక్షణని యిస్తుందిది.

మీకు అధిక రక్షణ యివ్వడానికి దీనిలో మరింతగా పీల్చుకునే గుణం.

కేర్‌ఫ్రీ శాస్త్రీయంగా రూపొందించబడినది. దీని లోపల భాగంలో గల మెత్తని పొరలు, ప్రత్యేకమైన రీతిలో పీల్చుకోగలిగే పదార్థంతో చేయబడ్డాయి. కేర్‌ఫ్రీ మీకు యిప్పటి దాకా వాడిన వాటి అన్నిటి కన్నా చెమ్మను నిలుపుకోగలుగుతూ, మీకు మరింతగా రక్షణని యిస్తుంది. అయినా యిది ఎంతో సన్నగా, సున్నితంగా, యిమిడికగా ఉంటుంది.

అద్వితీయమైన దీనికిగల ప్లాస్టిక్ కవచం మరకలు పడటాన్ని నిరోధిస్తుంది.

కేవలం కేర్‌ఫ్రీలోనే, క్రింది భాగం చుట్టూరా, నేప్‌కిన్‌కి



రెండు వైపులా గల 3-వైపుల గల నీలి ప్లాస్టిక్ కవచం మధ్యన అడ్డుగా నిలవడం కోసం ఉంది. అందుకే యిది తడిసి పోతుందని గాని, మరకలు పడుతుందని గాని భయం లేదు.

ఎంతో సౌకర్యం, మరెంతో వీలు.

కేర్‌ఫ్రీ మీకు పూర్తిగా సౌకర్యాన్నిస్తుంది. దీన్ని వాడటం, పారెయ్యడం ఎంతో తేలిక...దీన్ని ఫ్లష్ చేసెయ్యండి, అంతే. మార్చుకోవడం కూడా వీలు-మీరెప్పుడు మార్చవలసివచ్చినా మీకెంతో సౌకర్యం.

అవును కేర్‌ఫ్రీతో మీరెంతో భద్రంగా, ఎంతో సౌకర్యంగా ఉంటారిక, అసలు నెలలో అది ఏ రోజూ అనే ధ్యాసే ఉండదు. మీరిక ఏం చెయ్యదలుచుకున్నా నిశ్చింతగా చేయగలరు మరి...ఎందుకంటే మరేదీ యివ్వలేని రక్షణను యిస్తుంది కేర్‌ఫ్రీ!

ఇది 10 మరియు 20 నేప్‌కిన్స్ ప్యాక్‌లలో దొరుకుతుంది.




Johnson & Johnson*

## కేర్‌ఫ్రీ* — కాలం మారుతున్న యీ రోజుల్లో పూర్తి రక్షణ.




## ముఖచిత్రం

11.6.82 తేదీన ప్రచురించిన కల్పనాఅయ్యర్ ఆకర్షనీయముగా వుంది.

యు. కె. శంకరకృష్ణ (ఎమ్మిగనూరు)

*   *   *

11.6.82 తేది మీ (మా) "ఆంధ్ర సచిత్ర వారపత్రిక" నటి, నర్తకి "కల్పనా అయ్యర్" ఆకర్షనీయంగా, సలక్షణంగా వుంది. ఈవారం పత్రిక చాలా బావుంది.

కె. ఈశ్వరరావు, డి. గురుమూర్తివర్మ, కె. వైకుంటరావు (బైపల్లి)

*   *   *

ప్రముఖ నర్తకి 'కల్పనా అయ్యర్' ముఖచిత్రంతో వెలువడిన పత్రిక సర్వాగ సుందరముగా ఉంది. ముఖచిత్రం పత్రికకు వన్నె తెచ్చినది.

కె. కొండయ్యశాస్త్రి (ఉయ్యూరు)

*   *   *

11.6.82న మీారు ప్రచురించిన నటి నర్తకి కల్పనాఅయ్యర్ ముఖచిత్రం అంత ఆకర్షనీయంగా లేదు.

వెంకు మహంతి
రేణుకా మన్మధపట్నాయిక్ (బరంపురం)

## సిరియల్స్

వలివేటి నాగచంద్రావతిగారి "కాలం కరిచాక" సీరియల్ 2వ భాగము చదివాము. అందులో కన్నె పిల్లలకు ఈ కాలంలో జరిగే మోసాలు కళ్లకు కట్టినట్టుగా మీనాక్షి పాత్రలో చూపించారు. వచ్చే సంచికలో కథ ఎన్ని మలుపులు తిరుగుతుందోనని ఆతృతతో చూస్తున్నాము. సీరియల్ చాలాబాగుంది.

సి. హెచ్. రామకృష్ణ, గిరిజ (నూజివీడు)

*   *   *

నటి, నర్తకి కల్పనాఅయ్యర్‌తో వెలువడిన తేదీ 11.6.82 నాటి ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా ఆకర్షనీయంగానున్నది. "కాలం కరిచాక" సీరియల్ చాలా బాగుంది. చదువుచున్నంతసేపు మమ్ము మేము మరిచి పోతాము. "వలివేటి నాగచంద్రావతి"గారికి మా శుభాకాంక్షలు.

కె. కుమార్‌చౌదరి (కాశీబుగ్గ)

*   *   *

11·6.82 పత్రికలో సీరియల్ "మనసు కథ" ఒక వూహించని, మలుపు తిరిగింది. సీరియల్ ఎంతో ఆతృతతో చదివేలా, వ్రాసిన రచయిత్రి అభినందనీయులు. మరో సీరియల్ "కాలం కరిచాక" నేటి యువతీ యువకులు నేర్చుకునే, తెల్సుకునే నగ్నసత్యం ఇమిడి వుంది.

పులపర్తి శ్రీరంగ (మొగల్తూరు)

*   *   *

11.6.82 నాటి పత్రిక ముఖ చిత్రం కల్పనా అయ్యర్ కడు రమ్యంగా వుంది. "కాలం కరిచాక" సీరియల్ మొదట్లోనే ఆకర్షించి ఆకట్టుకుంది.

బిరుదరాజు సతీష్‌కుమార్‌భట్ (ఖాజీపేట)

## కథలు

నటి, నర్తకి కల్పనా అయ్యర్ ముఖచిత్రం కన్నుల విందుగా ఉంది.

డబ్బు ఉన్నంత వరకే ఈ మమతలు, అనుబంధాలు,అది లేదనేసరికి కన్నతల్లయినాసరే బలాదూర్! అన్న సత్యాన్ని 'అంతరార్థం' కథలో రచయిత చక్కగా వివరించారు.

కడియాల చంద్రుడు (మహబూబ్‌నగర్)

*   *   *

11.6.82 తేదీతో వెలువడిన పత్రిక ముఖ చిత్రం అనాకర్షనీయంగా ఉన్నది. కథలన్నింటిలో అంతరార్థం బహు జనాకర్షనీయం. రచయిత ముద్దంసెట్టిగార్కి కృతజ్ఞతలు.

ద్విభాష్యం కృష్ణమూర్తి (మొగల్తూరు)

*   *   *

11.6.82 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వెలువడిన ముఖచిత్రం నటి కల్పనా అయ్యర్ ఆకర్షనీయంగా ఉంది. ఈవారం కథలన్నింటిలో సంఘం గెలిచింది—మనిషి ఓడిపోయాడు కథ మమ్మల్నెంతగానో ఆకట్టుకుంది. బుద్ధరాజు సన్యాసిరాజు గారికి మెనీథాంక్స్.

తోట శోభన్‌బాబు, పి. శేఖర్‌బాబు (ఖర్గపూర్)

*   *   *

11.6.82 ఆంధ్ర సచిత్ర వారపత్రిక బుద్ధరాజు సన్యాసిరాజుగారి సంఘం గెలిచింది మనిషి ఓడిపోయాడు కథ చాల నచ్చింది. అంతరార్థం కథ కూడాబాగుంది. రచయితలిరువురుకూ నా కృతజ్ఞతలు.

కె. ఈశ్వర్‌జ్యోతి (బైపల్లి)

*   *   *

కల్పనా అయ్యర్ ముఖచిత్రం గల పత్రికలో బుద్ధరాజు సన్యాసిరాజుగారి 'సంఘం గెలిచింది—మనిషి ఓడిపోయాడు' కథ ఆసక్తి కలిగించింది. ఫ్రీసెక్స్ గురించి, ప్రీసొసైటీ గురించి వారి అభిప్రాయాలు వివరంగా ఈకథ ద్వారా తెలియజేశారు. మనిషికి ఎటువంటి ఉన్నత ఆశయాలు ఉన్నప్పటికీ, సిద్ధాంత సాధనకోసం ఎంత శ్రమపడినప్పటికీ ఏదో ఒకనాడు అతడు సంఘంకి తలవంచక తప్పదు. ఈ విషయాన్ని రచయిత కథలో చక్కగా తెలియజేశారు. అలాగే మంధా వెంకటరమణారావు గారి దెయ్యం కథ కోరికలు తీరని పడతులు, మూఢ నమ్మకాలను చాటు చేసుకుని ఎలా తమ ఆశలు తీర్చుకుంటున్నారో చక్కగా వివరించింది.

వల్లభనేని హనుమయ్యచౌదరి (చేవూరు)

( 74వ పేజీ చూడండి )

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభు ప్రసాద్
సంపాదకుడు
[1938 - 1972]

శుక్రవారం . 9-7'-82
దుందుభినామ సం. ఆషాఢ బ. తదియ
సంపుటము 75 . సంచిక 44

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్ట్‌లో ఏడాది చందా రు. 85 80
ఆరు మాసాల చందా రు 42-90
విడి ప్రతి వెల రు 1-50

ఆంధ్ర పత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయువాడ-520 003


## విషయానుక్రమణిక



(ఫొటో: సి.వి. సత్యనారాయణ)





## లోకంపోకడ ✱ డిశిమెన్















సీరియల్

# ప్రేమదేవత

## భీశెట్టి శారదాలక్ష్మీరావ్

చెల్లెలికి జడ కుచ్చులు కొనుక్కొచ్చి యివ్వగాలేంది... నాకు చీర కొండానికి డబ్బు లేకపోయిందా! ఆ మాట చెప్పడానికి సిగ్గులెదూ! నేనేం చీర కట్టుకు సింగారించు కోడానికి లెమ్మన్నానా! అమ్మవారికి పండక్కి చీర పెడతానని మొక్కుకున్నాను. అయ్యో... అయ్యో...! రేపో మాపో పండగ కూడా రాబోతోంది నోట్లో శనున్నట్టు— పట్నం వెళ్తున్నప్పుడు మరిమరీ పోరి చెప్పాను— చీర మర్చిపోవద్దని. చెప్పండి. మీకు మీ చెల్లెలే ముఖ్యమనుకుంటే... ఇప్పుడే ఏ నుయ్యో, గొయ్యో చూసుకుంటాను...'' అని— దేవాలయం నుండి తిరిగి వచ్చిన సత్యం భార్య కనకం— విషయమంతా భర్త ద్వారా విని, ఒక్కసారి గొంతును అరునొక్క రాగంలో ఎత్తుకుంది.

చుట్టు ప్రక్కల వారికది మామూలే అయినా- కనకం నోటికి జడిసి ఎవరూ ముందుకు రాలేదు.

''ఏమిటే ఆ అరుపులు! ఇప్పుడేం తప్పు చేశానని...! చీర ఈ రోజు కాకపోతే రేపు తెస్తానన్నానుగా! పాపం... బాల ఎప్పటి నుంచో ముచ్చట పడుతోందని కొనుక్కొస్తే యింత రాద్ధాంతం చేస్తావా?''

—భార్య దెప్పిపొడుపు మాటలకు, అనవసరంగా నోరు పారేసుకోడం వల్ల సత్యం శాంతం వహించలేక పోయాడు.

కనకం మరింత విజృంభించింది. కోపంతోనూ— అవమానంతోనూ ఆమె శరీరం కుతకుతలాడి పోయింది.

''చెల్లెలికి జడకుచ్చులు తెచ్చి—ముస్తాబు చేయించి— ఆగర్భ దరిద్రుడి దగ్గరకు పంపింది చాలక యింకా వెనకేసుకొస్తారా? ఉండండి. మిమ్మల్ని అని ఏం లాభం? ఈ

(గత సంచిక తరువాయి)

గడ్డేదో దానికే పెడ్తాను'' ఒక్కూపునసమ్మం దిగింది— చీర ఎగ్గట్టి— పమిటబిగించి!

* * *

దేవాలయం పక్కగా—

'చలిమంట' కాచుకుంటూ సుతారంగా తంబూరా మీటుతోన్న సాధుతాత దగ్గరకు వచ్చారు శివ—బాలలు.

''రండి... రండి!'' అంటూ వాళ్లిద్దర్నీ ఆప్యాయంగా దగ్గరకు పిలిచి తన కెదురుగ్గా కూర్చోబెట్టుకున్నాడు సాధు తాత.

సాధు తాతకు చిన్నప్పట్నుంచీ బాల—శివలు తెలుసు. తాత మంట వేసుకుని చలికాచుకుంటుంటే, వెళ్లి వాళ్లిద్దరూ కొంతసేపు 'తాత'తో పరాచకాలాడ్డం కొత్త కాదు.

''ఏం శివయ్యా! మాకు పప్పన్నం ఎప్పుడు పెడ్తావ్?'' సాధుతాత నవ్వుతూ అడిగాడు— శివని.

శివ నవ్వు పువ్వులా విరిసింది.

బాల సిగ్గుతో తల వంచుకుంది.

''ఇదిగో! పెళ్లికూతురు దగ్గరే వుంది. ఆ మాటేదో నువ్వే కనుక్కో తాతా?'' అన్నాడు— శివ బాలను క్రీగంట చూస్తూ; ఇద్దరి చూపులూ కలిశాయ్.

ఆ మురిపాల జంటలాడుకునే ముచ్చటలకు తాను అడ్డుగా ఉండడం ఎందుకనుకున్నాడో— ఏమో— సాధుతాత నెమ్మదిగా అక్కడ్నుంచి కదిలాడు.

**జరిగిన కథ - 1:** మేనత్త మేనమామ బిడ్డలు శివ — బాలలు. శివ చక్కటి చిత్రకారుడు. బాల నాట్య మయూరి. ఒకరంటే మరొకరికి ఎనలేని ప్రేమ. ఆ కొండల్లో, కోనల్లో ఆడుతూ, పాడుతూ ఏ అదుపూ అడ్డూ లేకుండా సంచరిస్తుంటారు ఆ ప్రేమికులు.

ముందున్న 'మంట' దేదీప్యమానంగా వెలుగొందుతూంటే— శివ బాలల ఊహల్లో— కల్యాణ మండపం — ఆ మండపంలో నూతన వధూవరుల్లా తామిద్దరూ పెళ్లిపీటల మీద కూర్చున్నట్టు — మనసులు ఊహాలోకాలకు ఎగిరిపోయాయి.

అలా —

క్షణాలు ...

నిమిషాలు ...

గంటలు ...

దొర్లిపోతోండగా —

''ఛెళ్లు'' మనే పిడుగు లాంటి దెబ్బ బాల వీపు మీద పడడంతో ఒక్కసారి శివ — బాలలు త్రుళ్లి పడ్డారు.

బాల అదరిపాటుగా తలెత్తింది.

ఎదురుగ్గా భద్రకాళిలా కనకం నిలబడి వుంది.

వేటగాని చూసిన లేడిలా వణికిపోయింది.

''దరిద్రపు ముండా! జడకుచ్చులు తక్కువయ్యాయా నీకు ?'' అంటూ ముందు వెనకా ఆలోచించకుండా బలవంతంగా జడకుచ్చులు ఊడపెరికి కసికొద్దీ వాటిని ఎదురుగ్గా వున్న మంటల్లోకి విసిరేసింది — కనకం.

శివ కంటికి బాల శరీరాన్ని ఉండచుట్టి మంటల్లో పడేసి నట్టనిపించింది.

''అక్కా!''

శివ కోపం పట్టలేక పోయాడు.

బాల గజ గజ లాడి పోయింది.

''నువ్వు మనిషివేనా ?'' శివ కళ్లు చింత నిప్పులయ్యాయి.

"ఏమిటయ్యా అరుస్తున్నావు ? పెళ్లి కావలసిన పిల్ల. ఇలా వంటరిగా రప్పించు కొని కులకడానికి సిగ్గు లేదూ ... !" అని "ఏమే ! నీకేమైనా సిగ్గూ ఎగ్గూ వుందా ? ఆడపుట్టుక పుట్టి, అడవి లేడిలా చెట్టూ పుట్టలూ తిరిగితే నలుగురూ నవ్విపోతారు. శోభనం పెళ్లికూతురిలా సింగారించు కొచ్చి యిక్కడ తగలడానికి మనకేమన్నా పరువూ, మర్యాదా వుందనుకున్నావా?లేదనుకున్నావా?" అంటూ అమాంతంగా బాల జుత్తు పట్టు కొని వీపు మీద దబ దబా బాదడం ప్రారం భించింది.

సరిగ్గా అదే సమయంలో—

సత్యం వచ్చాడు — కనకం చెంప ఛెళ్లు మనిపించాడు —

అంతే !

కనకం ఆడ బెబ్బులిలా సత్యం మీదకి లంఘించింది.

తన చెప్పు చేతల్లో వుండే భర్త — తనంటే హడలిపోయే బాల సమక్షంలో చేయి చేసుకోవడం కనకం సహించలేక పోయింది.

గుడ్లురుముతూ బాల వేపు కొరకొరా చూసింది.

ఒక్కూవున యింటి వేపు పరుగెత్తింది.

శివ నిస్సహాయతతో బాల వేపు తిరిగాడు. బాల దీనంగా బావవేపు చూసింది.

ఇద్దరి కళ్లూ జలపాతాలయ్యాయ్.

మంట ఆరింది.

అగ్నిదేవుని ఆకలికి జడకుచ్చులు ఆహారమై బూడిద మిగిలింది.

శివలో ఆవేశం పొంగుకొచ్చింది.

గుండెల్లో మంటలు రేగాయ్.

పట్టుదల — పంతం పెరిగింది. పిడికిలి బిగించాడు.

"బాలా ! జడకుచ్చులు తెస్తాను—బంగారు జడకుచ్చులు తెస్తాను. మన ఆరాధ్య దేవత లైన శివపార్వతుల మీద ప్రమాణం చేసి మరీ చెప్తున్నాను. నీకు బంగారు జడకుచ్చులు తెచ్చి—నీ కోరిక తీరుస్తాను. అక్కయ్య కళ్లు తెరిపించి— నిన్ను పెళ్లాడుతాను" అంటూ బాల చేతిలో చేయివేసి — ఆవేశం హద్దులు దాటుతూంటే పొంగి పొరలే దుఃఖంతో అక్కడ్నుంచి గబ గబా కదిలాడు శివ.

* * *

ఇల్లు ఎగిరిపోయేలా—

కనకమ్మ కేకలు పెట్టి — రాగాలు తీస్తూంటే, సత్యం మనస్సు కకా వికలైంది.

భార్యకు నచ్చచెప్పాడు; బతిమలాడాడు. ససేమిరా వినసని మొండికేసింది కనకం.

చివరకు కన్నీరాపి భర్త వేపు తిరిగింది.

"సరే ! జరిగిందేదో జరిగిపోయింది. బాలను నా తమ్ముడికిచ్చి పెళ్లి చేయడానికి ఒప్పుకోండి" ఠక్కున అడిగింది కనకం.

సత్యం రెచ్చిపోయాడు.

"చచ్చినా నీ తమ్ముడికి నా చెల్లెల్ని యివ్వను. గొర్రె దొరికిందని గొంగళి కప్పబోకు. ఇదివరలో అనేకసార్లు చెప్పాను — ఈ మాట మళ్లీ మళ్లీ చెప్తున్నాను. బాల పుట్టింది శివ కోసం, వాళ్ల పెళ్లెప్పుడో నిర్ణయమైంది" అంటూ కటువుగా సమాధానం చెప్పాడు సత్యం.

"ఏం ? శివగాడి కంటే నా తమ్ముడేం తీసిపోయాడా ?" ఉక్రోషంగా అడుగుతూంది కనకం.



# ప్రేమ దేవత

"పువ్వు పుట్టేది పూజకోసమూ—ముల్లు పెరిగేది ముప్పు కోసమూనూ. తెలిసుండీ ముల్లుని ముద్దులాడ మంటావా?" అని సత్యం ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

అన్నా—వదినెల సంఘర్షణ వింటూ ఏమీ చేయలేక, ఎటూ చెప్పలేక బాల కంటికి మంటికి ఏకధారగా విలపిస్తూ — ఓ మూల కుప్ప కూలి, సొమ్మసిల్లి పోయింది.

ప్రకృతి కాంత ఉషోదయంతో కట్టిన పచ్చచీర విడిచి, సంధ్యాస్నానం చేసి నల్లచీర కట్టింది.

*　　　*　　　*

తూరుపు తెల్లారింది.

ఊళ్ళోకి అందమైన కారొకటి వచ్చి — సరాసరి సత్యం యింటి ముందాగింది.

టిప్—టాప్‌గా డ్రెస్ చేసుకున్న బలరామ్—జగ్గూ కారు దిగారు.

ఇద్దరూ పట్నం బాబుల్లా వున్నారు.

ఇద్దరికీ పాతికేళ్ళ వయస్సుంటుంది.

బయటకు వచ్చిన కనకం ఒక్కసారి 'సూట్‌వాలా'లను చూసి, తక్కున ఆగి పోయింది.

"అదేమిటే అక్కా! నేనూ! నీతమ్ముడ్ని బలరామ్‌ని" అంటూ కళ్ళకున్న రంగు అద్దాలు తొలగించి ముందుకి వచ్చాడు బలరామ్.

కనకం ముఖంమ్మీద వెయ్యి జోతులు వెలిగాయి.

"నువ్వట్రా బలరామ్! ఎంతగా మారి పోయావోరా...! రా... రా!" అంటూ తమ్ముడి దగ్గరకు వచ్చింది కనకం.

"ఇతని పేరు జగ్గు. నా వ్యాపారానికి ఎన్నో విధాల సహకరించిన కోటీశ్వరుడు" అంటూ జగ్గూని అక్కకు పరిచయం చేశాడు బలరామ్.

ముగ్గురూ లోనికి వచ్చారు.

సత్యం వాళ్ళను చూశాడు. ఏవగింపుగా ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

లేచి అక్కడ్నుంచి బయటకు నడవాలను కున్నాడు.

"అదేమిటి బావా! నేనిలా వచ్చానో లేదో అప్పుడే బయటికి వెళ్తున్నావ్?" చనువుగా వచ్చి సత్యం ముందు నిలబడ్డాడు బలరామ్.

స్వయంగా పలకరించాడు గనుక మాట్లా

డకపోతే బావుండదని ముఖంమీదకు చిరునవ్వు తెచ్చిపెట్టుకొని "పనిమీద వెళ్తున్నాను!" అని ముభావంగా చెప్పి వడివడిగా బయటకు నడిచాడు– సత్యం.

"మీ బావ తత్వమే అంత. నువ్వు ఇంకో కలా అనుకోకురా...!" తమ్ముడికి సర్ది చెప్పింది కనకం.

బలరావ్ కళ్ళు 'బాల' కోసం ఒక్కసారి నలువేపులా గిర్రున తిరిగాయ్.

ఎక్కడా కనిపించలేదు.

"బాల ఎక్కడక్కా!" మనసులోమాటను అణచుకోలేక అడిగేశాడు– బలరావ్.

"కాలు కదపకుండా తిని కూచోడానికి ఉన్నవాళ్లం కాదుకదరా తమ్ముడూ! చీపురు పుల్లలు ఏరుకురాకపోతే... ఇల్లు గడిచేదెలాగ! తొలికోడి కూయకముందే వెళ్ళి, దీపాలు పెట్టే వేళకు వస్తుంది" అంది దీర్ఘంగా కనకం!

తర్వాత–

ఇద్దరికీ కుర్చీలు చూపించి– కాఫీ కాచడానికి లోనికి వెళ్ళింది.

సరిగ్గా అదే సమయం–

పేపరు కుర్రాడొకడు సైకిల్‌మీద పత్రిక లిస్తూ వెళ్లడం బలరావ్ కంట బడింది.

కళ్లతోనే జగ్గూకి సైగ చేశాడు.

జగ్గూ గభాలున లేచాడు.

పత్రికలమ్మే కుర్రాడ్ని పిలిచి– ఓ పత్రిక కొన్నాడు. కాకతాళీయంగా పత్రిక మొదటి పుట తిప్పాడు– "భయంకర నరరూప రాక్షసులు– బలరావ్, జగ్గూలు– జైలు నుండి పరార్– పోలీసులు తీవ్రంగా గాలింపు"

గతుక్కుమన్నాడు– జగ్గూ.

"భయపడుతున్నావా జగ్గూ!" అంటూ నెమ్మదిగా భుజంమీద చేయి వేశాడు బలరాం. అతని చూపు పేపరు హెడ్ లైన్స్ మీద పడింది. భృకుటి ముడిచి ఆలోచనల్లో పడ్డాడు.

"అయితే మన గురించి పోలీసులు గాలిస్తున్నారన్నమాట!" జగ్గూ రహస్యంగా అన్నాడు.

"అందుకే యీ మారుమూల ప్రాంతానికి వచ్చింది. నిక్షేపంగా కొన్నాళ్లిక్కడ వుండి, సమయం చూసి బాలను లేపుకు పోవచ్చు" ఆదేశించాడు - బలరావ్.

* * *

"బాబూ... శివా !"

"... ... ... ... ..."

"శివయ్యా...!"

–కోటమ్మ దిక్కులు ప్రతిధ్వనించేలా శివకోసం ఎలుగెత్తి పిలుస్తూ చెట్టులూ, పుట్టలూ గాలిస్తూ రావడం– చీపురుపుల్లలు ఏరుతున్న బాల చెవిన పడింది. అంతవరకూ ఏరిన పుల్లలను కట్టగా కట్టి ఒకచోట పెట్టి కోటమ్మకు ఎదురుగ్గా పరిగెత్తింది.

"అమ్మా బాలా! శివ ఎక్కడమ్మా! రాత్రినుండి యింటికి రాలేదు!" ఆందోళనగా అడిగింది- కోటమ్మ.

షాక్ తిన్నట్టు అదిరిపడింది బాల.

"రాత్రినుండా !"

"అవునమ్మా!"

"బంగారు జడకుచ్చులు లేకుండా నీ ఎదుటికి తిరిగి రాను' అన్న శివ మాటలు బాల చెవిలో ప్రతిధ్వనించాయ్.

'అయితే బావ అన్నంతపనీ చేశాడా?!'

బాల మనస్సు బాధతో గిలగిల కొట్టుకుంది.

"రామ్మా! వెదుకుదాం!" కోటమ్మ ఒకవేపు బాల మరోవేపు పరుగు తీశారు.

కనిపించిన వారందర్నీ అడిగింది కోటమ్మ.

మాకు తెలియదంటే...మాకు తెలియదనే శారు అందరూ.

తామిద్దరూ కలుసుకునే చోటల్లా వెదికింది బాల. శివ జాడలేదు.

నిమిషాలు...గంటలు...

ఇద్దరూ తిరిగారు.

ఎందర్నో అడిగారు.

శివ వైనం తెలియలేదు.

తిరిగి–తిరిగి అలసి శివాలయం ముందు కూలబడి పోయింది కోటమ్మ. బాల గుండె చెరువైంది, కళ్లు జలపాతాలయ్యాయ్.

నాయనమ్మకు జరిగింది చెప్పాలా ? వద్దా? చెప్తే ఆమె మనసు మరింత బాధపడుతుంది.

ఎలా ?

ఏం చేయాలి ?

బాల మనసు కొట్టుమిట్టాడి పోయింది.

"ఎక్కడికో వెళ్ళుంటాడు – వస్తాడులే కోటమ్మా ! బాధ పడకు !"పూజారి ధైర్యం చెప్పాడు.

అయినా కోటమ్మకు కన్నీరాగలేదు.

* * *

శివ గురించి సత్యానికి చెప్దామనుకొని వడివడిగా యింటికి వచ్చిన బాల–ఎదురుగ్గా వాలుకుర్చీ మీద కూర్చొని విలాసంగా సిగరెట్



వనితలకు మనవి

కొత్తరకం వంటలు
క్లుప్తంగా రాసి పంపితే
త్వరగా పరిశీలించ వీలవుతుంది. —సం.



## ప్రేమ దేవత

కాలుస్తూన్న అపరిచిత వ్యక్తిని చూసి రక్కున ఆగిపోయింది.

బలరావ్ బాలను చూశాడు.

అతని కళ్ళు జిగేలు మన్నాయ్.

"వాట్ ఎ వండర్‌ఫుల్ బ్యూటీ!" — మనసులో అనుకోవాల్సిన మాటను పైకి అనేస్తూ పైకి లేచాడు.

"ఏమిటీ? అలా చూస్తావ్! మీ బలరావ్ బావ, పట్నంలో పెద్ద వ్యాపారం చేస్తూ నిన్ను చూడాలని వచ్చాడు!" కనకం గబగబా వస్తూ అంది బాలతో.

బాల ఛర్రున లోనికి వెళ్ళింది.

"అబ్బా! అజంతా శిల్పసుందరిలా వుంది బాల" అన్నాడు కనకంతో బలరావ్.

"నీక్కాబోయేదే కదట్రా!" తమ్ముణ్ణి సమర్థిస్తూ అంది కనకం.

బలరావ్ మనసులో చిర్నవ్వు విషపు నవ్వుగా మారింది.

* * *

"అన్నయ్యా! బావ రాత్రి నుండీ ఇంటికి రాలేదట. నాయనమ్మ ఊరంతా వెతుకు తోంది" పంచ పాళీలో చీపుళ్ళు కట్టలుగా కడుతున్న సత్యం—బాల చెప్పింది విని గతుక్కు మన్నాడు.

"అంటే ఒకవేళ బంగారు కుచ్చులు గురించి..."

సత్యం ఆలోచనల్లో పడ్డాడు.

"అదే అర్థం కావడంలేదు. అంతా వెదికాం. ఎక్కడా కన్పించలేదు!"

"నేను వెదికి వస్తానుండు" చేస్తున్న పనిని ఆపి సత్యం బయటకు పరుగెత్తాడు.

* * *

గుట్టలూ ...
పుట్టలూ ...
చెట్లూ—చేలూ ...

ఆఖరికి నూతులూ, లోయలూ ... అన్నీ వెదికాడు సత్యం.

శివ ఆచూకీ తెలియలేదు.

కంటికి మంటికీ ఏకధారగా విలపిస్తున్న కోటమ్మ దగ్గరకు వచ్చాడు సత్యం.

"ఊరుకో నాయనమ్మా! వాడేం పసివాడు కాదు కదా! పనిమీద ఎక్కడికో వెళ్ళుంటాడు. నేను అసమర్థుణ్ణి. ఒక్కగానొక్క చెల్లెలి కోరిక నేను తీర్చలేనని తెల్సుకొని — శివ పూనుకున్నాడు. బాలకు బంగారు జడకుచ్చులు తెస్తానని వెళ్ళాడు" అంటూ గతరాత్రి జరిగిందంతా చెప్పి కోటమ్మకు ఊరట కలిగించాడు సత్యం.

అప్పటికిగానీ కోటమ్మకు మనసు స్థిమిత పడలేదు.

* * *

పట్నంలో—

పరంధామయ్యగారు ఓ లక్షాధికారి. సినిమా పోస్టర్లు, బ్యానర్లు, డిజైన్లలో పేరెన్నికగన్న 'సుధ' పబ్లిసిటీ, కన్‌సల్‌టేషన్ ప్రొప్రయిటర్.

సుధ పరంధామయ్యగారి ఏకైక పుత్రిక. కాలేజీలో బియ్యే చదువుతూంది. 'సుధ' పేరుమీద నెలకొల్పిన పబ్లిసిటీస్ అనతి కాలంలోనే గొప్ప పేరు ప్రఖ్యాతు లార్జించుకుంది.

శివ—సరాసరి 'సుధ' పబ్లిసిటీస్ ఆఫీసుకు వచ్చాడు. పరంధామయ్యగార్ని కలిశాడు. సుధ పబ్లిసిటీస్‌లో ఉద్యోగం దొరికింది.

శివకు సినిమా బ్యానర్స్ రాసేపని అప్పజెప్పారు. శివ చేతిలో రంగులు ప్రాణం పోసుకుని, బొమ్మలు సజీవరూపాలయ్యాయి. పరంధామయ్య, సహ ఆర్టిస్టులు 'శివ' పనితనానికి ఆశ్చర్యపోయారు. నగర ముఖ్య కూడలిలో 'శివ' రాసిన సినిమా 'బ్యానర్స్' చోటు చేసుకున్నాయ్.

అలాంటి సజీవ చిత్రాలను ఇంతవరకూ ఏ చిత్రకారుడూ గీయలేదు. జనం ముక్కుమీద వేలేసుకున్నారు.

శివ పనిపట్ల— శ్రద్ధపట్ల పరంధామయ్యకు మక్కువ ఏర్పడింది. ఒకరోజు కూతురు సుధతో 'బ్యానర్స్ షెడ్'కి వచ్చాడు పరంధామయ్య.

ఆ సమయంలో— బ్యానర్స్ రాయడంలో నిమగ్నమై వున్నాడు— శివ.

సుధ చూసింది. ఆమె కళ్ళల్లో కోటి జ్యోతులు వెలిగాయి.

శివని ఎంతో ప్రశంసించింది.

పరంధామయ్య— శివ వివరాలడిగాడు.

శివ—తానెవరైందీ విశదీకరించి—ఎందుకు పట్నం వచ్చిందీ చెప్పాడు.

"బాల నా ఆరవ ప్రాణం. ఆమెకు బంగారు జడకుచ్చులు సంపాదించడం నా లక్ష్యం. అందుకే రాత్రీ, పగలూ కష్టపడుతున్నాను" అన్నాడు దృఢంగా.

తండ్రీ కూతుళ్లు శివ పట్టుదలను ఎంతో మెచ్చుకున్నారు.

అప్పటికి ఇల్లు విడిచిపెట్టి శివ రెండు నెలలైంది.

"సరే! ఆ బంగారు జడకుచ్చులు నేను కొనిస్తాను కొంత డబ్బు కూడా యిస్తాను. మీ గ్రామం వెళ్లి బాలను పెళ్లి చేసుకొని వెంటబెట్టుకొనిరా ఇక్కడే ఉద్యోగం చేసు కొంటూ స్థిరంగా వుండిపోదువుగాని..." పరంధామయ్య శివని ప్రోత్సహించాడు.

బాల కళ్లల్లో మెదిలింది. కళ్లంట ఆనంద బాష్పాలు రాలాయి.

మరోనాడు—

సుధ డబ్బుతో వచ్చింది శివ దగ్గరకు. శివని కారులో కూర్చోబెట్టుకొని నగల షాపుకి తీసుకు వెళ్ళింది. శివకి నచ్చిన పద్ధతుల్లో బంగారు జడ కుచ్చులకు ఆర్డరిచ్చింది. మొత్తం రెండువేలు.డబ్బు సుధ చెల్లించింది.

ఇద్దరూ బంగారు జడకుచ్చులతో పరంధామయ్య దగ్గరకు వచ్చారు.

జడకుచ్చులను చూసి పరంధామయ్య ముఖం వికసించింది.

"ఇది నీకు అడ్వాన్సు. పెళ్లి ఖర్చులకు మరో మూడు వేలు యిస్తున్నాను. వెంటనే బయల్దేరు" అంటూ మనసారా ఆశీర్వదించాడు పరంధామయ్య.

శివ కళ్లు చెమ్మగిల్లాయి.

"ఆఖరి బ్యానర్ పూర్తి కావచ్చింది. దాన్ని ఈ రాత్రికి పూర్తిచేసి, తెల్లారే ఊరు వెళ్తాను" అన్నాడు వినమ్రతగా శివ.

"అలాగే!" అన్నాడు పరంధామయ్య.

* * *

ఆ రాత్రి...

షెడ్డులో సినిమా పోస్టరు బొమ్మ పూర్తి చేస్తోంటే అతని కళ్లలో 'బాల' రూపం ప్రత్యక్షమైంది.

పచ్చ పావడాతో... పూల జడతో— తను పట్టుకెళ్లే బంగారు జడకుచ్చులతో ...

ఘల్లు ఘల్లు మని — బాల నడచి వస్తోంటే...కలహంస నడచి వస్తున్నట్టు...

మృదంగం మ్రోగుతున్నట్టు ...

తరంగం కదులుతున్నట్టు...

శివ ఊహలు ఎక్కడెక్కడికో పరుగులు తీశాయ్.

శివ సంపాదన తెలుసుకుంటుంది బాల !

తన ప్రయోజకత్వానికి మురిసిపోతుంది బాల !!

తన ప్రేమను గుండెల్లో పదిలపర్చు కుంటుంది బాల !!!

పెళ్లయిన వెంటనే బాలతో పట్నం రావాలి. తన ఊహలకు ఊపిరి పోసిన సజీవ సుందరి బాలను తన ప్రేమ సామ్రాజ్యానికి పట్ట మహిషిని చేసి, తన కళాఖండాలతో తాజ్‌మహల్‌ని మించిన ప్రేమమందిరం కట్టి బాలతో అందులో కాపుర ముండాలి.

ఇలా—

ఊహల ఊయల ఊగుతూ పొడవాటి నిచ్చెన మీద నిలబడి ఆర్ట్ గీస్తోన్న శివ కాలు బెణికి, అమాంతంగా నేలమీద పడ్డాడు.

అంతే !

నుదుటికి బలమైన గాయమైంది. "బాలా !" అంటూ స్పృహ తప్పి పడిపోయాడు.

* * *

డాక్టర్ కరుణాకర్, శివకి యింజక్షన్ చేశాడు. బ్లడ్ ఎక్కించాడు. అరగంట గడిచింది.

శివ మత్తుగా పడుకొని వున్నాడు. అతని పక్కనే బంగారు జడకుచ్చులు గల పెట్టె వుంది.

సుధ—పరంధామయ్యలు వున్న గదిలోనికి కరుణాకర్ వచ్చాడు.

"ప్రాణాపాయం లేదు. రక్తం బాగా పోయింది. కొన్నాళ్లు బెడ్ మీద వుండాల్సి వుంటుంది అంతే!" అన్నాడు.

సుధ — పరంధామయ్యలు తేలిగ్గా నిట్టూర్చారు.

* * *

"కరుణా ! శివ కథ విన్నావా ?" డాక్టర్ కరుణాకర్‌తో సుధ అంది.

"చెప్పావుగా !" కాఫీ సిప్ చేస్తూ అన్నాడు కరుణాకర్.

ఇద్దరూ ఓ హోటల్ ప్రయివేట్ గదిలో కూర్చొని వున్నారు. "అసలు ప్రేమంటే అది. నిన్నింతగా ఆరాధిస్తున్నాను, కనీసం ఏ రోజన్నా నా కోరిక ఏమిటో — నా ఆశ లేమిటో తెలుసుకున్నావా ?" ఆశగా, కరుణాకర్ కళ్ళల్లోనికి చూస్తూ అడిగింది సుధ.

"చూడు సుధా ! డాక్టరుగా నాకు కొన్ని బాధ్యతలూ—ఆశయాలూ వున్నాయ్. అవి నెరవేరే వరకూ పెళ్లి ప్రసక్తే లేదు" ఖచ్చితంగా అన్నాడు కరుణాకర్.

"ఏం ? పెళ్లికీ ఆశయాలకూ సంబంధ మేమిటి? పెళ్లయినంత మాత్రాన ఆశయాలు నెరవేరవా ?"

"అని కాదు! ... నేనొక ఉన్నతమైన స్థితికి చేరుకోవాలి. పదిమందికీ నా సేవలు ఉపయోగపడాలి" అని — "పద, టైం అవుతోంది అమ్మ ఎదురుచూస్తూంటుంది." అంటూ పైకి లేచాడు కరుణాకర్.

సుధకు- కరుణాకర్ అంటే అమితమైన ప్రేమ. అతని కరుణార్ద్రమైన కటాక్ష వీక్షణాల కోసం శత విధాలా ప్రయత్నించినా— కరుణాకర్ మాత్రం లొంగి రావడం లేదు.

**(ఇంకా వుంది)**



# వారఫలం

**9-7-1982 శుక్రవారం మొదలు 15-7-1982 గురువారం వరకు**

★**మేషం:—** మీది భారీ వ్యాపారమైనా, పత్రికా సంబంధమైన వ్యాపారమైనా, మంచి ఫలితాలు అందించ గలవారం. చాల కాలంగా నిలచిన వ్యవహారాలు ఒక రేవునకు రాగలవారం. స్త్రీలకు: సుఖం, ఆనందం, ఆదాయం, అధికారుల మన్ననకు అవకాశం గలదని గ్రహించాలి.

★**వృషభం:—** ప్రయాణ మూలకంగా ఏదో మేలు పొందనున్నారు. స్నేహితుల మూలాన ధన లబ్ధి గలదని గ్రహించాలి. రచనా వ్యాసంగంలో సత్ఫలితం లభింప గలవారం. స్త్రీలకు: విద్యార్జన ప్రయత్నాలకు సదవకాశాలు, స్వల్పంగా ఆదాయం సంభవింపగలదు. ఆరోగ్య లోపం లేదు.

★**మిధునం:—** భూమి విషయంగా ఏవో తగాదాలు చెలరేగనున్నాయి. మీకు వ్యవసాయ రంగాన అనుకూల దాయకమైన పరిస్థితులు ఏర్పడనున్నవి. చాలమంది విందు వినోదాలలో పాల్గొన గలరు. స్త్రీలకు : ధనలబ్ధి, ఉద్యోగం చేసేలాగైతే ప్రగతి కనిపించే మార్గం గలవారం.

★**కర్కాటకం:—** మీకు రచనా విధానంలో, కొందరకు నటనా విధానంలో, కొందరకు కథాకాలక్షేప వ్యవహారాల్లో ఉపయోగకరమైన పరిస్థితులు ఏర్పడగలవు. భూ విషయంగా ఏదైనా తగాదా తల ఎత్త వచ్చు. స్త్రీలకు: నాల్గు విధాలా మేలు చేకూర గలవారం. నగలు కొనుటకో, నూతన ఉద్యోగాలు లభించుటకో అవకాశం గల వారం.

★**సింహం:—** సులభంగా ఒకానొక వ్యవహారం నెరవేరగలదు. అనుకొన్నది, వాయిదా పడే పరిస్థితులుంటాయి. చేతికంద వలసిన ధనం అందక పోవటం గాక, అధికంగా వ్యయం చేయ వలసిన పరిస్థితులుండుట గమనించ గలరు. స్త్రీలకు: ఉన్నత విద్యావకాశాలు కొందరకు, నూతన వస్తు సేకరణకు కొందరకు, అవకాశాలుంటాయి.




★**కన్య:—** మాటలవలన కొన్ని వ్యవహారాలు సానుకూలం చేసికోగలరు. మిత్రుల వలన ఒకానొక వ్యవహారం ఉద్యోగ విషయం సానుకూలం కాగలదు. అమూల్య వస్తు సేకరణకు కొందరకు అవకాశం ఉన్నది. స్త్రీలకు: రచనలో, ఉద్యోగంలో, ఉన్నత విద్యార్జనలో సదవకాశాలు ఉండగలవు. ఆరోగ్యలోపం లేదు.

★**తుల:—** మీరు చిక్కులలో ఉండటం మిత్రులు గమనించి సహాయం చేయనున్నారు, కాని బంధువులు హేళన చేయుటం కూడా గమనింప నున్నారు. ఉద్యోగాలలో కొందరకు చిక్కులు రాగలవు. ఆరోగ్య భంగం కొందరు విషయంలో సంభవం. స్త్రీలకు: సర్వవిధాల అనుకూలత అన్ని రంగాలలో తటస్థించనున్నది.

★**వృశ్చికం:—** భారమైన పనులు నెత్తినపడుతాయి. ఖాదీ వ్యాపారంలో ఇబ్బందులు గలవు. భూమి కొనుగోల చేయుటంలో లాభం పొందనున్నారు. అధికారుల ఆదరణకు అవకాశంగల వారం. మీ వస్తువులు ఏవైనా పోతాయేమో జాగ్రత్త పడండి. స్త్రీలకు: వృత్తి ఉద్యోగ కళారంగావకాశాలు అనంతంగా కనిపించే వారం.

★**ధనుస్సు:—** ఈ వారం మీకు చాలా ప్రోత్సాహకరంగా ఉంటుంది. వివిధ మార్గాల ధనావకాశానికి అవకాశం ఉంటుంది. ఒక వ్యవహారం మధ్యవర్తి ద్వారా పరిష్కారం కానున్నది. స్త్రీలకు: లాభనష్టాలు సమం. ఉద్యోగంలో కొందరకు ప్రమోషన్ అవకాశాలుంటాయి.

★**మకరం:—** నూతన వ్యవహారాలు తెలిసికొనే అవకాశాలు ఉంటాయి. అమూల్య వస్తు సేకరణకు అవకాశం ఉన్నది. భోజనసౌకర్యం లేక కొందరు ఈ వారం ఇబ్బంది పడనున్నారు. ఆస్తి వ్యవహారాలలో చికాకులుంటాయి చూచుకోండి. స్త్రీలకు: సుఖశాంతులకు లోపం లేదు. ఉన్నత విద్యకు అవకాశం గల వారం.

★**కుంభం:—** ముందు వెనుకలాలోచించి ప్రతి పనికి దిగండి. పోయిన వస్తువుల భోగట్టా తెలిసికోగలరు. శుభ కార్యం మీ యింటజరిగే అవకాశం ఉన్నది. స్త్రీలకు: కీర్తి అతిశయించే మార్గం ఉన్నది.

★**మీనం:—** శారీరకంగా ఏదో యిబ్బందికి కొందరు గురికాగలరు. కొందరు యివ్వవలసిన బాకీల గూర్చి తాపత్రయ పడగలరు. కొందరు క్రీడావనిలో రాణించే అవకాశాలుంటాయి. స్త్రీలకు: సాహితీ రంగంలో అవకాశాలు, నగలు కొనే అవకాశాలుంటాయి. ఆరోగ్యంలో లోపం రాదు.

**— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ***

విజయనగరం మరో మూడురోజులుందనగా సుజాత భర్త శేఖర్‌తోనూ, రెండేళ్ళ కూతురుతోనూ పుట్టింటికి చేరుకుంది. పండుగ భోజనం ఎక్కువ అవటంవల్లా, దానికి ప్రయాణపు బడలిక తోడవటం వల్లా సుజాత, శేఖర్ పక్కలమీదకు జేరారు. చిన్న కునుకు పట్టేసరికల్లా వీధిలో ముష్టివాడు కేకలు మొదలు పెట్టాడు. తల్లి సుశీలమ్మ వాడి సంగతి చూసుకుంటుందని బద్ధకంగా పడుకుంది సుజాత. అయితే సుశీలమ్మకూడా అప్పుడే పని పూర్తి చేసుకొని నడుము వాల్చింది. ముష్టివాడు గొంతుక పెంచి, 'తల్లి చావు పిల్ల తల్లీ! ఒంటపూట పసిపిల్ల కడుపు మాడుతోంది తల్లీ! బారెడు ముక్కలు వద్దు ఓ ముద్ద అన్నం చాలు— తల్లీ!...' అంటూ అరుస్తున్నాడు. సుజాత లేచి వీధిలోకి వెళ్ళి చూసింది. ఓ గడ్డాల మనిషి ఓ రెండేళ్ళ పిల్లనెత్తుకొని జాలిగొలిపేలా నిలబడి వున్నాడు. తన కూతురంతే వయస్సు గల ఆ పిల్లని చూశాక సుజాత నిలబడలేక పళ్ళెం నిండా పప్పు అన్నం - కూర పెట్టుకొని వచ్చి ఆ ముష్టివాడి అల్యూమినియం గిన్నెలో పడేసింది. ముష్టివాడు సుజాతను దీవించి వెళ్ళిపోయాడు.

ఖాళీ పళ్ళెం పట్టుకొని వీధిలో అల్లాగే నిలబడి సుజాత ఆలోచనలో పడ్డది. విజయ్ అన్నయ్య భార్య పోయి ఆరు నెలలు అయింది. అప్పుడు వద్దామంటే తనకి కుదరలేదు. ఇప్పుడెలా వున్నాడో? భార్య పోగానే ఓ నెల రోజులపాటు మతిలేనివాడిలా ఆఫీసుకి కూడా వెళకుండా తిరిగాడట పిల్లల్ని నెలరోజులు అమ్మ కనిపెట్టి ఉందట. గడ్డం కూడా పెంచాడట. గడ్డంతో విజయ్‌ని ఊహించుకుంటుంటే చాల బాధగా ఉంది అనుకుంది— ఈవేళ సాయంత్రం వీలుచేసుకొని వెళ్ళి విజయ్‌ని చూసిరావాలి అని నిశ్చయించుకొని లోపలికి వెళ్ళింది.

విజయ్‌ని వెళ్ళి చూసిరావాలి అనుకున్నాక సుజాతకి మరి నిద్ర పట్టలేదు. శేఖర్ నిద్ర లేచేవరకు ఆగి అతనితో— "విజయ్ అన్నయ్య ఇంటికి వెడదామండీ!" అంది. శేఖర్ సరే నన్నాడు.

"అయితే అమ్మని కాఫీ పెట్టమంటాను. తాగేసి బయలుదేరుదాం" అని తొందర పడటం మొదలు పెట్టింది.

"లేడికి లేచిందే ప్రయాణం అని సామెత. మనం వెళ్ళినా విజయ్ ఆఫీసు నుంచి రావద్దూ? ఆరు గంటలకి వెళదాం" అని శేఖర్ మన్నితంగా మందలించాడు

సుజాత ఓ గంటసేపు కాలుగాలిన పిల్లిలా తిరిగి ఆ తరువాత ఏం చీర కట్టుకోవాలా అని తర్జన భర్జన పడి ఆఖరికి తన పెళ్ళికి విజయ్ కొన్న చీర కట్టుకొని తయారైంది. శేఖర్ దగ్గరకు వెళ్ళి "మరి మీరు కూడా తయారవండి" అని తొందర పెట్టింది. శేఖర్ సుజాత కేసి పరిశీలనగా చూశాడు.

సుజాత ఇబ్బందిగా కదిలి, "విజయ్ నాకీ రంగు నచ్చుతుందని బజారంతా నన్ను వెంట బెట్టుకొని గాలించి ఈ చీర నా పెళ్ళికి కొన్నాడు. ఇది నేను కట్టుకుంటే విజయ్ ఆనందిస్తాడని కట్టుకున్నాను కాని, పరామర్శకి వెళతూ ఈ చీర కట్టుకొని వెళితే ఏమన్నా అనుకుంటాడేమో! మార్చెయ్యనా పోనీ?" అని అడిగింది.

"విజయ్ భార్యపోయి ఆరు నెలలయింది సుజాతా! పోయినవాడున్న విచారం పదోనాడుండదు ఎవరికీ. విచారంలో ఉన్నవాడు ఎవరేం బట్టలు కట్టుకొని వచ్చారని చూడడు. విచారం తగ్గాక పట్టింపులు పెట్టుకొనే అవసరం ఉండదు. ఇదంతా మనస్సులో



పెట్టుకోక బయలుదేరు." అన్నాడు శేఖర్.

"మీకు సెంటిమెంట్ సున్నా. మీరు నేను వచ్చిపోతే పదోరోజుకే మర్చిపోతారు— నాకు తెలుసు కాని, మా విజయ్ అన్నయ్య మా వదిన కెప్పుడైనా కాస్త జ్వరం వచ్చి లంఖణం పెడితే, తను కూడా అన్నం మానేసేవాడు" అంది దెప్పిపొడుస్తూ. శేఖర్ జవాబు చెప్పలేదు.

సుజాతకి విజయ్ అంటే విపరీతమైన అభిమానమున్న విషయం శేఖర్‌కి తెలుసు. వాళ్ళిద్దరికీ ఏలాంటి చుట్టరికమూ లేదని కూడా తెలుసు. కొత్త పెళ్ళికొడుకు శేఖర్‌కి సుజాత విజయ్‌ని "మా అన్నయ్య" అంటూ పరిచయం చేస్తే— "మీ అమ్మగారి వైపా, మీ నాన్నగారివైపా?" అని శేఖర్ అడిగాడు. సుజాత పకపకా నవ్వుతుంటే శేఖర్ చిన్నబుచ్చుకున్నాడు. అది చూసి విజయ్ వాళ్ళ బంధుత్వం చెప్పాడు ఇది జరిగి అయిదు సంవత్సరాలు జరిగినా, విజయ్ చెప్పినవిషయం, విధానం శేఖర్‌కి గుర్తున్నది.

"ఒక విధంగా చూస్తే నేను సుజాతకి తండ్రివైపు బంధువునే- మా నాన్నగారు వాళ్ళ నాన్నగారు మంచి స్నేహితులు కనుక. మీ మామగారు ఫిజిక్స్ లెక్చరర్‌గా పని చేస్తున్న కాలేజీలోనే మా నాన్నగారు మేథమేటిక్స్ లెక్చరర్‌గా పని చేస్తూ ఉండేవారు. నాలుగు సంవత్సరాల క్రితం, అంటే నాకు పెళ్ళయిన ఏడాదికి. మా నాన్నగారు ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసి తనకి కాలేజీవాళ్ల దగ్గరి నుంచి రావలసిన డబ్బు

# మళ్ళీ పెళ్ళి

అయినా నాకో చిన్న ఇల్లు కొని పెట్టారు. ఆ మరుసటి నెల యాత్రలకని వెళ్ళిన మా నాన్నగారు తిరిగి రాలేదు. నాకు పదిహేను సంవత్సరాల వయస్సున్నప్పుడు మా అమ్మా, చెల్లెలు రైలు ప్రమాదంలో చనిపోయారు. మా నాన్నగారు తిరిగి పెళ్ళి చేసుకోలేదు. అప్పుడు ఆయన వయస్సు నలభై. ఆ వయస్సువాళ్ళు ఆ రోజుల్లో పెళ్ళి చేసుకోవడం ఉన్నదే కానీ, ఆయన చేసుకోలేదు. ఆయన ఆ రోజుల్లోనే సన్యాసుల్లో కలిసి పోవలసింది. కానీ, నాకో ఇల్లు- ఇల్లాలు ఏర్పడేవరకు ఉండి, తన ప్రాపర్టీస్ అన్నీ సెటిల్ చేసుకొని, తన బాధ్యతల శేషం మిగలకుండా చేసుకొని మరీ సన్యాసుల్లో కలిసిపోయారు. ఆయన ఉన్నంత కాలమైనా పోనీ మా యిద్దరిమధ్యా మాటలున్నాయా అంటే అవీలేవు. ఆయనెప్పుడూ ముభావంగా ఉండేవారు. అందుకే నేనెప్పుడూ సుజాతా వాళ్ళింట్లో గడిపేవాడిని. నాకంటే పదేళ్ళు చిన్నదైన సుజాత నాకు బాగా చేరువైంది. కొడుకుల్లేని ఆ దంపతులకి నేను కొడుకునయ్యాను సుజాత వాళ్ళ అమ్మగారైన సుశీలమ్మగారిని పిన్ని అని పిలవటం అలవాటైంది. అవిడలో మా అమ్మనీ, సుజాతలో ఓ చెల్లెల్నీ చూసుకున్నాను. తెలియనివాళ్లు సుశీలమ్మగారు నాకు స్వంత పిన్నేనని అనుకుంటారు అందుకని ఒక విధంగా చూస్తే నేను సుజాతకి తల్లివైపు బంధువుని" అంటూ ఉద్రేకంగా తన్నుతాను పరిచయం చేసుకున్నాడు విజయ్.

సుజాత, శేఖర్ వెళ్ళేసరికి విజయ్ ఇంట్లో ఎవరూ లేరు. తాళం వేసుకొని బయటకు వెళ్ళారు. అక్కడ గదిలో దీపం వేసుకోకుండా చీకటిలో విజయ్ విచారంగా కూర్చుని ఉంటాడని, పిల్లలు బితుకుబితుకుమంటూ వుంటారని, తను వెళ్ళి దీపం వేసి 'పిల్లల్ని చూసైనా నువ్వు మారాలి' అంటూ విజయ్‌కి చెప్పవలసి వస్తుందని ఊహించుకున్న సుజాత ఆశ్చర్యపోయింది. నిరాశ పొందింది కిటికీలోంచి కనిపిస్తున్న విజయ్ భార్య ఫోటోకి కనీసం ఓ వాడిన దండైనా లేదు!

"ఎక్కడికి వెళ్ళారో?" అంది సుజాత.

"పిల్లల్ని తీసుకుని ఏ సినిమాకో వెళ్ళుంటాడు మీ అన్నయ్య" అన్నాడు మామూలుగానే శేఖర్. కాని, అందులో వేళాకోళం కనిపించింది సుజాతకి.

"రేషన్లో ఏ పంచదారో తెచ్చుకోవడానికి వెళ్ళి ఉంటారు" అని సర్దిచెప్పుకొని శేఖర్‌తో తిరుగుముఖం పట్టింది. బహుశా తను వస్తుందని తెలిసి విజయ్ తన ఇంటికే వెళ్ళాడేమో అని అనుమానించింది. అయితే, విజయ్ ఆరోజు సుజాతా వాళ్ళింటికి రాలేదు.

దుర్గాష్టమి పొద్దున్న కూతురికి తలంటి పోసి సాంబ్రాణిపొగ వేస్తుంటే స్నేహితురాలు శకుంతల బొమ్మల కొలువు పిలుపుకు వచ్చింది.

"తప్పకుండా రావాలేవ్, సుజాతా! ఇది మా అమ్మాయి పెట్టిన మొదటి బొమ్మల కొలువు" అంది శకుంతల.

"మీరు మా యింటికి రావాలి. నేను బొమ్మలు పెడ్తాను" అంటూ శకుంతల కూతురు బొట్టు పెట్టింది.

సాయంత్రం ఉత్సాహంగా బొమ్మల కొలువుకి వెళ్ళిన సుజాత సుడిగుండంలా ఉధృతమైన కోపంతో ఇంటికి వచ్చింది. రాగానే, "అమ్మా" అంటూ ఓ పెద్ద కేక పెట్టింది.

"ఏమిటి?" అంటూ సుశీలమ్మ చేతిలో గరిటతో సహా వచ్చి, గది మధ్యలో నిలబడి బుసలు కొడుతున్న సుజాతని— "ఏం జరిగిందే?" అని అడిగింది.

"ఇది విన్నావా? అమ్మా! విజయ్ అన్నయ్య మళ్ళీ పెళ్ళి చేసుకుంటున్నాడట!" అంది ఉద్రేకంగా.



# ఖర్చులు తగ్గించుకొనేందుకు-
# సిఫార్సు ప్రకారం ఎరువులను వాడండి









నీటిసాగు వరిపంటకు సిఫార్సు ప్రకారం ఎరువులను వాడిన చాలా లాభకరం.

ఏ పంటకైనా ఎరువుల వాడకంద్వారా ఒక క్వింటాలు దిగుబడికయ్యే ఖర్చును తగ్గించవచ్చు నీటిసాగు వరిపంటకు సిఫార్సు ప్రకారం ఎరువులను వాడిన ఒక క్వింటాలు వరిధాన్యం పండించటానికి అయ్యే ఖర్చు క్రింద సూచించిన విధంగా తగ్గుతుంది.

| ఖరీఫు నీటిసాగు వరిపంట | ఎరువులు వేయకపోతే | సిఫార్సు ప్రకారం ఎరువులు వేసినప్పుడు |
|---|---|---|
| ఎకరానికి సాగుబడి ఖర్చు | రు. 900/-లు | రు. 1300/-లు |
| ఎకరానికి దిగుబడి | 8 క్వింటాళ్లు | 21 క్వింటాళ్లు |
| క్వింటాలుకు ఖర్చు | రు. 112/-లు | రు. 62/-లు |

పంట ఖర్చులు తగ్గించుకోవాలన్నా, హెచ్చు లాభాలు పొందాలన్నా సిఫార్సు ప్రకారం ఎరువులను వాడాలి నీటిసాగు వరిపంటకు అనువైన ఎరువు విజయ్ 24-24-0, ఎకరానికి 100 కిలోల విజయ్ 24-24-0ను దుక్కిలోను, 35 కిలోల విజయ్ యూరియాను పైరుమీద వేయండి. ఎరువులు యింకా సమర్థవంతంగా వినియోగింపబడటానికి ప్రతి 5 కిలోల యూరియాను 1 కిలో వేపపిండితో కలిపి వేయండి.

ఇంకా వివరాలకు ఈ క్రింది విరునామానుండి ఈ పంటకు సంబంధించిన పుస్తకాన్ని తెప్పించుకోండి.

ఏరియా మేనేజరు
మద్రాసు ఫర్టిలైజర్సు లిమిటెడ్
44, శాంతినగర్
హైదరాబాద్-500 028




పైర్లసరియైన పోషణకు



# విజయ్

| విజయ్ 24-24-0 ఎరువుల నిర్ణీత పరిమాణముల శాతం | |
|---|---|
| నత్రజని | 24 |
| భాస్వరం | 24 |
| పొటాష్ | 0 |
| నింపుడు పదార్థం (మెత్తటి ఇసుక లేదా డాలమైట్) | 20 |

HTM-MFL-2826

## మళ్ళీ పెళ్ళి

"ఎవరన్నారే ?" అని అడిగింది సుశీలమ్మ ఆశ్చర్యంగా.

"శకుంతల చెప్పింది. వాళ్ళ మిస్‌ని విజయ్ పెళ్ళి చేసుకుంటున్నాడని వాళ్ళ స్కూల్లో పిల్లలు చెప్పారట ఆ పిల్ల వచ్చి - సుజాతక్కా ! మరేమో మీ విజయ్ అన్నయ్య మా మిస్‌ని పెళ్ళి చేసుకుంటున్నాడు, తెలుసా ? అని అడిగింది అంత మందిలోనూ దానితో అమ్మలక్కలంతా "మగవాడు భార్యను మరిచిపోవడానికెంతకాలం కావాలమ్మా ! కొందరు పెళ్ళాం పోయిన మరునాడే పెళ్ళి పీటల మీద కూర్చోగల సమర్థులు అంటూ ఎంత అవమానకరంగా మాట్లాడారో తెలుసా ? నేను సిగ్గుతో తల ఎత్తుకోలేక పోయాను" అంటూ ఒక్క బిగిని జరిగిన దంతా చెప్పేసింది.

"విజయ్ నాతోగాని, మీ నాన్నగారితో గానీ ఓ ముక్క అయినా అనకుండా ..." సుశీలమ్మగారు నమ్మలేకపోయింది.

"విజయ్ రానీ, కడిగేస్తాను" అనేసి సుజాత తన గదిలోకి వెళ్ళి పోయింది.

నవమినాడు విజయ్ రాలేదు "ఏముంది ! ఆవిడగారితో షికార్లు కొడుతూ ఉండి ఉంటాడు" అనుకుంది అక్కసుగా సుజాత.

దశమినాడు పదిగంటల వేళ పిల్లల్ని తీసుకొని విజయ్ వచ్చాడు

"ఓహోహో ! విజయ్ గారా ? ఏమిటిలా వచ్చారు ?" అని అడిగింది వేళాకోళంగా, తను కూర్చున్న కుర్చీలోంచి లేవకుండా.

"అదేమిటి, సుజాతా ! ఈ వేళ విజయ దశమి గదా ! విజయదశమి నీ పుట్టినరోజన్న సంగతి నేనెలా మరచిపోతాననుకున్నావ్ ! నీ కోసం నిన్న బజారంతా తిరిగి ఈ చీర తెచ్చాను చూడు బాగుందా!" అంటూ చీర ఉన్న అట్టపెట్టె అందించాడు.

తలంటి పోసుకొని విరబోసుకున్న జుట్టు ఓ చేతో వెనక్కి నెట్టుకుంటూ, రెండో చేయి మునివేళ్ళతో అట్టపెట్టె మూత తెరిచి చూసింది

అప్పుడే గదిలోకి వచ్చిన శేఖర్ "కూర్చోండి, విజయ్‌గారూ" అని విజయ్‌తో అని "అమ్మమ్మ లడ్లూలు చేస్తున్నారు లోపలికి పొండి - మా పాప కూడ అక్కడే ఉంది" అంటూ పిల్లల్ని లోపలికి పంపాడు. విజయ్, శేఖర్ కూడా కూర్చున్నారు.

> **తేలిక కారు !**
>
> పెద్ద కార్ల తయారీలో ప్రసిద్ధి గాంచిన డేమ్లర్ బెంజ్ కంపెనీ వారు పెట్రోలును పొదుపు చేసే తేలిక రకం కారును తయారు చేశారు. ఈ క్రొత్త రకం డబ్ల్యు 201 మోడల్ కారు మధ్యరకం కార్ల కంటే కాస్త పెద్దదిగా కన్పించినా మిగిలిన వాటికంటే తేలికగా ఉంటుంది. నూరు కిలో మీటర్ల దూరానికి ఎనిమిది లీటర్ల పెట్రోలు సరిపోతుంది. ఈ కొత్త రకం కారులో 109 హార్స్ పవర్ యింజను అమర్చారు. అయితే 1983 నాటికి 68 హార్స్‌పవర్ యింజనుతో మరో రకం కారును మార్కెట్లో ప్రవేశ పెట్టగలరని ఆశిస్తున్నారు.

"అయితే, నీ కింకా నేను గుర్తున్నా నన్నమాట !" అంది సుజాత.

"అదేమిటి, సుజాతా ! నేను మిమ్మల్ని మరచిపోవడమేమిటి ?" అన్నాడు విజయ్, ఈ నిష్ఠూరాలెందుకో అర్థంకాక.

"ఈ మధ్య కొత్తగా దొరికిన ఆవిడ స్నేహంలోపడి వదిన్నే మరచిపోయిన నువ్వు, మమ్మల్ని మరిచిపోయినా పోయుంటావ్ అనుకున్నాను." సుజాతకి బాధగానే ఉంది పరామర్శ ఇలా సాగుతున్నందుకు కాని, వదిన పోయిన ఆరునెలల్లోనే పెళ్ళికొడుకుగా మారుతున్న విజయ్‌ని సుజాతలోని స్త్రీ జాతి ప్రతినిధి క్షమించలేక పోతూంది.

"కొత్త ఆవిడ ఎవరు ?" విజయ్ అనుమానంగా అడిగాడు.

"నువ్వు పెళ్ళి చేసుకోబోయే స్కూల్ టీచర్ !" సుజాత వాడిగనే సమాధానం ఇచ్చింది.

"అప్పుడే నీ దాకా ఎలా వచ్చింది ? నువ్వు వచ్చి రెండు రోజులన్నా కాలేదే " విజయ్ ఆశ్చర్యపోయాడు

"లోకం కోడై కూస్తోంది. ఏం, అబద్ధమా ?" అని నిలదీసింది - లోపల కనీసం విజయ్ అబద్ధం అని కొట్టి పారెయ్యాలని కోరుకుంటూ.

"నిజమే ! ఆ విషయమే పిన్నితోనూ, బాబాయ్‌తోను చెబుదామని వచ్చాను నేనా

నిర్ణయం తీసుకుని కూడా వారం రోజులే అయ్యింది. కాని, ఈ విషయం ఇంత త్వరగా పాకి నీకు చేరుతుందని అనుకోలేదు''

''వదిన పోయి ఆరునెలలయినా కాలేదు. నీ కప్పుడే 'మళ్ళీ పెళ్ళి' మీదికి మోజు పోయిందా ?''

విజయ్‌కి చెళ్ళున చెంప మీద కొట్టినట్టయింది

''లేదు సుజాతా! లేదు నేను మీ వదినను మరచిపోలేక పోతున్నాను. ఆమెను మరచిపోయి లోకస్మృతిలో పడటానికి నాకు తోడు కావాలి'' అన్నాడు తల వంచుకునే విజయ్.

''నేమంతా లేదూ నిన్ను మామూలు మనిషిని చెయ్యడానికి? నీ పిల్లలు పెద్దవాళ్ళే కదా! వాళ్ళని కని పెట్టుకుని ఉండక్కర్లేదు కదా ఎవరూను!''

దానికి విజయ్ సమాధానం చెప్పలేదు. సమాధానం అనుకోనిచోటు నుండి వచ్చింది. ''నా కర్థమైంది, సుజాతా! నువ్వు విజయ్‌ని ప్రేమిస్తున్నావ్'' అన్నాడు శేఖర్. విజయ్ దిమ్మెరపోయాడు.

''అవును. ఒక సోదరుడుగా ప్రేమిస్తున్నాను'' అంది ఏ తొట్రుపాటు లేని కంఠ స్వరంతో సుజాత.

''లేదు ప్రియుడుగానే ప్రేమిస్తున్నావ్! నీ ప్రేమానురాగాలనైజం ఏదో నీ కర్థమవక ముందే అతనికి పెళ్ళయింది అందుకే అది నీ కర్థంకాలేదు. కానీ, ఈ రోజున అది నీలో అమాయగా బయట పడుతోంది'' అన్నాడు దృఢంగా శేఖర్.

''లేదు. మా ఇద్దరిది అన్నా చెల్లెళ్ళ సంబంధం, అనుచితమైన ప్రేమ లేదు. మీరు నమ్మాలి'' అన్నాడు దీనంగా విజయ్, శేఖర్‌కి అనుమానం కలిగితే సుజాత జీవితం ఎంత భయంకరంగా ఉంటుందో ఊహించుకుని.

''ఎందుకని నమ్మాలి? మీరేమన్నా తోబుట్టువులా? కనీసం రక్త సంబంధం ఉన్న మాటాలా?'' శేఖర్ ధోరణిలో మార్పు లేకుండా అన్నాడు, గొంతు పెంచి మరీ.

''నాకు చిన్నప్పుడే మా అమ్మా, చెల్లెలూ చచ్చిపోయారు. సుశీలమ్మపిన్నీ, సుజాతా వాళ్ళని మరిపించి నా మనస్సుని కుదుట బరచారు'' అని విజయ్ చెబుతున్న సమయానికి, శేఖర్ గొంతువిన్నసుశీలమ్మ వంటింట్లోంచి వచ్చి గుమ్మానికానుకుని నిలబడింది.

''అయితే నువ్వూ, అత్తగారూ అతని మనస్సు అతని తల్లిమీదనుంచి, చెల్లెలుమీద నుంచి మళ్ళించారు అదే మీ అనుబంధం అన్న మాట?'' అని శేఖర్ సుజాతను సూటిగా అడిగాడు.

సుజాత అవునన్నట్టు తల ఊపింది. సుజాత కళ్ళనిండుకు నీళ్ళున్నాయి. సుశీలమ్మ ఆగలేక – ''ఈ వేళ అమ్మాయి పుట్టిన రోజు అమ్మాయిని ఏడిపించకు బాబూ!'' అని వేడుకొంది.

''మీ రాగండి అత్తగారూ! ఏడవడానికి ఇష్టం లేని వారికి ఇతరులని మాటలనే అధికారం కూడా లేదు. తను విజయ్ చెల్లెల్ని, మీరు విజయ్ తల్లిని మరిపించగలగటం గురించి గర్వపడే సుజాత— మరొకరు విజయ్ చనిపోయిన భార్యను మరిపించడానికి చేసే పయత్నం లేక విజయ్ మరొకరిద్వారా శాంతి పొందటం సహించలేక పోతోంది. ఆ విషయం తన నోటి ద్వారా అనిపిద్దామనే ఈ మాటలన్నీ అన్నాను. నాకు వాళ్ళిద్దరి మీదా అనుమానం ఎప్పుడూ లేదు. విజయ్ మళ్ళీ పెళ్ళి చేసుకోక పోతే పిల్లలు గతి ఏమిటి?'' అని ప్రశ్నించాడు శేఖర్.

భర్త తనని అనుమానించటంలేదన్న విషయం తెలుసుకున్న సుజాత వెంటనే పుంజుకుని ''విజయ్ తండ్రి మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా విజయ్‌ని పెంచలేదా?'' అని అడిగింది.

దీనికి విజయ్ సమాధానం చెప్పాడు— ''నిజానికి పెంచలేదు నాకు తిండీ, గుడ్డా ఇవ్వటం తప్పించి ఆయన నాకేం ఇవ్వలేదు. స్కూల్ నుంచి ఇంటికి వచ్చేసరికి వేడివేడిగా టిఫిన్ చేసి పెట్టే మనిషికి జ్వరం వచ్చినప్పుడు రోజులో రెండు మూడు సార్లు వచ్చి చూసే మన్షీ, పిన్నీ కాకుండా రోజంతా నన్నే అంటిపెట్టుకుని ఉండే మనిషి కావాలని ఉండేది. నాన్న అమ్మ పోయిన విచారంలో నాతో మాట్లాడకుండా ఉండేకంటే వివర్ణయినా పెళ్ళి చేసుకుంటే బాగుండేది, ఇల్లు కళకళలాడుతూ ఉండేదనిపించేది. ఆ ఒంటరితనం భరించలేక ఆయన సన్యాసుల్లో కలిసిపోయాడనిపిస్తుంది నా పిల్లలకి నా ద్వారా అటువంటి బాధ కలగరాదనే ఉద్దేశం తోనే ఈ పెళ్ళికి సిద్ధపడ్డాను. నా పిల్లలకి వేరే ఇంట్లో తల్లిని వెతుక్కోవలసిన శ్రమ తప్పిద్దామనుకున్నాను.''

''ఇలాంటి పరిస్థితుల్లోనే ఓ ఆడదుంటే ఆమె పెళ్ళిని మీ మగవారు సమర్థిస్తారా? సమర్థించరే మరి!'' అని అడిగింది సుజాత —శేఖర్‌ని, విజయ్‌ని కాని దానికి సమాధానం అప్పుడే ఆ గదిలోకి అడుగు పెట్టిన సుజాత తండ్రి ఇచ్చాడు.

''ఇటువంటి పరిస్థితుల్లోనే ఓ ఆడది ఉండి ఆమె వివాహం చేసుకుంటే తప్పేం








బులుసు వేంకటరమణయ్య

## భగవద్విశ్వాసం

భగవంతుని యందు ఎక్కువ భక్తి కలిగి ఉన్నంత మాత్రాన, ఎక్కువ కాలం ధ్యానంలో మునిగి ఉన్నంత మాత్రాన ఎక్కువ ప్రయోజనం ఉండదు. వానికంటె ముఖ్యమైనది దేవుని యందు విశ్వాసం. అదే ముఖ్యం. అది లేనప్పుడు భక్తి, ధ్యానాలు ఉన్నా, లేకపోయినా ఒక్కటే !

బాగ్దాదు పట్టణంలో ఒక గొప్ప ధనవంతుడు ఉండేవాడు. అతనికి దైవభక్తి ఎక్కువ. భగవద్విశ్వాసం అమితం. గర్వ రహితుడు. అతని కుమార్తె కూడా అన్ని విధాలా తండ్రిని పోలినదే! ఆ అమ్మాయిని తగిన వరునికిచ్చి పెండ్లి చెయ్యాలని అతని సంకల్పం. ధనవంతుల మీదికి అతని దృష్టి పోలేదు. సాధారణంగా ధనికులు అహంకార పూరితులని, వారికి దైవభక్తి, భగద్విశ్వాసం ఉండదని అతని అభిప్రాయం. దరిద్రుడైనా మంచి వరుడు కావాలని అతని కోరిక.

అతడు వరాన్వేషణ చేస్తూ చేస్తూ ఒక శుక్రవారంనాడు ఒక మసీదుకు వెళ్ళాడు. లోపల జరుగుతున్న నమాజులో తానూ పాల్గొన్నాడు. ప్రార్ధన ముగిశాక అందరూ వెళ్ళిపోయారు గాని, ఒక యువకుడు తదేక నిష్ఠతో ఇంకా మోకాళ్ళమీద కూర్చుండి ప్రార్ధన చేస్తూనే వున్నాడు. అతని దైవభక్తి ధనికునికి నచ్చినది. "నీకు పెళ్ళి కాలేదను కుంటాను. కన్యనిస్తే వివాహం చేసుకుంటావా ?"అని అడిగాడు. "నేను దరిద్రుణ్ణి. కాపురం సూర్యచంద్రులు కాన్వచ్చే చిన్న గుడిసెలో. క్రింద నేల ఎత్తు పల్లాలతోడి మట్టినేల. నాకెవ్వరు పిల్లనిస్తారు ?" అన్నాడు. "నేనిస్తాను" అని చెప్పి ఆ ధనికుడు తన పుత్రికను అతనికిచ్చి పెళ్ళిచేశాడు.

ఉత్తమురాలైన ఆ కన్య భర్త యిల్లు ప్రవేశించింది. ఇల్లు పరిశుభ్రంగా లేనందున ఊడ్చుటకు ప్రారంభించింది. ఒక మూల మూతతో ఒక పాత్ర కానరాగా "అదేమిటి ?" అని భర్త నడిగింది. "రేపటికోసం దాచి ఉంచిన రొట్టె లందులో ఉన్నవి" అన్నాడు. ఆమె కాశ్చర్యం కలిగింది. "మనకు ఆకలి కల్గించిన అల్లాయే రొట్టెను కూడా ఇవ్వడా ? రేపటికోసం దీన్ని దాచుకోవాలా ? అయితే, నీకు దేవునిపై విశ్వాసం లేదన్న మాట ! నీ భక్తి, ప్రార్ధన నటనయేనా ? నీకూ, నాకూ పొత్తు కుదరదు"అని అంటూ అక్కడి నుంచి తండ్రి యింటికి వెళ్ళిపోయింది.

భగవద్విశ్వాసం లేనివారి భక్తి, ప్రార్థన నిష్ప్రయోజనమైనవి.

(భగవాన్ శ్రీ సత్యసాయి చిన్న కథ ననుసరించి.)

---

లేదు కాని, ఆమెను పెళ్ళి చేసుకునేంతగా మన సంఘం ఎదగలేదు. అందుకని విజయ్ లాంటి వాళ్ళు మళ్ళీ పెళ్ళి చేసుకోరాదు అనడం తప్పు. అటువంటి స్త్రీలు పెళ్ళి చేసుకోవడానికి మనం సరైన వాతావరణం కల్పించాలి. రేపు మనవాళ్ళెవరైనా అల్లాంటిపిల్లను చేసుకుంటానంటే 'పిల్లలు కూడా ఉన్నదాన్ని పెళ్ళి చేసుకోవడమేమిటి, ఛీ!' అనకూడదు. అల్లాగే పూర్వం రోజుల్లో నలభై ఏళ్ళవాడికి పన్నెండేళ్ళ పిల్లనిచ్చి పెద్దలు పెళ్ళి చేసేవారు. అది తప్పే! కాని, ఈ రోజుల్లో ఏభైఏళ్ళ వాడిని ఇరవైఏళ్ళ పిల్ల ప్రేమించి చేసుకుంటే వద్దనడానికి మనం ఎవరం ?"

"అయితే, విజయ్ ఆరునెలలయినా తిరక్కుండా ..." అంటున్న సుజాతని అడ్డుకొట్టి "ఎన్నినెలలు తిరిగితే ఫరవాలేదట ! ఏడాదా ? రెండా ? మూడా ? ఎవరు చెపుతారు ? ఎవరు భార్యవల్ల ఎక్కువ సుఖపడ్డారో వాళ్ళకి భార్యా వియోగదుఃఖం

## మళ్ళీ పెళ్ళి

అధికంగా ఉంటుందని, అటువంటి వాళ్ళే తొందరగా మళ్ళీ పెళ్ళికి సిద్ధపడతారని ఇంగ్లీషులో ఓ వాడుకుంది" అన్నాడాయన.

"ఇంతకీ పిల్ల వివరాలేమిటి నాయనా ?" అని అడిగింది సుశీలమ్మ.

"ఆవిడ ఆడపిల్లల స్కూల్లో సోషల్ స్టడీస్ టీచర్. ముప్పై ఏళ్ళుంటాయి. ఒక రోజు మా అమ్మాయి స్కూలుకి లేటుగా వెళ్ళిందని ఇంటికి పంపించి వేసింది. మర్నాడు విషయం కనుక్కుందామని, నాకు వంటలో సహాయం చెయ్యటంవల్ల ఆలస్యం అయిందని క్షమాపణలు చెప్పుకునే ఉద్దేశంతో వెళ్ళాను. అల్లా పరిచయమైంది ఆవిడ — నెమ్మదిగా ఆవిడకూడా నా లాంటి పరిస్థితుల్లోనే ఉండి మగపని, ఆడపని చేసుకోలేక సతమతమవుతోందని తెలుసుకున్నాను. వారంరోజుల క్రితం ఆమెను నేను పెళ్ళి చేసుకుంటానన్నాను మొదట్లో భయపడినా, తరువాత ఒప్పుకుంది బాబయ్యగారితో అంతకుముందే చెప్పాను. ఆమెను ఒప్పుకోని ముందు, తరువాత పిన్నికి వచ్చచెప్పుదువుగానీలే అన్నారాయన."

"వచ్చిచెప్పడానికేముంది?" అని అడిగింది సుశీలమ్మ.

"ఆమెకు పూర్వమే పెళ్ళయింది. భర్త వదిలిపెట్టిన నిర్భాగ్యురాలు. ఒక కొడుకున్నాడు" అని అసలు విషయం చెప్పాడు విజయ్.

"పెళ్ళయి పిల్లాడున్నదాన్నా!" అంటూ సుజాతా, సుశీలమ్మా ఆశ్చర్యపోయారు.

"మిమ్మల్ని చూసి నేను గర్విస్తున్నాను, విజయ్! ఆడవాళ్ళకి కొన్ని పాప్యులర్ సెంటిమెంట్స్ ఉంటాయి. ఇంకా 'ఆరు నెలలు తిరక్కుండానే ..'అన్నవాళ్ళే 'పిల్లలున్నదాన్నా' అంటున్నారు. ఫర్ గెట్ వాట్ దే సే నౌ. దే విల్ బి ఆల్ రైట్ సూన్" అన్నాడు శేఖర్, స్నేహపూర్వకంగా విజయ్ చెయ్యి నొక్కుతూ.

ప్రజ్వరిల్లే ప్రతీకారంతో తన ప్రతిజ్ఞను
నెరవేర్చిన మోహన్‌బాబు వస్తున్నాడు!



శ్రీలక్ష్మీప్రసన్న పిక్చర్స్

# ప్రతిజ్ఞ



THARAKA PRABHU ADS.



సాయికృష్ణ
శ్రీసాయికృష్ణ

నిర్మాత **మోహన్‌బాబు.యమ్.** దర్శకత్వం **బోయిన సుబ్బారావు**

స్వర్ణయుగ

# మళ్ళీ స్కూళ్ళు తెరిచారు...

PRASAD





















### ఇ. ఎస్. ఆర్. — తంటాబంజి

నా వయస్సు 45 సంవత్సరములు. తల పూర్తిగా తెల్లబడినది. చాలామంది రంగు వేయించుకోమంటున్నారు. నేను రైల్వేలో గార్డుగా పని చేయుచున్నాను. ప్రతి సంవత్సరము మెడికల్ ఎక్జామినేషన్ వున్నది. అందువలన కళ్ళకు ఏమైనా ప్రమాదమున్నదా ?

★ తలకి డైయింగ్ చేయించుకోవటంవల్ల కళ్ళకి ఏ విధమైన ప్రమాదమూ లేదనే చెప్పవలసి ఉంది.

### పి. ఎస్. ఆర్. ఆర్. — ఇల్లందు

మా నాన్నగారికి 6 సంవత్సరముల నుండి దగ్గు, దమ్మువచ్చుచున్నవి. ఎన్నో మందులు, టానిక్కులు వాడినాము. కాని తగ్గలేదు. ఈ దమ్ము ఉదయం 6 గంటలకు వస్తుంది. మందు వేసుకుంటే కొంచెము నయమవుతుంది. మరలా సాయంత్రం 5 గంటల ప్రాంతంలో వస్తుంది.

★ ఉదయం, సాయంత్రం కఫ ఉత్పత్తి ఎక్కువ అవటం వల్ల క్రానిక్ బ్రాంకైటిస్; బ్రాంకియెక్టేసిస్ అనే రోగాలు ఉన్నవారికి ఇలా దగ్గు, ఆయాసం వచ్చే అవకాశం ఉన్నది.

ప్లెయిన్ ఎక్స్‌రే, టోమోగ్రామ్ మొదలయిన వాటివల్ల రోగ నిర్ధారణ జరిగి, తర్వాత మందులు వాడాలి. ఈ బ్రాంకియెక్టేసిస్ ఊపిరితిత్తులలో ఒక ప్రాంతంలో మాత్రమే ఉంటే శస్త్రచికిత్స ద్వారా ఆ భాగాన్ని మాత్రం తీసివేసే అవకాశం ఉన్నది.

### కె. ఎస్. — మచిలీపట్నం

నా వయస్సు 19 సం.లు. మేము శాఖాహారులము. కాని నాకు జ్వరము వచ్చి తగ్గాక బలంకోసం కోడిగుడ్డు పాలు మాత్రం తప్పనిసరిగా త్రాగుతున్నాను. అవి త్రాగటం మొదలుపెట్టిన తర్వాత మొహం అంతా మొటిమలు వస్తున్నాయి. అంతకు ముందు మెన్సెస్ ముందు ఒకటో, రెండో వచ్చి పోయేవి. గుడ్డు పాలు త్రాగటం మానెయ్యమంటారా?

★ పాలలో గుడ్డు కలిపి తాగటానికీ మొటిమలు ఎక్కువగా రావటానికీ ఏమాత్రం సంబంధం లేదు. అలా త్రాగటం మానెయ్యనవసరంలేదు.

### వి. వి. — కటక్

నా వయస్సు 25 సంవత్సరములు. మూడు సంవత్సరముల నుండి విరోచనం సమంగా అవటం లేదు. 24గంటలూ గ్యాస్‌పాస్ అవుతూ వుంటుంది. కడుపులో చిన్న నొక్కు గూడా వుంటుంది. ఆరు మాసములనుండి విరోచనంలో రక్తంకూడా పడుతూ వుంటుంది. ఎన్ని మందులు వాడినా రోగ నివారణ కావటంలేదు.

★ అమీబిక్ డిసెంటరీ, అల్సరేటివ్ కొలైటిస్ మొదలయిన రోగాలు ఉన్నవారికి పై లక్షణాలు వచ్చే అవకాశం ఉంటుంది.

మల పరీక్ష రెండు, మూడుసార్లయినా చేయించుకొంటేగాని రోగ నిర్ధారణ జరుగదు. అప్పుడుకూడా రోగం తేలనప్పుడు ప్రాక్టోస్కోప్‌తో ఆసన గొట్టాన్ని పరీక్షింప వలసి ఉంటుంది. దాని లోనూ తెలియకపోతే సిగ్ మాయిడోస్కోపీ చేయ వలసి ఉంటుంది. రోగ నిర్ధారణ జరుగకుండా గుడ్డిగా మందులు వాడితే ఫలితం ఉండదు.

### కె. ఎస్. ఆర్. — మద్రాసు

మా వారికి తరచూ నోటి పుండు వస్తూ ఉంటుంది. దీనికి నివారణ చెప్పండి.

★ లోనికి రిబోఫ్లేవిన్ మాత్రలు రోజుకి 30 మి.గ్రా. వంతున తీసుకోవాలి. పై పూతగా 1శాతం సిల్వర్ నైట్రేట్ దూదితో అద్ది వెంటనే ఉప్పునీటితో పుక్కిలించి ఉమ్మివేయాలి. ఇలా రోజుకి రెండుసార్లు వంతున వరుసగా 4 రోజులపాటు చేయటం అవసరం. ఈ మందు ప్రత్యేకంగా ఫార్మసీలలో చేసి ఇస్తారు.

ఆహారంలో ఎక్కువగా ఆకు కూరలు తీసుకోవాలి. కామంచి ఆకు రసం, కొబ్బరిపాలు మొదలయినవి త్వరితంగా ఉపశమనాన్ని కలిగిస్తాయి.

### పి. జి. — శ్రీకాళహస్తి

నా వయస్సు 25 సంవత్సరములు. నేను మూడునెలల క్రితం 'హైడ్రోసిల్' ఆపరేషన్ చేయించుకున్నాను. ఇప్పుడు బీజములు, పొత్తికడుపు నెప్పి వస్తున్నవి.

★ ఆపరేషన్ చేయించుకొన్న తర్వాత కొందరికి ఇలా జరిగే అవకాశం ఉన్నది. ఈ నెప్పి కూడా కొన్నాళ్ళ తర్వాత పూర్తిగా తగ్గిపోతుంది. సుగావ్రిల్ మాత్రలు పూటకి ఒకటి వంతున రోజుకి మూడు పూటలుగా వరుసగా వారంరోజుల పాటు వాడండి. దానితోబాటుగా ఒరిసుల్, లేక ఎలోక్సిన్ వంటి మాత్రలు రోజుకి ఆరు (పూటకి రెండు) వంతున అయిదురోజులపాటు వాడితే గుణం కనబడుతుంది.






శ్రీనాథ్ మూవీస్ ప్రథమకానుక

అతిత్వరలో!




సంగీతం: చక్రవర్తి.

నిర్మాత
ఆలపాటి రంగారావు * నిర్మాణ-నిర్వహణ
కోగంటి భాస్కరరావు * దర్శకత్వం
సత్తారామినీడు




(గత సంచిక తరువాయి)

**జరిగిన కథ—19:** శరత్‌బాబుపై సుజాత పెంచుకొన్న అనుమానాలు వరి భ్రమలు మాత్రమేనని రేడియోలో వచ్చిన వార్తల ద్వారా తేలిపోతుంది. అయినా ఆమె అనుమానం మాత్రం అలాగే మిగిలిపోతుంది. శరత్‌బాబుకి 'మతి స్థిమితంలేదు' అని శివప్రసాద్ ద్వారా తెలుసుకొన్న సుజాత అతనిపై తన సానుభూతిని వ్యక్తం చేస్తుంది. సుజాత గతస్మృతుల్లోకి జారుకొంటుంది. సుజాతను చూడటానికి శివప్రసాద్ వస్తాడు. శరత్‌బాబు పెళ్లయిన కొద్దికాలానికే పిచ్చివాడయ్యాడని శివప్రసాద్ చెప్పగా, సుజాత దానిక్కారణం అతని భార్యేనని వూహించుకొంటుంది. శరత్ భార్య సునంద తనలాగే ఉంటుందనీ, ఈత నేర్చుకొంటూ నీళ్ళల్లోపడి మరణించిందనీ భర్తద్వారా విన్న సుజాత శరత్తే ఆమెని చంపి వుంటాడని అనుకొంటుంది. సుజాత ఏవేవో పీడకలలు కంటుంది. శివప్రసాద్ ఢిల్లీ వెళ్లటానికి టికెట్ బుక్ చేసుకొంటాడు. సుజాత శరత్‌ని ఇంకా అనుమానిస్తూనే వుంటుంది. సుజాతకు పసుపు కొమ్ముతో, పసుపుతాడుతో తన పెళ్ళైన వైనం గుర్తొస్తుంది. క్యారియర్ మీల్స్ తెచ్చిన శరత్‌ను చూసి విస్తుపోతుంది. ఆ రాత్రి తనకు కాపలా పెట్టుకున్న పనిచేసే నర్సమ్మ కూతురు సుజాతని శరత్‌బాబే నీళ్లల్లో పడేసివుంటాడని అనుమానిస్తుంది సుజాత. ఇంతకీ అసలు పిచ్చివాడు శివప్రసాదేననీ, అతను తనకు స్నేహితుడేకాక పేషెంట్‌కూడానని సుజాతకు చెప్తాడు శరత్‌బాబు. సుజాత సహకారంతో అతన్ని మార్చటానికి ప్రయత్నిస్తుంటాడు. శివప్రసాద్‌కి ఇంతకుముందే పెళ్లయిపోయిందనీ, ఆమె పేరు సునందనీ, పుష్కర స్నానాలకు వెళ్లి కృష్ణానదిలో మునిగిపోయిందనీ చెప్తాడు శరత్ సుజాతకు. తనకింకా పెళ్లి కాలేదనికూడా చెప్తాడు. ప్రసాద్ దగ్గర పిచ్చిదానిలా నటిస్తుంటుంది సుజాత డా॥ శరత్ సలహా ప్రకారం. సుజాతకు ట్రీట్‌మెంట్ కోసమని చెప్పి ప్రసాద్‌ను మద్రాసు తీసుకొస్తాడు శరత్. తనలాగే ఉన్న శరత్ అసిస్టెంట్ డాక్టర్ రోజాను చూసి విస్మయం చెందుతుంది సుజాత!

## 25

"**త**ప్పదు! ఇంతవరకు వచ్చాక మీరిప్పుడు ఒప్పుకోకపోతే, ఇంతవరకూ చేసినదంతా వ్యర్థమే అవుతుంది."

"ఇంకా ఈ నాటకం నావల్లకాదు." మొండిగా అన్నది సుజాత.

"సరే! మీ ఇష్టం!" నిరాశగా నిట్టూర్చాడు శరత్‌బాబు.

"మరోమార్గం ఏదైనా ఆలోచించకూడదా?"

"గత్యంతరంలేదు. అన్నీ ఆలోచించే చెబుతున్నాను. ప్రసాద్‌ను ట్రీట్‌మెంటు కోసం ఎంతో శ్రమపడి ఇక్కడకు ఎలాగైతేనేం తీసుకొచ్చాను. నీకు ట్రీట్‌మెంటు ఇప్పించడానికే తను మిమ్మల్ని ఇక్కడకు తీసుకొచ్చినట్టు ప్రసాదు నమ్ముతున్నాడు. అతనికి ఆ భ్రమ కలిగించింది మనమే. ఇప్పుడు మిమ్మల్ని వదిలేసి ప్రసాదుకు ట్రీట్‌మెంటు అంటే ఒప్పుకుంటాడా?"

"ఒకసారి ప్రయత్నం చేసి చూడకూడదా?" సుజాత అన్నది.

"అలాగే ప్రయత్నిద్దాం. మీరు పైకివెళ్ళి ప్రసాదును తీసుకురండి." డాక్టర్ శరత్‌బాబు రివాల్వింగ్ ఛైర్లో గిర్రున తిరిగాడు. సుజాత ఆ గదిలో నుంచి బయటకి వెళ్ళడానికి లేచి నిల్చుంది.

"ఒక్క షరతు! ప్రసాదు పేచీపెడితే మీరు ట్రీట్‌మెంటు చేయించుకోవడానికి సిద్ధంగా ఉండాలి."

"అంటే నాక్కూడా నిజంగానే ట్రీట్‌మెంటు ఇస్తారా?"

శరత్‌బాబు ఛైర్లో గిర్రున తిరుగుతూ పెద్దగా నవ్వాడు.

"మీకు ట్రీట్‌మెంటు ఏమిటి? ఎందుకూ?"

"అదే నేను అడుగుతున్నాను?" ఆమెకళ్ళు జేవురించినాయ్. ముఖం కందిపోయింది.

"మీరు ఆడిన నాటకమే నేనూ ఆడాలి. మీరు మతిపోయినట్టు నటిస్తున్నారు గదా? అలాగే నేను మీకు ట్రీట్‌మెంటు ఇస్తున్నట్టు నటిస్తాను. మీకిచ్చే మందులు నిజమైనవి కాదు. మీకు వైటమిన్ బికాంప్లెక్సూ, టేబ్లెట్లూ ఇస్తాను. ప్రసాదుకు అసలయిన ట్రీట్‌మెంటు ఇస్తాను. అలాగే మిగతా ఇన్‌స్ట్రుమెంట్సూ మీమీద ఉట్టుట్టిగానే ప్రయోగిస్తాను. అదే సమయంలో ప్రసాదుకు అసలైన ట్రీట్‌మెంటు జరుగుతూ ఉంటుంది."

"ఇలా చేస్తే ఆయన ట్రీట్‌మెంటు చేయించుకోవడానికి ఒప్పుకుంటాడని నమ్మకం ఏమిటి?" పాలోచనగా అడిగింది.

"అదీ ఆలోచించాను. ఇక్కడ మీ పాత్ర ఒక మలుపు తిరుగుతుంది. మన నాటకానికి క్లైమాక్సు ఇక్కడే ఆరంభం అవుతుంది. జాగ్రత్తగా వినండి. ఇలా వచ్చి కూర్చోండి."

సుజాత శరత్‌బాబుకు ఎదురుగా కూర్చుంది.

అతడు ప్రారంభించాడు.

ఆమె శ్రద్ధగా వింటూ కూర్చుంది.

పదిహేను నిముషాలు గడిచాయి.

"ఇప్పుడర్థం అయిందా?" అంటూ శరత్‌బాబు లేచి నిలబడ్డాడు.

"నాటకంలో నాటకం! అంతర్నాటకం! అర్థమైంది డాక్టర్. మీరు మిస్టరీ కథలూ, నవలలూ ఎందుకు రాయకూడదూ?"

శరత్‌బాబు నవ్వాడు.

సుజాత నవ్వాపుకోలేకపోయింది.

శరత్‌బాబు టైం చూసుకొన్నాడు.

"ఉయ్ మస్ట్ స్టార్ట్ ఇట్ నౌ! మీరు వెళ్లి ప్రసాదును తీసుకురండి! నో! నో! మీరు కాదు మీరిక్కడే ఉండండి. నేను వెళ్ళి ప్రసాదును తీసుకొస్తాను. ఈ లోపల ..." అంటూ శరత్‌బాబు ఆగి టేబుల్‌కు ఉన్న బటన్ నొక్కాడు.

బాయ్ వచ్చి శరత్‌బాబు ముందు నిలిబడ్డాడు.

"డాక్టర్ రోజానూ, స్టాఫ్ నర్సునూ పిలువు!" మళ్ళీ సుజాత వైపుకు తిరిగాడు శరత్‌బాబు.

"మీరీ బల్లమీద పడుకోండి. ప్రసాద్ ఈ గదిలో ప్రవేశించేదానికి ముందే మీ యాక్షన్ మొదలవ్వాలి!"

"డాక్టర్ రోజాకూ — నర్సుకూ ..."

సుజాత అనుమానాన్ని మధ్యలో తుంచి వేస్తూ అన్నాడు శరత్‌బాబు —

"వాళ్ళకు తెలుసు. ఈ నాటకంలో వాళ్లు మైనర్ రోల్సు ప్లే చేస్తారు. ఉప పాత్రధారులు. వాళ్ళిద్దరూ డైలాగ్స్‌తో సహా రిహార్సల్స్ కూడా చేశారు. కథానాయకురాలి పాత్ర రక్తి కడితేనే నాటకం రక్తి కడుతుంది. ఆ భారమంతా మీ మీదే ఉంది."

నర్సూ, రోజా లోపలకు వచ్చారు.

రోజా! రోజా!

ఈమెను ఎక్కడో చూసినట్టుంది,

ఆమెలో తన పోలికలు.

కాదు ... తనలో ఆమె పోలికలు.

మనషిని పోలిన మనుషులుంటారు.. ఇదే కాబోలు. ఆమె ...

"ఇలారండి" సుజాత ఉలిక్కిపడింది.

రోజా సుజాత చెయ్యి పట్టుకొని ఎత్తుబల్ల దగ్గిరకు నడిపించింది. సుజాత బల్లమీద పడుకుంటూ తన మీదకు వంగి చూస్తున్న రోజా కళ్ళల్లోకి చూసింది. రోజా కళ్ళు సుజాతవైపు ఉన్నాయి. కాని ఆమె చూపులు మాత్రం ఎటో చూస్తున్నాయి.

రోజా ఏదో ఆలోచిస్తుంది.

రోజా కూడా తనలాగే ఆలోచిస్తున్నదేమో?

పది నిముషాలు గడిచాయి.

డాక్టర్ శరత్‌బాబు ప్రసాదును వెంటబెట్టుకొని గదిలోకి వచ్చాడు. ప్రసాదు వెనక ఒక నర్సూ, బాయ్ ఉన్నారు.

"నన్ను వదలండి! వదలండి!" సుజాత టేబుల్‌మీద నుంచి లేవడానికి ప్రయత్నం చేస్తున్నాది. డాక్టర్ రోజా, నర్సూ, ఆమెను అదిమిపట్టి తలకు హెల్మెట్‌లాంటిది తగిలిస్తున్నారు. దానికి ఏడెనిమిది వైర్లు కనెక్టు చెయ్యబడి ఉన్నాయి.

సుజాత చేతులు విదిలించుకొని తలకు కట్టుతున్న మాస్కును దూరంగా తోసింది.

శరత్‌బాబూ, ప్రసాదూ, సుజాత దగ్గిరకు పరిగెత్తుకొని వచ్చారు.

"డాక్టర్ ఇదేమిటి వీళ్లు నాతలకు కడుతున్నారు ఇవన్నీనూ?" అని వెంటనే భర్త వైపు చూసింది.

"చూడండీ! వీళ్ళేం చేస్తున్నారో? నాకేం జబ్బు లేదండీ! నేను బాగానే ఉన్నాను. వీళ్ళకు మీరైనా చెప్పండి" సుజాత భర్తను ప్రాధేయ పడింది.

"సుజా! ఎందుకు గాభారా పడ్తావ్? వాళ్ళ పనేదో వాళ్ళను చేసుకోనివ్వు! అడ్డు చెప్పకు!" కసిరినట్టు అన్నాడు ప్రసాదు.

"నాకు భయం వేస్తున్నదండీ?" బేలగా అన్నది.

"ఎందుకమ్మా భయం? ప్రసాద్, నువ్వా బల్ల మీద పడుకో. నిన్ను చూసైనా మీ ఆవిడ ధైర్యం తెచ్చుకోగలదు." ప్రసాదుతో అన్నాడు శరత్‌బాబు

"ఏం సుజా! అలా చెయ్యమంటావా?" ప్రసాదు అడిగాడు.

సుజాత తల ఆడించింది.



ప్రసాదు ఒక్క అంగలో రెండో బల్లదగ్గిరకు వెళ్ళి బల్ల ఎక్కి పడుకున్నాడు.

రోజా, శరత్, మరో మాస్కు తెచ్చి ప్రసాదు తలకు కట్టారు. వైర్లు తీసుకెళ్ళి స్విచ్ బోర్డు ప్లగ్గులో పిన్ చేశారు. ఆ పని పూర్తి కాగానే సుజాత తలకు మాస్కు తగిలించి అలాగే చేశారు.

శరత్‌బాబు బల్లమీదకు వంగి సుజాతకేసి చూశాడు. ఆమె అర్థయుక్తంగా నవ్వింది.

"కీపిట్ అప్?" మెల్లగా రహస్యం చెబుతున్నట్టు అన్నాడు.

ఈ లోపల నర్సు రెండు సిరంజిలలో మందు నింపుకొని వచ్చింది.

శరత్‌బాబు చేతికి ఒకటిచ్చి రెండోది రోజాకు ఇచ్చింది.

శరత్‌బాబు సిరంజిలో ఉన్న మందును రెండు బొట్లు సూదిపైకి చిమ్మి సుజాత పడుకొని ఉన్న బల్లమీదకు వంగాడు. సుజాత తల తిప్పి భర్తను చూడటానికి ప్రయత్నించింది. కాని వీలుపడలేదు.

అది గ్రహించాడు శరత్‌బాబు.

"డాక్టర్ రోజా ప్రసాదుకు అసలైన మందున్న ఇంజక్షన్ ఇస్తున్నది. నీ కిస్తున్నది 'బి' కాంప్లెక్సు ఇంజక్షన్" గొంతు నొక్కిపట్టి సుజాత చెవులో చెప్పాడు శరత్‌బాబు.

ఏదో అసాధ్యమైనదాన్ని సాధించినట్టుగా ముఖం పెట్టింది సుజాత.

"నిజంగా మీరు గొప్ప అభినేత్రి!"

సుజాత చేతి కండరంలో చురుక్కుమన్నది. సిరంజిని శరత్‌బాబు వేళ్లమధ్యన నొక్కుతున్నాడు. మెల్ల మెల్లగా అది ఖాళీ అవుతోంది. మెల్లగా, మృదువుగా సూదిని లాగేశాడు.

నర్సు వరసగా ఒక్కొక్క స్విచ్ ఆన్ చేసింది.

ఇన్‌స్ట్రుమెంట్సులో ఎలక్ట్రానిక్ ఫ్లాషెస్ పరుగులు తీస్తున్నాయి. సుజాత రెప్పలు కళ్ళమీద బరువుగా వాలిపోతున్నాయి. ఆమెకు శరీరం గాలిలో తేలుతున్నట్టుగా ఉంది. మనసులో పాల సముద్రపు అలలు సాగిపోతున్నాయి.

మస్తిష్కంలో జరుగుతున్న దేవదానవుల సముద్ర మథనం ఆగిపోయింది. హాలాహలాన్ని తోడిపోసి అమృతాన్ని సేకరించే సమయం ఆసన్నమైంది. డాక్టర్ శరత్‌బాబు సంతృప్తిగా గాలి

పీల్చుకున్నాడు. గుండెల నిండుగా గాలి పీల్చుకున్నాడు. వెర్రికిల పడిన బండిని నిలబెట్టాడు. అది పట్టాల మీదకు ఎక్కాలి. అక్కడ్నుంచి గమ్యానికి చేరాలి.

శివప్రసాదు బల్లమీద నుంచి ఒక్క గంతేసి కిందకు దూకాడు. శరత్‌బాబును రెండుచేతులతో పట్టుకున్నాడు.

"సాధించావురా బ్రదర్! సాధించావ్! కంగ్రాట్స్!" శరత్‌బాబును భుజాలు పట్టుకుని ఊపుతూ అతడ్ని ఉక్కిరిబిక్కిరి చేశాడు శివప్రసాదు. అతని మనసులో సంతోషం పరవళ్ళుతొక్కుతున్నది. పరుగులు తీస్తున్నది.

"ప్రసాద్! ఏమిట్రా అప్పుడే గంతులేస్తున్నావ్? ఆమె మనసుకథకు ఉపోద్ఘాతం మాత్రమే అయింది. ఆమె మనసులోని కథకు నాందీ ప్రస్తావన మాత్రమే జరిగింది. లెటజ్ హోప్ అల్‌ది బెస్ట్!"

శతత్‌బాబు మిత్రుడిభుజం తడుతూ అన్నాడు.

ప్రసాదు రోజావైపుకు తిరిగి "థ్యాంక్యూ! డాక్టర్!" అన్నాడు.

ఆమె అదోలా నవ్వేసి ఊరుకుంది. నర్సూ, డాక్టర్ రోజా రీడింగ్ నోట్ చేసుకుంటూ తమ పని చకచకా చేసుకు పోతున్నారు.

శరత్ వాచీ చూసుకున్నాడు. గదిలోనించి బయటకి వస్తూ— "నలభై నిముషాలబైం ఉంది. అంతవరకూ ఆమెను డిస్టర్బ్ చెయ్యకూడదు." ప్రసాదుతో అన్నాడు శరత్‌బాబు.

ఇద్దరూ బయటికొచ్చి వరండాలో నిలబడ్డారు. సముద్రపు గాలి ముఖాన్ని తాకుతుంటే హాయిగా ఉంది. శరత్‌బాబు సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు.

"ఇప్పుడు ఆరుంబావు అయింది. ఏడుగంటలకు ఆమెను లేపుతాను. అప్పుడు నువ్వు ఆమె దగ్గిర ఉండకూడదు. ఉన్నా నీమాట ఆమె వినకూడదు." అంటూ ప్రసాదుని చూసి ఆగిపోయాడు శరత్‌బాబు.

"అయితే అంతవరకూ సుజాత దగ్గిరే ఉంటాను. నువ్వు వెళ్ళిపొమ్మన్నప్పుడే వెళ్తాను" శివప్రసాదు తిరిగి సుజాత ఉన్న గదిలోకి వెళ్ళిపోయాడు.

శరత్‌బాబు తనలో తనే నవ్వుకొన్నాడు.

భార్యమీద అతనికి ఉన్న ప్రేమానురాగాలకు ముగ్ధుడైపోయాడు.

## 26

రాత్రి పదకొండు గంటలు దాటింది.

శరత్‌బాబు స్టడీరూంలో కూర్చుని ఛార్ట్స్, అబ్‌సర్వేషన్ డెటా పరిశీలించి విశ్లేషణ చేస్తూ నోట్సు రాసుకుంటున్నాడు.

ప్రసాదు గదిలోకి వచ్చాడు.

"సుజాత ఎలా ఉంది?" తల ఎత్తకుండానే అడిగాడు శరత్‌బాబు.

"నిద్రపోతూంది."

"ఎంత సేపయింది?"

"ఇప్పుడే పదిహేను నిముషాలుకూడా కాలేదు."

"సైకో థెరపీ థియేటర్‌నుంచి బయటికి వచ్చాక ఆమె ప్రవర్తనలో మార్పు ఏమైనా గమనించావా? నిన్నేమైనా ప్రశ్నలు అడిగిందా?"

ముందున్న కాగితాలను ఫైల్లోపెట్టి ప్రసాదును చూశాడు శరత్‌బాబు.

"ఉంది. చాలా మార్పు ఉంది. నన్నేమీ ప్రశ్నలు అడగలేదు. నన్ను ఏదో కొద్దిగా పరిచయం ఉన్న మనిషిని చూసినట్టే చూసింది."

"వెరీ గుడ్ !"

ప్రసాదు తెల్లబోయి చూశాడు.

"ప్రసాద్ ! ఇప్పుడు నాకు ధైర్యంగా ఉంది. సుజాతలో వచ్చిన మార్పు ఆహ్వానించ తగిందే. అంటే ఆమె మనసు థెరపీకి రెస్పాన్సు ఇస్తున్నదన్న మాట. ఆమె సబ్‌కాన్‌షస్‌కూ కాన్‌షస్‌కూ మధ్య మూసుకుని ఉన్న తలుపులు తెరుచుకుంటున్నాయి. ఆమె సబ్‌కాన్‌షస్‌నెస్‌లో అణిగిపడివున్న భావాలూ, భయాలూ, స్మృతులూ, విస్మృతులూ, వాటి మధ్య జరుగుతున్న ఘర్షణా తెలుసుకొనే అవకాశం మనకు ఇప్పుడిప్పుడే కలుగుతోంది. రేపు ఉదయం మరో టెస్టు చేస్తున్నాను. ఇవాల్టి పరీక్షలో ఆమె అర్ధ చేతనావస్థచుట్టూ వలయంలా అల్లుకొన్న అడ్డుగోడ బీటలు వారింది. రేపటి పరీక్ష చాలా ముఖ్యమైంది. డీప్ పెన్రేషన్— అంటే ఆమె అంతరాంతరాల్లోకి..."

"నీ మాటకు అడ్డొస్తున్నాను. మళ్ళీ మర్చిపోతానేమో ? నీ కొక సంగతి చెప్పాలి." ప్రసాదు అన్నాడు.

"ఏమిటదీ ?" అన్నట్టు చూశాడు శరత్‌బాబు.

"డాక్టర్ రోజాను చూసినప్పుడల్లా ఆమెలో ఏదో అలజడి జరుగుతున్నట్టు నాకన్పిస్తున్నది. మొదటి టెస్టు అయిన తర్వాత— ఈ రెండు గంటల్లో రోజాను గురించి ఏదో అస్పష్టంగా మాట్లాడింది. నాకు అర్ధం కాలేదు."

"అవును ! ఆ మార్పును నేనూ చూశాను. మొదటిసారి వాళ్ళిద్దరూ కలుసుకున్నప్పుడే ఇది మొదలైంది. అప్పటికే రంగం సిద్ధం చేశాను. సుజాత టాన్సిటరీ స్టేజిలోనుంచి బయటపడుతూనే రోజాను చూసింది. అప్పుడే ఆమెలో అలజడి ప్రారంభం అయింది. అది నేను స్పష్టంగా గుర్తించాను ?"

"నువ్వు నాచేత సుజాతకు చెప్పించిన సునందా —శరత్‌బాబు కథకూ, నువ్వు అల్లి చెప్పిన సునందా— శివప్రసాదు కథకూ— ఆ కథలో సుజాత పోలికలున్న సునందకూ, ఈ రోజాకూ ఉన్నసంబంధం ఏమిటి?"

"ఒరేయ్! ఒరేయ్! ప్రసాద్! ఏమిటవుయ్ ! నువ్వే ఒక పెద్ద సైకియాట్రిస్టువి అయి పోతున్నావ్ ?" శరత్‌బాబు అన్నాడు.

"సుజాత—సునంద,

సునంద—రోజా

∴ రోజా—సుజాత

సో ! సుజాత—సునంద"

"మార్వెలెస్ ఈక్వేషన్ ! నీకు నిజంగా మతి పోయిందిరా ! మీ ఆవిడకు కాదు, ముందు నీకు చికిత్స చెయ్యాలి." శరత్‌బాబు పెద్దగా నవ్వాడు.

"అదీ జరిగేట్టుంది. నీ ప్రయోగాలతో నాకు నిజంగానే మతి పోతున్నది. నన్ను వదిలేసి నీ ట్రీట్‌మెంటు ఏదో నువ్వు చెయ్యరా అంటే ఆలా కుదరదన్నావ్ ! ఇక నా వల్లకాదురా."

"నీ పాత్ర రంగస్థలం మీదనుంచి ఎప్పుడో తప్పుకుంది. నువ్వు ఇప్పుడు స్టేజీమీదలేవు. సుజాత నిన్ను ఇప్పుడు పరిచయం ఉన్న మనిషిని చూస్తున్నట్టు చూస్తున్నది అన్నావుగా ? దాని అర్ధం నువ్వు ఆమె మనసులో తెరమరుగై పోతున్నావు."

"సుజాత మనసులో ఇప్పుడు రోజా ప్రముఖంగా ఉన్నది."

"ప్రముఖంగా అని ఖచ్చితంగా చెప్పడానికి ఆధారాలు లేవు. ఆమెలో తన పోలికలను చూసింది. అంతకు మించిన కలవరపాటు ఆమెలో ఇంకేమీ లేదనుకుంటాను. ఆ కలవరపాటు అంతమోతాదులో కాకపోయినా, కొద్దోగొప్పో రోజాలోనూ కన్పిస్తున్నది. ఇందులో అసహజంగానీ, అసాధారణంగానీ ఏమీలేదు. తనను పోలిన మనిషిని చూసినప్పుడు ఎవరిలోనైనా ఆ మాత్రం సంచలనం కలగకమానదు. పోతే సుజాత మానసిక స్థితినిబట్టి ఆమెలో ఆ సంచలనం ఎక్కువగా ఉండొచ్చు."

"అదా సంగతి ? నేను మరొక రకంగా ఆలోచించాను. కాల్పనిక పాత్ర సునంద అచ్చం సుజాతలా ఉందని చెప్పించావు. అందుకు కారణం సుజాతకూ రోజాకూ ఉన్న పోలికలేమో అనుకున్నాను."

"దానివలన ప్రయోజనం ?"

శరత్‌బాబు శివప్రసాదు కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాడు.

"నాకేం తెలుసు ? అదీ నువ్వే చెప్పాలి."

"ఆ మాటకొస్తే డాక్టర్ రోజాకూ సుజాతకూ ఉన్న పోలికలను గురించి నేను అసలు ఆలోంచలేదు కూడా." కొంచెం ఆగి—

"మొదటిసారిగా సుజాతను చూసినప్పుడు కూడా అది నా మనసులో లేదు. కాని సుజాతను ఎక్కడో చూసినట్టు అన్పించింది. దానిక్కారణం ఆమెలో రోజా పోలికలు ఉండటమే కావొచ్చు.'

"సుజాతా — సునందా ఒకే మాదిరిగా ఉంటారని చెప్పడం వలన —"

"ప్రయోజనం వేరుగా ఉంది. కాల్పనిక సునందతో సుజాతకు ఐడెంటిటీ కల్పించడమే. ఆ ఏకీకరణద్వారా మనం కల్పించి చెప్పిన సంఘటనలు వాస్తవాలేమోనన్న భ్రమను ఆమెలో కలిగించవచ్చని ఆశించాను. అది చాలావరకూ విజయవంతమైంది. దీనిని సైకో థెరపీ పరిభాషలా ఎబ్రాక్షన్ అంటారు. రిప్రెస్డ్ ఎమోషన్స్ అంటే అణగదొక్కబడివున్న ఉద్రేకాలను, బంధించబడి ఉన్న భావ సముదాయాన్ని విడుదల చేయటాన్నే ఎబ్రాక్షన్ అంటారు. గత మూడునెలలగా నువ్వు రాసిన ఉత్తరాలద్వారా, సుజాత ప్రవర్తనా సరళిని స్టడీ చేశాను. పోయిన వారం అంతా ప్రత్యక్షంగా పరిశీలించాను. అక్కడ హైదరాబాద్‌లో సుజాత మీద జరిగిన ప్రయోగాలన్నీ, ఎబ్రాక్షన్ ఎఫెక్టు ఆమెలో కలిగించడానికే ! సుజాత తనకొచ్చిన డ్రీం గురించి నీతో చెప్పింది. ఐదోరోజు రాత్రి అనుకుంటాను — తనే సునందను అంటూ స్వయంగా నా ముందుకొచ్చి నిలిచింది. సునందగా తను చనిపోలేదనీ, సముద్రంలోనుంచి తనను ఎవరో రక్షించారనీ చెప్పింది. ఇంకా తను బ్రతికి వచ్చానన్న భ్రమలో నన్ను భుజం తట్టి నిలేసింది. ఊహాతీత అభూత కల్పనలో తనే సునందయి నా ముందు కొచ్చిన సుజాతను ఆ రాత్రి చూసినప్పుడు నా వెన్ను జలదరించింది ! ఆ రాత్రే ఆమెకు కల వచ్చింది. ఆ కలలోనుంచి హఠాత్తుగా లేచి నీకు ఆ కల గురించి వివరించింది. ఆ కలలో కూడా ఆమె తను సునంద అయిపోయినట్టు చెప్పింది. పోతే ... జస్ట్ ఏ మినిట్ ..."

శరత్‌బాబు టేబుల్‌మీద ఉన్న ఫైలు అందుకున్నాడు.

(ఇంకా వుంది)






# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

### జి. హెచ్. ఆర్. — వైజాగ్

గొప్పవారి సరదాలెలా తీరుతున్నాయి కె.రా. ?

★ పేదల కన్నీళ్లతో — క్రా్మేడ్ !

### డి. వి. ఆర్. — సికింద్రాబాద్

మీకు అబ్బాయిలు లేరు. కొరివి ఎవరు పెడతారు?

★ ఎలక్ట్రికల్ క్రిమటోరియం వచ్చింది. కొరివితో పనిలేదు. నేను చావను. నేను వదలి వెళ్లిన వాళ్ల గుండెల్లో జీవిస్తూనే వుంటానన్న నమ్మకం నాకుంది!

### డి. జి. వి. — బైపల్లి

పుట్టిన ప్రతి మనిషీ స్వర్గసుఖాన్నే కోరుకోవడంలో మీ అభిప్రాయం ? అసలు స్వర్గం అనేది వుందా అని

★ తెలియనిదే—స్వర్గం అనుభవించాలని ఉండీ అందనివే— స్వర్గసుఖాలు. అందనివాటిని కోరుకోవడమే కదా మానవ నైజం?!

### వి. ఆర్. ఆర్. — మహబూబ్‌నగరు

ఆదర్శాన్ని స్వార్థానికి తాకట్టు పెట్టడంకంటే ఆత్మహత్యకు తలపడడమే ఎంతో మేలు అని నా అభిప్రాయం

★ చిత్తం! ఆ ఆదర్శం ఏమిటో దాన్ని పట్టి వుంటుంది!

### కృష్ణ — బైపల్లి

నేటి ప్రేమలు ఉట్టి భ్రమలు అంటాను. మీరు ?

★ నేటి వే కాదు. ప్రేమ భ్రమే. అదే లేకుంటే జీవితం మరీ థ్రిల్ లేకుండా పోతుంది.

### కె. ఎస్. కె. — అమ్మనబ్రోలు

కోర్టులో త్రాసు చేతపట్టుకొని, కళ్లకు గంతలు కట్టుకొన్న ఒక స్త్రీ ప్రతిమ వుంటుంది. స్త్రీయే ఎందుకుండాలి ? పురుషుడు ఎందుకుండకూడదు ?

★ ధర్మదేవత స్త్రీ మూర్తి కనుక. అంతే కాదు. ఆమెకు న్యాయాన్యాయ విచక్షణతోనేగాని దృష్టితో పనిలేదు. ఇక స్త్రీయే ఎందుకుండాలంటే నేనేం చెప్పకలను ? మగవాని చేతి బిడ్డలాగా 'ధర్మం' వారిచేత రాణించదనేమో అర్థం !! ఓర్పుకి, న్యాయానికి పెట్టింది పేరు — స్త్రీ. అందుకే భూమాత స్త్రీ. ధర్మదేవత స్త్రీ.

### జి. వి. కె. ఆర్. — విశాఖపట్నం

మార్గం నిర్ణయించుకున్నా ధైర్యం చాలడం లేదు.

★ చూడు బ్రదర్, కొన్ని పనులు చేయడానికి శక్తి అక్కరలేదు! కాని — అవి అమలులోకి తేడానికే — శక్తి చాలా అవసరం!!

### ఎ. కె. కె. — జెల్లంపల్లి

ప్రతి ఏడూ స్వాతంత్ర్యం వచ్చిందని పండుగ జరుపుకుంటున్నాం. కాని మగవారికే వచ్చింది. మన స్వతంత్రం గురించి మరొక పోరాటం జరపాలి. అప్పటికిగాని ఆడవాళ్లకి స్వేచ్ఛ రాదంటాను.

★ చిత్తం. అప్పుడూ రాదు — కొందరికి. ఎందుకంటే స్వాతంత్ర్యం— యిస్తినమ్మ వాయినం, పుచ్చుకొంటినమ్మ వాయినం, అంటూ ఒకళ్లు యిచ్చేది ఇంకొకళ్లు పుచ్చుకొనేది కాదు ‹అదొక వ్యక్తిగత ఆరాటం. నిలువ నీడా తిన తిండీ కట్ట బట్టా యిస్తూంటే — యింకా స్వతంత్రం దేనికి అని అడిగేవారున్నారు. స్వంత అభిప్రాయాలని వెలిబుచ్చడం, చెప్పినమాట వినకపోడం అనిపిస్తుంది కొందరికి. దైనందిన జీవన సమరంలో ఆడదాన్ని కూడా సాటి మనిషిగా గుర్తించి ప్రవర్తించమనే— ఆడవారి పోరాటం— అది కత్తి కర్రాతోనో, మాటల యీటెలతోనో సాగదు. మానసికమైన ఎదుగుదల ద్వారా; వ్యక్తిత్వం పెంపొందించుకోవడం ద్వారా, జరుగుతుంది. చదువుసంధ్యలు; వ్యక్తి, ఆర్థిక స్తోమత ఇవి ధైర్యాన్నిస్తాయి. హక్కులుండగానే సరికాదు. వాటిని అవసరమైనప్పుడు ధైర్యంగా వాడుకోవాలి. అదీ నిజమైన స్వతంత్రం.

### జగన్ — ఉరవకొండ

ఒక స్త్రీ జీవితంలో ముఖ్యమైన ఘట్టం ఏది?

★ ఆమె పుట్టుకే కాబోలు !

ఇందిరాగాంధీపై మీ అభిప్రాయం ?

★ గట్స్ వున్న వ్యక్తి ఆమే లేకపోతే — ఈ దేశం గతి యింకా ఎలా వుండేదో — ఊహించడానికి కూడా భయంగా వుంటుంది

దేవునికి టెంకాయ ఎందుకు కొట్టడం ?

★ ఖర్చు లేకపోతే — భక్తికి విలువ వుండదు కనుక.

### ప్రఫుల్ల — ధర్మవరం

మిమ్మల్ని చూడాలని వుంది. మీతో మాట్లాడాలని వుంది. పల్కరిస్తారా ? పూరీల కర్ర చూపిస్తారా ?

★ వచ్చి చూడకూడదా ప్రఫుల్లా ?!






# చీకట్లో

శివప్రసాద్



చీకటి ఆలోచిస్తోంది ఎవరింట్లో ప్రవేశిద్దామా అని. చుట్టూ కలియజూసింది. అన్ని చోట్ల రంగు రంగుల దీపాలు మిలామిలా మెరుస్తున్నాయి. ఊహూ... అక్కడకి వెళితే తనని పురుగుని చూసినట్టు చూస్తారు. తనని ఎవరూ ఖాతరు చేయరు. అదిగో! ఆ ఇంట్లోకి వెళదాం. అందులో రామశర్మ అనే డబ్బై ఏళ్ళ ముసలి మాజీ మాష్టారు గారు, అరవై ఏళ్ళు పై బడ్డ పార్వతమ్మ అనే అతని సతీ మణి ఉంటున్నారు. వారిని కంగారు పెడదాం. అటు వంటి వాళ్ళైతేనే తనకు భయపడతారు. చీకటి కాంతి కిరణాల వేగంతో ఆ ఇంట్లోకి పరుగు తీసింది.

"ఏమండీ! ఇంక ఎంతసేపు అలా కుట్టు కుంటారు? రేపు నేను కుట్టిపెడతాను ఆ పంచని ... ... చీకటి పడింది... కళ్ళకు అంత మంచిది కాదు" పార్వతమ్మ నులక మంచంలోంచి లేచే ప్రయత్నం చేస్తూ హీన స్వరంతో అంది.

"అవును కదూ! చీకటి పడింది. నాకేమీ తెలియనే లేదు! అహ పార్వతీ! నీవు పడుకో. లేవకు. లాంతరు వెలిగిస్తాను." రామశర్మ లేచి ఊడిపోబోతున్న కండువాను మొలకు గట్టిగా బిగించి కట్టాడు. పంచను ప్రక్కనే ఉన్న కుర్చీమీద వేసి పార్వతమ్మ పడుకుని ఉన్న నులక మంచం వైపు నడిచాడు.

"పార్వతీ! జ్వరం కొంచెం తగ్గినట్టుగా ఉందే?" మంచంమీదకి వంగి ఆమె నుదుటి మీద చేయి వేస్తూ రామశర్మ అన్నాడు. పార్వతమ్మకు కళ్ళలో గిరుక్కున నీళ్ళు తిరిగాయి. 'మీకు ఎంత కష్టం కలిస్తున్నానండీ' అని వాపోయింది మనసులో. పార్వతమ్మ కనుకొనల్లో నిలిచిన నీళ్ళు ఆ చీకటిలో

మంచి ముత్యాల్లా మెరుస్తున్నాయి. రామశర్మ విస్మయం చెందాడు.

"ఎందుకీ కన్నీరు పార్వతీ! నేనున్నానుగా. బాధపడకు." రామశర్మ ఆమె అరచేతిని తన చేతుల్లోకి తీసుకుని కాసేపు మృదువుగా నిమరాడు.

"ఉండు పార్వతీ! లాంతరు వెలిగించటం మరచిపోయాను. ఆ పనిచేసి వస్తాను" మంచం దగ్గరనుంచి కదిలాడు రామశర్మ. లాంతరు వెలిగించి గదిలో మధ్యగా ఉంచాడు. లాంతరు ఉండి ఉండి ఆరిపోవటానికి ప్రయత్నిస్తూ ఉంది. 'అవును! ఈ ఇంట్లో అన్నీ పాతబడిపోతున్నాయి'. రామశర్మ అనుకున్నాడు. పార్వతమ్మ ఉన్నట్టుగా లేనట్లుగా లేని చీర కొంగుని చేతిలోకి తీసుకుని కళ్ళు తుడుచుకుంటూ కనిపించింది. రామశర్మ మరల ఆమె వద్దకు వచ్చాడు కలత చెందిన మనసుతో.

"పార్వతీ! రోజూ నీవు చేసే ఈ పనులు నేను చేస్తున్నాననేగా నీకీ బాధ. ఫరవాలేదు పార్వతీ! రెండురోజుల్లో నీ జ్వరం తగ్గిపోతుంది. మరల నీవే చేద్దువుగానిలే" రామశర్మ అనునయించాడు. పార్వతమ్మకు మాటలు పెగలలేదు. భర్త చేతిని తన గుండెమీదకు తీసుకుంది, ఉప్పొంగుతున్న ప్రేమాభిమానాలతో.

"పార్వతీ! కాస్త గ్లూకోజు కలిపి ఇస్తాను" తన చేతిని ఆమె చేతిలోంచి విడిపించుకుని వంటింట్లోకి వెళ్లాడు. గ్లాసుతో నీళ్ళుతెచ్చి అందులో గ్లూకోజు కలిపాడు గ్లాసుని ఆమెకు అందించాడు. పార్వతమ్మ లేచి కూర్చునే ప్రయత్నం చేయబోయింది. కాని అంత సత్తువ ఉన్నట్టు అనిపించలేదు. ఎంతో నీరసంగా ఉంది.

"పార్వతీ! లేచి కూర్చోవటమెందుకు. నేను ఒక్కొక్క చెంచాయే నోట్లోపోస్తాను. త్రాగుదువుగాని" మంచంలో సగం లేచి కూర్చున్న పార్వతమ్మను తిరిగి పడుకోబెట్టాడు. ఆమె నోట్లో ఒక్కొక్క చెంచాయే పోశాడు రామశర్మ. ఆమె 'ఇంక చాలు' అన్నట్టుగా చేయి ఊపింది. రామశర్మ పోయటం ఆపి గ్లాసుని మంచం కింద నేలమీదుంచి దానిపై మూతపెట్టాడు.

ఇది ఏనాటి పాపమో! తను ఎప్పుడూ ఇంతటి విశాల హృదయుడైన భర్తకి సేవలు చేస్తూ తనువు చాలించాలని ఆశపడింది. కాని ఇటువంటి పాపిష్ఠి రోజు వస్తుందని, ఈ వయసులో ఆయనకి తను ఇంత కష్టం కలిగిస్తుందనీ తాను ఏనాడూ ఊహించలేదు. పార్వతమ్మ కళ్ళు మరల అశ్రుపూరితాలయ్యాయి. కన్నీరు ధారగా ప్రవహించలేక ఆమె చెక్కిళ్ళపై చర్మం ఏర్పరచుకున్న ముడతల్లో క్రమక్రమంగా స్థానం సంపాయించుకుంటోంది. తనని క్షమించమన్నట్టుగా చేతులు జోడించి భర్తకి నమస్కరించింది పార్వతమ్మ.

"ఛ... ఇదేమిటి పార్వతీ! ఈమాత్రందానికి ఇంతగా బాధ ఎందుకు? ఇన్నేళ్ళుగా నీవు నాకు ఎనలేని సేవలు, సపర్యలు చేయలేదా... వీటితో పోలిస్తే నేను నీకు చేస్తున్నది ఏపాటిది చెప్పు! నీలాంటి భార్యకు సేవ చేయటానికి ఏ భర్తా సిగ్గుపడడు. బాధపడడు. అటువంటి అదృష్టం నాకు ఈనాటికి కలిగినందుకు ఒకప్రక్క ఎంతో సంతోషంగా ఉంది. మరోప్రక్క ఎంతో..." రామశర్మకు పెదిమలు విప్పడటంలేదు. ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి. భార్య జబ్బు పడుతుందనీ, ఇలా కృశించి పోతుందనీ తను ఏనాడూ అనుకోలేదు.

"ఏమండీ వయసులో ఉన్నప్పుడు... సేవలు చేయటం వేరు. కాని ఈ వయసులో... పోనీ అబ్బా..." పార్వతమ్మ అప్రయత్నంగానే ఆ మాట అంది. కానీ ఇంక ఆ వాక్యాన్ని పూర్తిచేయలేకపోయింది. అబ్బాయి, కోడలు ఈ పరిస్థితుల్లో దగ్గరుంటే ఎంత బావుండేది! పోనీ వెళితే... పరిస్థితి వివరిస్తే... రావచ్చేమో! కాని ఈయనకి అభిమానం ఎక్కువ! తను వెళ్ళరు! ఈ విషయం ప్రస్తావనకు తెచ్చి ఆయన మనసుని నొప్పించినది అవుతుందే కాని వేరే ప్రయోజనముండదు! తమ ఏకైక సంతానం సుందరం! కనీసం రేపోమాపో రాలిపోయే స్థితిలో ఉన్న ఇప్పుడైనా నవ మాసాలు మోసి, కని వాడిని ఇంతవాడిగా చేసిన ఒక తల్లిగా వాడు తమని సాకాలని ఆశించే హక్కు లేదాతనకి!? అది దురాశ అవుతుందా!? ఎంత విచిత్రం ఈ సృష్టి! పార్వతమ్మ మనసున సమాధానం దొరకని కొన్ని ప్రశ్నలు, సందేహాలు వేధిస్తున్నాయి.

"పార్వతీ! ఒక మనిషిగా నేను, కన్నతల్లిగా నీవు అనుభవిస్తున్న క్షోభని అర్థం చేసుకోగలను. అంతకుమించి నానుండి మరేమీ ఆశించకు. నీకు అండగా నేనున్నాను పార్వతీ! నీవు అధైర్యపడకు." ఎంతో గంభీరంగా వెలువడ్డాయి ఆ మాటలు రామశర్మ పార్వతమ్మ భుజాన్ని మృదువుగా తట్టి అక్కడనుంచి కదిలాడు. వంటింట్లోకి వెళ్ళి బియ్యం కోసం ఎసరుపెట్టాడు. కట్టెలు పొయ్యిలోపెట్టి వెలిగించాడు. అవి అంటుకునేదాకా విసరి వంటింట్లోంచి బయటికి వచ్చాడు. పార్వతమ్మ దగ్గర కూర్చుని కాసేపు ఆమె నుదుటిమీద అమృతాంజనం వ్రాశాడు. తిరిగి వంటింట్లోకి వెళ్ళాడు.

* * *

రామశర్మ జావ తయారుచేసి పార్వతమ్మతో త్రాగించాడు. తాను భోజనం ముగించి వంటింట్లోంచి బయటికి వచ్చాడు. లాంతరు కాంతిని తగ్గించాడు. బల్ల క్రింద ఉన్న చాపను తీసి పార్వతమ్మ పడుకుని ఉన్న మంచం దగ్గరగా పరచాడు. కుర్చీమీద వేసిన పంచను కట్టుకున్నాడు. కండువాని మడతలు చుట్టి తలవైపు చాప మీద ఉంచి మేనివాల్చాడు.

రామశర్మ మెదడు పుట్టినప్పటినుంచి ఆలోచిస్తూ ఉంది. ఇప్పటికీ ఆలోచిస్తూనే ఉంది అవిరామంగా! కాని గతంలో కలిగిన ఆలోచనలకి వర్తమానంలోని ఆలోచనలకి ఎంతో తేడా. ఇప్పటికీ ఆలోచనల్లో ఏదో క్రొత్తదనం! బహుశ ఈ క్రొత్తదనం గతానికి వర్తమానానికి మధ్యగల వ్యత్యాసంలోంచి పుట్టినదేనేమో! తను పుట్టాక డబ్బై క్యాలెండర్లు మారాయి. అన్నింటిలోనూ అవే అంకెలు! ఆ అంకెలు రకరకాలుగా కలిసి తనకు తెచ్చిన సమస్యలూ, నేర్పిన 'లెక్కలు' ఎన్నో... ఎన్నెన్నో... ఆ అంకెలు ఎప్పటికప్పుడు ఏవేవో క్రొత్త క్రొత్త పాఠాలు తనకి నేర్పాలని తాపత్రయపడుతూనే ఉన్నాయి.

తనకి అప్పుడే డబ్బై సంవత్సరాలు నిండాయి! చూస్తూచూస్తూ ఉండగానే తను వృద్ధాప్యంలోకి అడుగుపెట్టేశాడు. బాల్యం, యవ్వనం మొదలైన దశలన్నీ క్రొవ్వొత్తుల్లా కరిగిపోయాయి. ఆ దశల వంతెనలన్నీ తను తనకి తెలియకుండానే ధాటుకుని వచ్చేశాడు. ఆ వైపు తిరిగి చూస్తే కలిగే అనుభూతి ఆశ్చర్యం? వింతగాఅనిపిస్తుంది తనకి ఈ జీవన యాత్రలో ఇంక ఆఖరి మజిలీ మిగిలి ఉందన్న నిజం గుర్తుకొచ్చినప్పుడల్లా!

రామశర్మ ఇంటి పైకప్పు వంక చూశాడు.












కుర్చీకేసి చూశాడు. నులకమంచం వైపు చూశాడు. తను పడుకుని ఉన్న చాపకేసి, కట్టుకున్న పంచకేసి, తన శరీరంకేసి పదే పదే చూసాడు. అవును! అన్నీ పాతబడి పోయాయి. ఇంటి పైకప్పుకి బూజు పట్టి ఉంది. కుర్చీకోడు విరిగిపోయింది. మంచానికి ఉన్న తాడు తెగిపోతూ ఉంది. చాప చిరిగిపోయింది. పంచకి చిల్లులు పడ్డాయి. అవును! తను కూడా పాత బడిపోయాడు. కాని... ఈ ప్రాణం లేని వస్తువు లన్నీ ఇంకా ఆరాటు పడుతూనే ఉన్నాయి తనతో కలసి జీవించాలనీ, తనతోపాటే తాముకూడా అంత రించిపోవాలనీ. తన సంతానమంతా ఇదేనా ... ఈ ప్రాణంలేని జీవులేనా? ఇవి చూపిస్తున్న అప్యాయతానురాగాలు మనిషిగా పుట్టిన తన ...!

రామశర్మ మనసులో కాలం వ్రాస్తున్న స్వీయ చరిత్రా గ్రంథంలో కొన్ని అనుభవాల పుటల్ని అతని మెదడు చదవటానికి ప్రయత్నించింది.

పన్నెండేళ్ళ క్రితం ... తాను స్కూలు మాష్టరుగా రిటైరయినరోజు అది. ఆ రోజు తన హృదయంలో ఏదో గుబులు, మరింకేదో దిగులు. ఇన్నేళ్ళుగా ఒక వ్యవస్థలో పనిచేశాడు తను. ఈనాడు అదే వ్యవస్థ 'బాబూ! నీ వయస్సైపోయింది. ఇంక నీతో పనిలేదు' అన్నట్టుగా తనని ఒక అశక్తుడిగా మార్చటానికి ప్రయత్నిస్తూ తనని వెళ్ళిపొమ్మంటోంది. రేపటినుంచి ఇంక ఇంటిదగ్గరే ఉండాలి. ఇక్కడికి రానక్కరలేదు. మనసులో ఎలాగో ఉంది. బాధగా ఉంది. బరువెక్కిన హృదయంతో ఇంటికి వచ్చాడు తను.

కొడుకు, కోడలు, పిల్లలు ఇద్దరు ఎక్కడికో ప్రయాణమవుతున్నారు. పార్వతమ్మ కళ్ళల్లో నీరు. తనని చూడగానే ఒక్కుదుటున లేచివచ్చి భోరుమని ఏడ్చింది. తనకి అంతకు పూర్వం ఏం జరిగిందో అప్పుడు ఏం జరుగుతోందో ఏమీ బోధపడలేదు.

"ఏమిటి పార్వతీ! ఏమయ్యింది? ఎందుకలా ఏడుస్తున్నావ్?" తను పార్వతిని ఆత్రుతగా అడిగాడు.

"ఏమండీ! వీళ్ళు వెళ్ళిపోతారుట!" వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ సమాధాన మివ్వగలిగింది పార్వతి.

"ఎక్కడికి?" తను విస్తుపోతూ అడిగాడు.



# ద క్షి ణ

"వీళ్ళు ఈ ఊర్లోనే వేరే కాపురం పెట్టు కుంటారుట!"

"ఆఁ" తను దిగ్భ్రాంతి చెందాడు. నమ్మలేక పోయాడు.

"బాబూ సుందరం! ఏమిటి బాబూ! ఇది నిజమేనా?"

సుందరం ఏమీ మాట్లాడలేదు. మరో ప్రక్కకి చూస్తూ ఉండిపోయాడు. తను కోడలి వంక చూశాడు ప్రశ్నార్థకంగా.

"ఏమీ మాట్లాడరేమిటండీ, చెప్పండి" కోడలు గద్దించింది సుందరాన్ని. కోడలి గొంతులో అంతటి కాఠిన్యత ధ్వనించగలదని మొదటిసారిగా తెలుసు కున్నాడు. ఖిన్నవదనుడై నిలబడ్డాడు తను.

"నాన్నగారు! ఇంక ఇక్కడ ఉండదలుచుకో లేదు. పిల్లల స్కూలుకి, నా ఆఫీసుకి చాలా కష్ట మవుతోంది రోజు. అందుకే వీటన్నింటికి వీలుగా నా ఆఫీసుకి, పిల్లల స్కూలుకి దగ్గరగా ఉన్న పోర్షన్ ఒకటి తీసుకున్నాను."

## ఆస్పత్రిలో పాఠాలు!

పశ్చిమ జర్మనీలోని న్యూరెంబర్గ్ ఆస్పత్రిలో వైద్యం చేయడమేగాక, పాఠాలు కూడా చెబుతున్నారు. ఆస్పత్రిలో వైద్యం కోసం చేరిన చిన్నపిల్లలు చదువుల్లో వెనుక బడకూడదనే వుద్దేశ్యంతో యీ కార్య క్రమాన్ని చేపట్టారు. అంతేగాక, ఆస్పత్రిలో ఎక్కువ కాలం వుండటంవలన ఏర్పడే విసుగును యీ విధంగా తొలగింపవచ్చునని భావిస్తున్నారు. ఇది ఏ విధంగానూ చికిత్సకు అడ్డుకాదనీ, చిన్నపిల్లలకు తగినంత పని లేకపోవడం పెద్ద లోపం కాగలదని ఆ డాక్టర్లు అంటున్నారు. చిన్నపిల్లలకు లక్ష్యసాధన, దానినందుకోడానికి ప్రోత్సాహకరమైన బహుమతులు వుండాలని వీరి వుద్దేశ్యం. ఈ కార్యక్రమాన్ని 1979లో ప్రారం భించారు.

"పోనీ ఈ ఇల్లు అద్దెకి ఇచ్చేస్తాను. మేమిద్దరం కూడ నీతోపాటే వచ్చేస్తాం. బాబూ సుందరం! నీవు దగ్గర లేకుండా మేము జీవించ గలమా నాయనా! ఈ వయసులో మమ్మల్ని ఒంటరిగా వదలి వెళ్ళిపోవటం ధర్మమా బాబూ ఆలోచించు మరొక్కసారి!" కొడుకు తమ సున్నిత హృదయాలపై సమ్మెట దెబ్బలు కొడుతుంటే అలా 'చిత్రవధ చేయొద్ద'ని జన్మదాతలు చేసే చివరి ప్రార్థన అది! ఆనాడు తల్లి గర్భం నుంచి బయట పడాలని తహ తహ. ఈనాడు ఈ ఇంటినుంచి బయటపడాలని తహ తహ. ఏమిటో ఈ తహ తహ ఎక్కడికో 'ఈ' మనిషి 'పయనం'!

"అక్కడ చాలా ఇరుకుగా ఉంటుంది నాన్న గారు! రెండు గదులే తీసుకున్నాను."

"ఇక్కడ మన ఇంటికి ఉన్నవికూడా రెండు గదులే కదా బాబూ!" ఈ సృష్టిలోని మనుషు లందరి హృదయాలు ఇరుకుగా అయిననాడు ఇంతటి విశాల ప్రపంచంలోనూ ఒక్క సున్నిత మనస్కుడు జీవించటానికి పాదం మోపేంత స్థలం కూడా దొరకదేమో!

"నాన్నగారు! లాభనష్టాలన్నీ బేరీజు వేసుకునే ఈ నిర్ణయం తీసుకున్నాను, ఇంక మాకు అడ్డు పడకండి" అడ్డుపడేందుకు తానెవరు? ఎందరో కొడుకులు! ఎందరో తండ్రులు! వారందరిలోను ఒక కొడుకుకి తానొక తండ్రి! ఎందరో పుట్టారు. మరింకెంతమందికో జన్మల నిచ్చారు. అందరూ పోతూనే ఉన్నారు. అన్నీ కదలిపోతూనే ఉన్నాయి. ఇందులో ఎవరు ఎవరిని అవగలిగి ఉండినా ఈ సృష్టి ఇలాగే ఉండేదో... ఇంకెలాగో ఉండేదో... అయినా తన పూర్వీకులు చేయని పనిని చేసే హక్కు తనకెక్కడిది? కదలిపోనీ ఈ సృష్టిని! అందుకే మారు మాట్లాడలేదు తను. వెళ్ళిపోయాడు తన ఒక్కగానొక్క కొడుకు!

తను ఆనాడు ఆ విధంగా సరిపెట్టుకున్నాడు. కాని... రోజులు గడుస్తున్నకొద్దీ, వయసు ముదురు తున్నకొద్దీ ఆయుష్షు క్షీణిస్తున్నకొద్దీ తనలో ఏదో అశాంతి, అసంతృప్తి, బాధ చోటు చేసుకుంటు న్నాయి.

తన బాల్యమిత్రులు, సహోద్యోగుల్లో కొంత మంది చనిపోయారు. ఇంకా కొంతమంది బ్రతికే







ఉన్నారు. మరి తన జీవితం వారి జీవితాల్లా ఉందా! వాళ్ళలో చాలామంది కొడుకులు, కోడళ్ళ దగ్గరే నివసిస్తున్నారు. అప్పుడప్పుడు కూతుళ్ళ దగ్గరికి వెళ్ళివస్తూ ఉంటారు. మనవళ్ళు మనవరాండ్రతో ఆడుకుంటున్నారు. పండగలకి కొడుకులు కూతుళ్ళు కానుకలు సమర్పించుకుంటూ ఉంటారు. ఓహ్! మరి తన విషయం... తన కలాంటి కొడుకులతో, కోడళ్ళతో, కూతుళ్ళతో పనిలేదా...వాళ్ళ ప్రేమాను రాగాలు తనకి అవసరంలేదా? తనకి మనవళ్ళు మనవరాండ్రచే 'తాతయ్యా' అని పిలిపించుకోవాలనీ, వారితో ఆడుకోవాలని ఆశపడే హక్కు లేదా? తన విషయంలో అలా ఆశించడం నేరమవుతుందా లేక ప్రకృతి విరుద్దమవుతుందా? ఈ జీవం లేని వస్తువుల్లోనే తను అందర్నీ చూసుకుంటూ వీటితోనే ఆడుకుంటూ కాలం వెళ్ళబుచ్చాలా?

తను ఎంతోమందికి అక్షరాభ్యాసం చేయించాడు. పాఠాలు నేర్పాడు. ఎందరో విద్యార్థులకు తను గురువుగా మసిలాడు. వారి తల్లితండ్రుల మన్ననలు పొందాడు. తమ కొడుకుల్ని చక్కటి విద్యార్థులుగా తీర్చిదిద్దిన తన కృషిని కొనియాడారు. ఆ క్షణాలు ఒక గురువుగా తానెన్నడూ మరువలేనివి. కాని... కాని ఆ శిష్యులలో కొందరు తనకే పాఠాలు నేర్పబోయిన ఆ క్షణాన... తను గర్వించాలా? గర్హించాలా? ఆనందపడాలా? ఆక్రోశించాలా? విద్యార్థులందరూ ఒక గురువుకి ప్రియశిష్యులు కాలేరు. కాని తన ప్రియశిష్యులలో ముఖ్యుడైన ఒకడు రాసిన ఉత్తరానికి తను ఏం సమాధాన మివ్వాలి! ఒకప్పటి తన స్టూడెంటు ఇంత వాడయ్యాడని సంతోషించాలా? బాధపడాలా? సమస్యలు ఎదురవ్వడం వాటిని పరిష్కరించడం క్రొత్తేమీకాదు రామశర్మకి. నాలుగురోజుల క్రితం తన శిష్యుడు వ్రాసిన ఉత్తరాన్ని మరల చదవా లనిపించింది. చాపమీదినుంచి లేచి కూర్చున్నాడు రామశర్మ. పార్వతమ్మ కేసి చూశాడు. ఆమె నిద్రపోతూ ఉంది. రామశర్మ లేచి బల్లమీద ఉన్న పెట్టె తెరిచాడు. అందులో అడుగున దాచి ఉంచిన ఉత్తరాన్ని బయటికి తీశాడు. లాంతరు కాంతిని హెచ్చించాడు. పార్వతమ్మ నిద్రకి భంగం కలగకుండా ఉండేందుకు లాంతరుకి అడ్డుగా కూర్చున్నాడు.

## ద క్షి ణ

ఉత్తరం చదవటం ప్రారంభించాడు.

నాన్నగారికి,

నమస్సులు! మీరు, అమ్మ కులాసాగ ఉన్నట్టు తలుస్తాను. మీ వద్దనుంచి ఉత్తరాలు వచ్చి చాలా రోజులైంది. కారణం తెలియదు. ఇక్కడ మేమంతా కులాసా.

మీ మనవరాలు లలిత రజస్వల అయి అప్పుడే మూడు సంవత్సరాలు కావస్తోంది. ఈ విషయం మీకు అప్పుడే తెలియపరిచాము. గుర్తు ఉండే ఉంటుంది. దాని వివాహం చేయాలని మీ కోడలు తొందరపడుతోంది. మంచి సంబంధం చూసి వివాహం చేయాలనుకుంటున్నాను. ప్రస్తుతం నాకు డబ్బు అవసరం! ఆ ఇంటిని అమ్మేయండి! మీరిద్దరూ నాదగ్గరే వచ్చి ఉండొచ్చు. పరిస్థితి అర్థం చేసుకుంటారని ఆశిస్తూ

ఇట్లు,
మీ కుమారుడు,
సుందరం.

బాబూ! సుందరం! ఎంతోమందిని, ఎన్నో విషయాలని అర్థం చేసుకుంటూనే ఉన్నాను. ఇన్నేళ్ళ నుంచి. నిన్ను కూడ అర్థం చేసుకునే శక్తి నాకింకా ఉందనే అనుకుంటున్నాను. బాబూ! ఏం సమాధాన మివ్వమంటావ్? నే నింతవరకు ఎన్నో గురుదక్షిణలు అందుకున్నాను. కాని ఈ రోజు నేనే ఒక శిష్యుడికి దక్షిణ ఇవ్వబోతున్నాను. ఎందుకంటే ఆ శిష్యుడివి నువ్వే కాబట్టి! నేను విద్యా బోధనలో ఎన్నో నూతన ఒరవడులు ప్రవేశపెట్టాను. ఈ శిష్యదక్షిణ అనే ఒరవడిని ప్రవేశపెట్టిన ఘనత కూడా నాకే దక్కాలి బాబూ! నాకే దక్కాలి! నేనిచ్చే 'దక్షిణ' స్వీకరిస్తావని ఆశిస్తున్నాను. రామశర్మ కళ్ళు చెమ్మ గిల్లాయి. ఉత్తరాన్ని మడిచి తిరిగి పెట్టెలో పెట్టాడు. చాపమీద మేను వాల్చి నిద్రకుపక్ర మించాడు.

* * *

"టెలిగ్రామ్... టెలిగ్రామ్."

సుందరం హడావుడిగా బయటికివచ్చి కంగారుగా టెలిగ్రామ్ అందుకున్నాడు.

"సుందరం! నీ తల్లితండ్రులు మరణించారు. వెంటనే బయల్దేరి రావలెను"

ఇట్లు
రామశర్మ
పార్వతమ్మ

సుందరం భ్రుకుటిముకుళించుకుంది. వింతగా ఉంది, విడ్డూరంగా ఉంది. తాము మరణించినట్లు తన తల్లిదండ్రులు టెలిగ్రామ్ ఇవ్వడమా! తనని ఆట పట్టించేందుకు ఎవరైనా ఈ టెలిగ్రామ్ ఇచ్చి ఉండచ్చా... ఆ టెలిగ్రాం నిజం కాదని నమ్మ టానికి ప్రయత్నించాడు సుందరం. కాని అతనిలో ఏదో మూల ఏదో అనుమానం పీడిస్తోంది. అయినా తను తల్లి తండ్రుల్ని చూసి చాలా రోజులైంది. ఒక్కసారి చూసివస్తే మంచిది. తను కోరిన కోరిక నెరవేరటం సులభతరం కూడా అవుతుంది అని అనుకున్నాడు.

* * *

## కోకిలమ్మ గుండెకోత

ఎందరో మహాకవులు
కవితలల్లుతున్నారు
కోకిలమ్మ పాటమీద
తియ్యని తన గొంతుమీద

కానీ —

అవతారం చాలించి
గోపాలుడు వెళ్లిపోగా
మరచిపోయి వెళ్లాడని
దిగులుచెంది అతని మురళి

కోకిలమ్మ రూపంలో
అతని కోసం గాలిస్తూ
ఏడుస్తూ తిరుగుతోందని
ఎవ్వరికీ తెలియదాయె

కోకిలమ్మ గుండెకోత
కడకు కమ్మని పాటాయె!

— టి. ఎస్. ఎస్. రంగనాథ్

ఎన్నో రోజులు... కాదు... ఎన్నో సంవత్సరాల తరువాత సుందరం తన తల్లిదండ్రులుంటున్న ఇంటికి చేరుకున్నాడు. ఇంటి ముందు కోలాహలంగా ఉంది. ఎవరెవరో ఉన్నారు. ఎవరిన్నీ గుర్తుపట్టలేక పోతున్నాడు సుందరం. అక్కడ ఉన్న వాళ్ళంతా 'ఎవరీ మనిషి' అన్నట్టుగా సుందరంవైపు చూడసాగారు. సుందరానికి వారందర్నీ చూస్తుంటే జరగరానిదేదో జరిగిపోయిందేమోనన్న భయం కలుగుతోంది. వారందర్నీ తప్పించుకుని ఇంట్లోకి వెళ్ళబోయాడు.

"ఎవరండీ మీరు ?" ఎవరో ఒకాయన ప్రశ్నించాడు.

సుంధరం ఆగి "నేను రామశర్మగారి కొడుకు నండి !" అని సమాధానమిచ్చాడు.

"అలాగా ! మీరేనా ! మీ కోసమే ఎదురు చూస్తున్నాం ! ఇదుగో ! ఈ ఉత్తరం మీ కిమ్మని మీ తండ్రిగారు చెప్పారు."

"అసలేమైందండి ? వారు ఎక్కడికి వెళ్ళారు ?" సుందరం ఉత్తరం అందుకుంటూ కంగారుతో ప్రశ్నించాడు.

"వారు లోపలే ఉన్నారు."

"అలాగా ..." అంటూ సుందరం లోపలికి వెళ్ళబోయాడు.

"ఉహు ... మీరు లోపలికి వెళ్ళటానికి కుదరదు. ఈ ఉత్తరం చదివాక మాత్రమే మీరు ఇంట్లోకి వెళ్ళి వారిని చూడవచ్చు. ఇది మీ తండ్రిగారి కోరిక" అంటూ ఒక మధ్య వయస్కుడు సుందరం ప్రయత్నాన్ని ఆటంకపరిచాడు.

## దక్షిణ

సుందరానికి అంతా ఆశ్చర్యంగా ఉంది. అయితే తనని ఇక్కడికి రప్పించేందుకే తండ్రి టెలిగ్రాప్ ఇచ్చాడన్నమాట ! మరి ఈ ఉత్తరం చదివాకే లోనికి రమ్మని కోరటమేమిటి !? సుందరానికి ఏమీ పాలుపోవటంలేదు. ఉత్తరం మడత విప్పి చదవటం ప్రారంభించాడు.

బాబూ సుందరం !

నీ ఉత్తరం అందినది. లలిత వివాహం తలపెట్టి నందుకు ఎంతో సంతోషించాము. ఈ జీవిత ప్రయాణంలో మేమిద్దరమూ చాలా అలసిపోయాం. అందుకే ఇక ఈ ఇంటితో మాకు పనిలేదు. ఈ ఇల్లు నీ పేర మీద వ్రాసి కాగితాలు పెట్లో ఉంచి నాను. ఇల్లు అమ్మి నీ కూతురి వివాహం జరిపించ గలవు.

బాబూ ! నీకు ఇప్పుడే టెలిగ్రాం ఇచ్చాను. నీవు వచ్చేటప్పటికి మా ప్రాణాలు వాయులీనమై ఉంటాయి. మేము అకస్మాత్తుగా నిన్ను విడిచి వెళ్ళి పోతున్నామని బాధపడకు. తిరిగి నీకూతురు కడుపున బుట్టి నిన్ను 'తాతయ్య' అని పిలుద్దామన్న ఆశతో ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోతున్నాం. మేము నోచుకోని అదృష్టాన్ని కనీసం నీకైనా కలుగ చేద్దా మనే సదుద్దేశంతో ఈ పనిచేశాము.'

నీకైనా నీ కొడుకులతో, కోడళ్ళతో, మనవళ్ళతో మనవరాండ్రలతో కలిసి ఉండే అవకాశం, వారి ఆదరాభి మానాలు లభించే భాగ్యం కలగ జేయాలని కోరుకుంటూ తిరిగి నీకు మనవళ్ళుగా జన్మించే ప్రయత్నంలో ఈ తనువులు చాలిస్తున్నాం.

బాబూ సుందరం ! ఒక్కకోరిక... చివరి కోరిక ! తీరుస్తావని ఆశిస్తున్నాము. మాకు తల కొరివి పెట్టేందుకు నీకు అభ్యంతర ముండబోదని విశ్వసిస్తున్నాము. అలా చేసే పక్షంలోనే నీవు మా శవాల్ని చూడగలవు. ఈ ఉత్తరం చదివాక నీ కిష్ట మయిన పక్షంలోనే నిన్ను ఇంట్లోకి రానిచ్చి మా దేహాల్ని చూసే అవకాశం కల్పించమని మరో కాగి తంలో వ్రాసి ఉంచాము. అది ఇక్కడి వాళ్ళు చదివే ఉంటారు. మాకోర్కెను మన్నిస్తావని ఆశిస్తూ సెలవు తీసుకుంటున్నాము.

ఇట్లు
నీ తల్లిదండ్రులు

సుందరం ఉత్తరం చదవటం పూర్తిచేశాడు. విద్యుద్ఘాతం తగిలినట్టయింది. "నాన్నా! నీవు ఎన్నో పాఠాలు నేర్పావు. కాని ఇంతటి కఠినమైన పాఠాన్ని నేర్పుతావని, నేర్పగలవని అనుకోలేదు.

నా పాపానికి ప్రాయశ్చిత్తంలేదు. నన్ను క్షమించండి నాన్నా ! క్షమించండి. నాలో మీరు వెలిగించిన ఈ జ్ఞాన జ్యోతిని మీకు తలకొరివి పెట్టటానికి రావల్సివస్తున్నందుకు నన్నుక్షమించండి. తల్లిదండ్రులారా ! క్షమించండి." సుందరం కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నాడు. మనిషి విలువ తెలిసేది, గ్రహించేది ఆ మనిషి పోయాకనే !

చీకటి ఆ కన్నీటి వెనుక వెలుగుతున్న 'జ్యోతి'ని చూసి కంగారుపడింది. భయంతో దౌడుతీసింది. ★



నటసామ్రాట్
డా॥ అక్కినేని
నటించిన
జ్యోతి
ఆర్ట్ క్రియేషన్స్
గోపాలకృష్ణుడు
Bhaskar



LAKSHMI PUBS
సీడెడ్
భాస్కర పిక్చర్స్
నైజాం
శ్రీవేంకటకృష్ణా ఫిలింస్
దర్శకత్వం: ఎ.కోదండరామిరెడ్డి
నిర్మాత: భీమవరపు బుచ్చిరెడ్డి
సత్యానంద్ వేటూరి చక్రవర్తి సెల్వరాజ్ భాస్కరరాజు జి.జి కృష్ణారావు బి.అంజిరెడ్డి
లక్ష్మీ ఫిలింస్




'టింగు రంగడు'లో జయమాలిని



# సినిమా

## ప్రేమ పంకెళ్ళు

"మే 15 నుంచి 22 వరకు జరిగిన లాస్ట్ షెడ్యూల్లో మా చిత్రంలోని ఆర్టిస్టులందరూ పాల్గొన్నారు," అన్నారు విజయనిర్మల. ఈమె స్క్రీన్‌ప్లే; దర్శకత్వంలో ఎస్. రమానంద్ నిర్మించిన శ్రీ విజయకృష్ణ మూవీస్ "ప్రేమ సంకెళ్ళు" చిత్రంలో నరేష్‌కుమార్, శ్యామల, జగ్గయ్య, సత్యనారాయణ, గిరిబాబు, త్యాగరాజు, మాడా, మంజుల, శుభ, జ్యోతిలక్ష్మి పాత్రధారులు. ఆత్రేయ మాటలు, వేటూరి పాటలు రాశారు. రమేష్‌నాయుడు సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ, తోట తరణి శిల్పం, ఎస్. రవికుమార్ నిర్వహణతో ఎస్. రఘునాథ్ సహ నిర్మాత.

## మగాళ్ళకో నమస్కారం

"మన శాస్త్రాలు, ఆచారాలు మగవాళ్లు సృష్టించినవి గనుక, స్త్రీల విషయంలో కాస్త అన్యాయం జరిగిందేమోనని చెప్పక తప్పదు. పరిస్థితుల ప్రభావం వల్ల ఓ ఆడది రెండో పెళ్లి చేసుకుంటే, వెంటాడి వేధించే సమాజానికి సమాధానమే — మగాళ్లకో నమస్కారం" అంటూ సాయిబాబా పిక్చర్స్ వారి పై చిత్రం డైరెక్టర్ డాక్టర్ రంగారావు వివరించారు. మురళీమోహన్, శ్రీధర్, ఈశ్వరరావు, నూతన్‌ప్రసాద్, గోకిన రామారావు, మాడా, ప్రభ, రాజ్యలక్ష్మి వగైరా తారాగణం పాల్గొనే ఈ చిత్రానికి ఆంధ్ర సాంబమూర్తి కథ, మాటలు రాశారు. లక్ష్మీకిరణ్ సంగీతం, జి.కె.రాము ఛాయ, సాయికుమార్ శిల్పం, రవి కూర్పుతో సి. హెచ్. బాబూరావు సమర్పిస్తారు. నిర్వహణ బాధ్యతలను పి. వి. సత్యనారాయణ, సూరపనేని భావనారాయణ, రామచంద్రరాజు వహిస్తారు. జులై 1 నుంచి 25 వ తేదీ వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుందని నిర్మాతలు మునగల పాపారావు, ముప్పాళ్ళ చెంగలరాజు తెలిపారు.

## "కాలం మారింది — మనుషులే మారాలి"

"కృష్ణ, జయప్రద, రావు గోపాలరావు — ప్రధాన తారాగణం," అన్నారు కట్టా సుబ్బారావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ప్రసూనా ఆర్ట్ పిక్చర్స్‌వారి పై చిత్రానికి డి. వి. నరసరాజు రచయిత. చక్రవర్తి సంగీత దర్శకుడు. "సెప్టెంబర్ — నవంబర్ నెలల మధ్య షూటింగ్ పూర్తయిపోతుంది," అని తెలియజేశారు నిర్మాత ఎం. వి. కృష్ణారావు.

'గోపాల కృష్ణుడు'లో అక్కినేని నాగేశ్వరరావు, రాధ



# విశేషాలు

-జి. వి. జి.

## "కయ్యాల అమ్మాయి— కలవారి అబ్బాయి"

### కథ కమామిషు

శ్రీ దాక్షాయణీ క్రియేషన్స్ వారి పై చిత్రం లోని అయిదు పాటలను ఇటీవల నిర్మాతలు సామి శెట్టి సుబ్బారావు, బెండా వెంకటేశ్వరరావు—ఫ్రాతికేయులకు ప్రదర్శించారు. చిత్రానికి పై పేరెందుకు పెట్టడం జరిగిందని అడిగితే, డైరెక్టర్ చిత్తూరి వెంకట గణేశ్ ఇలా విశదీకరించారు. "కలవారి అబ్బాయి— విశ్వనాథం ముద్దులకొడుకు కిరణ్ (చంద్రమోహన్) ఈ యువకుడు ఒక రోజు స్నేహితులతో కలిసి పందెంకాసి, క్లాస్‌మేట్ అయిన కయ్యాల అమ్మాయి ఉష (రాధిక) తలలోని పువ్వులాగి ఆమెచేత చెంప దెబ్బ తింటాడు. దాంతో పంతం పట్టిన కిరణ్, ఉషను ఏడిపించాలని తన స్నేహితులతో కలిసి ఎన్నో



'జగన్నాథ రథచక్రాలు' లో జయప్రద



ఎత్తులు వేస్తాడు. ఉష తన స్నేహితురాళ్ళతో కలిసి ఎదురు ఎత్తులు వేసి కిరణ్‌ను చిత్తు చేస్తుంది. క్రమ క్రమంగా అతనిలోని పట్టుదల ప్రేమగా మారుతుంది. పెళ్ళి విషయమై ఆమె ఇంటికి వచ్చి ఆమె తల్లితో మాట్లాడ్తానంటాడు కిరణ్. ఉష పరమానందంతో ఇంటికి చేరుకునేసరికి ముక్కోటి అనే దుర్మార్గుడు తన కొడుక్కి ఉషనిచ్చి పెళ్ళి చేయకపోతే ఉష తండ్రి హంతకుడన్న విషయాన్ని బయట పెట్టేస్తానంటూ ఆమె తల్లిని బెదిరించి వెళ్తాడు. ఇటువంటి పరిస్థితిలో తనను కిరణ్ పెళ్ళాడితే అవమానంపాలు కావలసి వస్తుందని ఉష తిరస్కరించేసరికి కిరణ్ నిశ్చేష్టుడవుతాడు. కిరణ్ విచారానికి కారణం తెలుసుకుంటాడు తండ్రి విశ్వనాథం. ఉష ఉద్యోగ ప్రయత్నం చేస్తోందని కూడా తెలుసుకొని, తన ఆఫీసులో ఆమెకు ఉద్యోగ మిచ్చి, ట్రైనింగ్ మిషతో వేరే ఊళ్ళో ఆమె తన కొడుకుని కలుసుకునేలా వీలు కలిగిస్తాడు. కాని, కిరణ్ ఎంత దగ్గరవ్వాలని ప్రయత్నించినా—ఉష దూరంగానే ఉంచుతుంది. చివరికి కిరణ్, విశ్వనాథం కొడుకన్న విషయం తెలియగానే ఉష మండిపడి, ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోతుంది తన ఊరికి. ఎలాగైనా ఉష పెద్దలతో మాట్లాడి కిరణ్‌తో పెళ్ళికి ఒప్పిస్తానని బయలుదేరిన విశ్వనాథం ఉష తల్లిని చూచి నిర్ఘాంతపోతాడు! దాంతో కథ ఎన్నో మలుపులు తిరుగుతుంది. జిత్తులమారి ముక్కోటి ఆటకట్టి, చివరికి కథ సుఖాంతమవుతుంది." చంద్రమోహన్, రాధిక, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య మమత పాల్గొన్న ఈ చిత్రాన్ని టి. అప్పదాస్ సమర్పిస్తున్నారు.

'మేనమా కవ్వించకే'లో సంగీత







'గ్రామ కక్షలు'లో శ్రీప్రియ, రజనీకాంత్

## సినిమా

### కలలుగనే కళ్ళులో మిమిక్రి ఆర్టిస్టుగా చంద్రమోహన్

శ్రీ అన్నపూర్ణా మూవీస్ ''కలలుగనే కళ్ళు'' షూటింగ్ సమయంలో చంద్రమోహన్ అదో గొంతుకతో విష్ చేసే సరికి ''రొంప పట్టిందా ? కంఠం అదోలా ఉందేం?'' అన్నాను. చంద్రమోహన్ నవ్వుతూ, ''ఈ చిత్రంలో నేను మిమిక్రీ ఆర్టిస్ట్ పాత్ర ధరిస్తున్నాను. పేరు విజయ్. విద్యాధికుడు. విజయ్ క్లాస్‌మేట్ చంద్రం. ఈ పాత్ర ప్రతాప్ పోతన్‌ది. ఇద్దరూ ప్రాణ మిత్రులు కూడా. కాని, విజయ్ ఎంత చిలిపిగా, చలాకీగా ఉంటాడో—అందుకు విరుద్ధం చంద్రం. ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ ఉన్న మనిషి. అతనికి జీవితంలో ఎదురైన అతిముఖ్యమైన సమస్యలో చంద్రం సహాయాన్ని కోరతాడు. ఆకోరిక అతి క్లిష్టమైనది, అసాధ్యమైనది అని తెలిసి కూడా స్నేహితుడి కోసం తన మిమిక్రీ విద్యతో నిప్పులో తల దూరుస్తాడు విజయ్. అంతిమ విజయం సాధిస్తాడనుకోండి,'' అంటూ వివరించారు. చిత్రీకరణ ముగిసిన ఈ చిత్రంలో నూతన్‌ప్రసాద్, సారథి, ప్రసాద్‌బాబు, హరిబాబు, సాక్షిరంగారావు, కవిత, అరుణ, నిర్మల, ఝాన్సీ, రమాప్రభ ఇతర ముఖ్య భూమికలు నిర్వహించారు. ఎం. బాలు కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో ముప్పాళ సాంబశివరావు నిర్మాత.

## ఇరుగు - పొరుగు

★ ''అగామికల్'' అనే బెంగాలీ చిత్రానికి లక్ష్మీకాంత్ ప్యారేలాల్ తొలిసారిగా సంగీతమిస్తున్నారు.

★ ''యాదోంకి బారాత్'' చిత్రం మలయాళంలో తయారౌతోంది. జీనత్‌అమన్ వేషాన్ని శ్రీప్రియ, నీతుసింగ్ పాత్రను సుమలత ధరిస్తున్నారు.

★ ''కణ్ణు తెరెద హెణ్ణు'' (కళ్ళు తెరిపించిన వనిత) అనే కన్నడ చిత్రం ప్రారంభోత్సవానికి విచ్చేసిన కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ గుండూరావును జ్యోతి వెలిగించమని నిర్మాత కోరితే, ''నా కళ్ళు తెరిపించిన నా అర్ధాంగిచేత జ్యోతిని వెలిగింపచేయడం సబబు,'' అంటూ పక్కనున్న శ్రీమతిచేత ప్రారంభోత్సవం చేయించారట.

★ ప్రాణ్ కొడుకు సునీల్ సికంద్ రచన, దర్శకత్వ బాధ్యతలు వహిస్తూ నిర్మించే ''ఫరిస్తా'' చిత్రంలో అశోక్‌కుమార్ ప్రధాన పాత్రధారి.

★ నటుడు ప్రేమ్‌నాథ్, ప్రముఖ హిందీ గేయ రచయిత క్వమర్‌జలాలబాధి కలిసి దర్శకత్వం నెఱపే ''ప్రేమ్ సంగీత్'' చిత్రంలో సుప్రసిద్ధ దర్శక నిర్మాత సోహ్రాబ్ మోడి, డైరెక్టర్ రాజ్‌ఖోస్లా హాస్య పాత్రలు ధరిస్తున్నారు.

★ కె. బాలచందర్ దర్శకత్వంలో సంచలనం సృష్టించిన కోమల్ స్వామినాథన్ నాటకం ''తణ్ణీర్ తణ్ణీర్''ను మద్రాసు విశ్వవిద్యాలయం ఎం. ఎ. పాఠ్యగ్రంథంగా నిర్ణయించింది.

★ తమిళ దర్శకుడు రాజ్‌భరత్ ''తొట్టాల్ సుడుమ్'' (తాకితే కాలుతుంది) తమిళ చిత్ర ప్రచారానికి ఒక కొత్త పద్ధతి అవలంబించాడు. మద్రాసులోని కొన్ని కొట్లలో సిగరెట్లు అంటించుకునే దీపాల వెనుక ఆ చిత్రం పేరుగల స్టిక్కర్స్‌ను అంటించాడు.

★ 17 రోజులు కారాగార శిక్ష అనుభవించిన సుప్రసిద్ధ ఇటలీ సెక్సీ క్వీన్ సోఫియా లారెన్ జూన్ 6న విడుదలైంది. ఈమె వయసు 47. ఆదాయపు పన్ను ఎగవేసిన అభియోగానికి ఇటలీ ప్రభుత్వం ఈమెకు మే 19న ఒక నెల కారాగార శిక్ష విధించింది. ఒక పోలీసు అధికారి కారుకు ఈమె కారును ఢీకొట్టించిందనే మరో కేసు కూడా ఈమెపై ఉంది. కాని, శిక్షా కాలపరిమితిని తగ్గించి, ముందుగానే విడుదల అనుమతించబడటంతో ఈమె పొందిన ఆనందం ఇంతాఅంతా కాదుట. ''నేను రోమ్ నగరం చేరుకోగానే అరెస్ట్ చేస్తారని తెలుసు. పొరబాటు నా అక్కౌంటెంట్‌ది. కాని, ఫలితం నేను అనుభవించక తప్పదు. అందుకు సిద్ధపడే రోమ్‌కి వచ్చి, అరెస్టయ్యాను'' అందిట సోఫియా.

## భారీ తారాగణం గల ఈవాడు

"విజయవాడ, గుంటూరు పరిసరాలలో ఆగస్ట్ 10 నుంచి 20 వరకు క్లయ్‌మాక్స్‌సీన్స్ తీస్తాం" అన్నారు నిర్మాత జి. హనుమంతరావు. పద్మాలయ సంస్థ అయిదేళ్ల తర్వాత తెలుగులో నిర్మించే "ఈవాడు" చిత్రం షూటింగ్ మే 9న మొదలైంది. ఈనాటి సాంఘిక జీవనంలో మరో అల్లూరి సీతారామరాజు లాంటి 'రామరాజు' పాత్రను ధరిస్తూ కృష్ణ సమర్పించే ఈ సంచలనాత్మక చిత్రంలో చంద్రమోహన్, గుమ్మడి, జగ్గయ్య, సుధాకర్, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు, ఈశ్వరరావు, సాయిచంద్, గిరిబాబు, అల్లు రామలింగయ్య, త్యాగరాజు, సాక్షి రంగారావు, గోకిన రామారావు, ఆనందమోహన్, జగ్గారావు, చలపతిరావు, రాధిక, జమున, శ్యామలగౌరి, కృష్ణకుమారి, వై. విజయ, అన్నపూర్ణ, ఝాన్సి తదితరులు పాత్రధారులు. పరుచూరి సోదరులు సంభాషణలు రాశారు. శ్రీశ్రీ, కొసరాజు, గోపి ప్రభృతుల గీతాలకు జె. వి. రాఘవులు సంగీతమిచ్చారు. పుష్పాల గోపీకృష్ణ ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, గోపాలరావు కూర్పు, శీను నృత్యాలు, సత్తిరాజు ప్రొడక్షన్, త్రిపురనేని వరప్రసాద్ సహకార దర్శకత్వంలో జి. ఆదిశేషగిరిరావు నిర్మాణ పర్యవేక్షకులు. పర్వతనేని సాంబశివరావు దర్శకుడు.



'ప్రతీకారం'లో విజయశాంతి, రాళ్లపల్లి, శోభన్ బాబు

## అమరజీవి

"గోపాలకృష్ణుడు" అనంతరం ఎ.ఎన్.ఆర్. ఎ. కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో భీమవరపు బుచ్చిరెడ్డి నిర్మించే జ్యోతి ఆర్ట్ క్రియేషన్స్ "అమరజీవి" చిత్రంలో శ్రీదేవి నాయిక. డిసెంబర్‌లో చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి గీతాలు రికార్డవుతాయి. జనవరి 14న షూటింగ్ ప్రారంభమై, మార్చికి పూర్తవుతుందని నిర్మాణ సారధ్యం వహించే బి. అంజిరెడ్డి తెలియజేశారు. సత్యానంద్ సంభాషణల కర్త.



'కయ్యాల అమ్మాయి—కలవారి అబ్బాయి'లో రాధిక, నిర్మల, మంజుల

'కో కి ల మ్మ' లో స రి త

# సినిమా

## శ్రీ లలితా మూవీస్ చిత్రానికి కోడి రామకృష్ణ దర్శకత్వం

"విజయ దశమి నాడు మొదలెట్టి, మన రాష్ట్రంలో డిసెంబర్ 30కి షూటింగ్ పూర్తి చేస్తాం," అన్నారు జి. జగదీశ్ చంద్రప్రసాద్.




"ఎక్కువ పెట్టుబడి మీదే కాబట్టి, మన చిత్రంలో మీరే హీరో!"

ఈయన నిర్మించే శ్రీ లలితా మూవీస్ చిత్రంలో చిరంజీవి, రాధిక, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు ప్రధాన పాత్రధారులు. గొల్లపూడి సంభాషణలు, సత్యం సంగీతం, కె. ఎస్. మణి ఛాయతో కోడి రామకృష్ణ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు.

## పట్నంవచ్చిన పతివ్రతలు

"మా చిత్రంలో మోహన్‌బాబు, చిరంజీవి అన్నదమ్ములు. చిరంజీవి బి.ఎస్.సి. (అగ్రికల్చరల్) పట్టా పుచ్చుకుని, స్వగ్రామంలోనే వ్యవసాయాభివృద్ధికి కృషి చేయాలనుకుంటాడు. పల్లెటూళ్ళో పెరిగిన రాధికను చిరంజీవి, పట్నవాసంలో పెరిగిన గీతను మోహన్‌బాబు వివాహమాడుతారు. పట్నంలో కాపురం పెట్టొచ్చని కలలుకన్న రాధిక, పల్లెటూరి వాతావరణం నచ్చని గీత ఒకసారి మోజుపడి పట్నం వెళ్ళి, అనేక ఇబ్బందులకు గురై, తిరిగి పల్లెటూరికే చేరుకోవడం ప్రధాన ఇతివృత్తం. వారు బస్తీలో ఎదుర్కొన్న సమస్యలు హాస్యభరితంగా చిత్రీకరించాం" అన్నారు విజయ బాపినీడు. ఈయన నేతృత్వంలో ఆట్లూరి రాధాకృష్ణమూర్తి, కొమ్మన నారాయణరావు నిర్మించే శ్రీనివాసా ప్రొడక్షన్స్ "పట్నంవచ్చిన పతివ్రతలు" చిత్రానికి తమిళంలో ఎన్నో విజయవంతమైన చిత్రాలను డైరెక్ట్ చేసిన మౌళి దర్శకుడు. రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్, రమా ప్రభ, ఇతర పాత్రధారులు. స్క్రిప్ట్‌ను కాశీవిశ్వనాథ్, సంభాషణలను జంధ్యాల రాశారు. సత్యం స్వరకల్పనలో వేటూరి, ఉత్పల సత్యనారాయణాచార్య గీతాలు రాశారు. ప్రసాద్ ఛాయ, కళాధర్ శిల్పం, కె. సత్యం కూర్పు, సుబ్రహ్మణ్యరాజు నృత్యాలు నిర్వహిస్తున్నారు.



'ఇద్దరు కిలాడీలు'లో సాధన

## బి. ఎల్. వి. ప్రసాద్ దర్శకత్వంలో చిత్రాలు

కె.ఎస్.ఆర్.దాస్ వద్ద పలుచిత్రాలకు సహాయ, సహకార దర్శకుడుగా పని చేసిన బి.ఎల్.వి. ప్రసాద్ కొన్ని చిత్రాలకు దర్శకత్వం వహించబోతున్నారు. శ్రీకాంత్ పిక్చర్స్ తమిళ చిత్రానికి, ఎం. రామకృష్ణారెడ్డి సమర్పణలో నిర్మాత ఎం. శ్యామలారెడ్డి ఆగస్ట్ 25 నుండి ప్రారంభించే సుమన్ క్రియేషన్స్ చిత్రానికి, డిసెంబర్‌లో చరిత్ర చిత్ర మొదలెట్టే తదుపరి చిత్రానికి బి. ఎల్. వి. ప్రసాద్ డైరెక్టరు.

'పెళ్ళీడు పిల్లలు'లో సాయిచంద్, సుమలత, రమాప్రభ

# సినిమా

## డైరెక్టర్ కె.ఎస్.ఆర్.దాస్ చిత్రాలు

పింజల నాగేశ్వరరావు నిర్మించే పి. ఎస్. ఆర్. పిక్చర్స్ "భిల్లా—రంగా" చిత్రం షూటింగ్ జూన్ 9న ప్రారంభమైంది. చిరంజీవి, మోహన్‌బాబు, స్వప్న, శ్యామల, జయమాలిని, జ్యోతిలక్ష్మి, కన్నడ ప్రభాకర్ వగైరా తారాగణం. ఆదుర్తి నరసింహ మూర్తి కథ, మాటలు రాశారు. సత్యం సంగీత దర్శకుడు. ఎస్. ఎస్. లాల్ ఛాయాగ్రాహకుడు.

లోగడ త్రిమూర్తి ప్రొడక్షన్స్ బానర్‌లో పలు చిత్రాలు నిర్మించిన పి. బాబ్జి ఈ సంవత్సరారంభంలో మొదలెట్టే చిత్రంలో కృష్ణ, శ్రీదేవి, నాయకా నాయికలు. భమిడిపాటి రచయిత. సత్యం సంగీత దర్శకుడు. పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు. జి. వి. కృష్ణారావు శిల్పదర్శకుడు.

సుందర్‌లాల్ నహతా సమర్పణలో శ్రీకాంత్ నహతా నిర్మించే శ్రీకాంత్ పిక్చర్స్ చిత్రంలో కృష్ణ సరసన జయప్రద నాయిక.

కన్నడంలో ఎస్. ఎన్. భట్ నిర్మించే "మాయదారి మల్లిగాడు", "భీమాన్" అనే మరో కన్నడ చిత్రానికి కె. ఎస్. ఆర్. దాస్ దర్శకుడు.

## "ముద్దులమొగుడు"కు కె. ఎస్. ప్రకాశరావు దర్శకత్వం

"అక్టోబర్ 5న అన్నపూర్ణా స్టూడియోలో షూటింగ్ ముహూర్తం," అన్నారు చెరుకూరి ప్రకాశరావు. ఈయన నిర్మించే మహీజా ఫిలింస్ "ముద్దులమొగుడు" లో ఎ. ఎన్. ఆర్., శ్రీదేవి రావుగోపాలరావు ఆదిగాగల వారుంటారు. ఎస్. రాజేశ్వరరావు సంగీత దర్శకుడు. వి.ఎస్.ఆర్. స్వామి ఛాయాగ్రాహకుడు. "సెప్టెంబర్ 7న ఫస్ట్ సాంగ్ రికార్డు చేస్తాం." అన్నారు డైరెక్టర్ కె. ఎస్. ప్రకాశరావు.

← 'ప్రతిజ్ఞ' లో కవిత, మోహన్‌బాబు

'వయ్యారి భామలు—వగలమారి భర్తలు'లో ఒక సన్నివేశం





'రాముడుకాదు కృష్ణుడు'లో అక్కినేని నాగేశ్వరరావు, జయసుధ

'జగ్గు'లో కృష్ణంరాజు, పండరీబాయి, సత్యనారాయణ, గిరిబాబు

## పూర్తిగా కరాటే ఫైట్స్ ఉన్న మార్షల్ ఆర్ట్స్ చిత్రం ఇద్దరు కిలాడీలు

''ఇంతవరకు కుటుంబగాధాచిత్రాలను డైరెక్ట్ చేసిన నాకిది వెరైటీ చిత్రం'' అన్నారు రేలంగి నరసింహారావు. ఈయన దర్శకత్వంలో తమ్మారెడ్డి వి. కె. నిర్మించిన ''ఇద్దరు కిలాడీలు'' పూర్తిగా కరాటే ఫైట్స్‌తో మార్షల్ ఆర్ట్స్ చిత్రంగా మనదేశంలో తయారైన తొలి చిత్రం. ''సుమన్, భానుచందర్‌లకు కరాటే వచ్చు. సుమన్ బ్రౌన్ బెల్ట్ సాధించాడుకూడా. అందుకే వారిద్దరినీ బుక్ చేశాం'' అన్నారు చిత్ర నిర్వాహకుడు భరద్వాజ. రంగనాథ్, నూతన్‌ప్రసాద్, విజయలలిత, పి. ఎల్. నారాయణ, హేమసుందర్, రమణమూర్తి, ముచ్చెర్ల అరుణ, వందన, సాధన, ఓ విశిష్టమైన పాత్రలో మరో ప్రముఖ నటి పాత్రధారులు. భరత్ కథకుడు. మాటలను కాశీ విశ్వనాథ్‌తోపాటు భరత్ రాశారు. జాయ్ స్వరకల్పనలో శ్రీశ్రీ, గోపి గీతాలు రాశారు. ''క్లయిమాక్స్ సీన్‌లలో కరాటేతోపాటు జూడో ఫైట్‌ను కూడా ఉపయోగించాం!''అన్నారు సెకండ్ యూనిట్‌తో ఫైట్స్ సీన్‌లను తీసిన బి. ఎల్. వి. ప్రసాద్.

# సినిమా

## సత్యదేవి కంబైన్స్

"చిరంజీవి, రాధిక హీరో హీరోయిన్‌లు" అన్నారు ఎస్. పి. వెంకన్నబాబు. ఈయన సమర్పణలో ఎ. కోదండరామిరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే పై సంస్థ తొలి చిత్రంలో సత్యనారాయణ, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య ఇతర ముఖ్యభూమికలు నిర్వహిస్తారు. సత్యానంద్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, నవకాంత్ ఛాయతో చిత్రాన్ని నిర్మించే రమేష్, జయరామారావు ఆగస్టులో షూటింగ్ మొదలవుతుందని తెలియజేశారు. ★



'షంషేర్ శంకర్'లో కృష్ణ, రావు గోపాలరావు

'ఇల్లంతా సందడి'లో సువర్ణ

మాదాల రంగారావు సారధ్యంతో

శ్రీశ్రీ సమర్పించు

నవీన్ ఆర్ట్ పిక్చర్స్

# మహాప్రస్థానం




సీడెడ్ నవయుగ పిక్చర్స్

దర్శకత్వం: కె. హేమాంబరధరరావు   నిర్మాత: జి. దుర్గాప్రసాద్ M.com,

సంగీతం: చక్రవర్తి, కెమెరా: ఆర్. రామారావు

## సీరియల్

# కాలం కరిగాక

## వలివేటి నాగచంద్రావతి

(గత సంచిక తరువాయి)

ఆ రోజు సాయంత్రం హాస్పిటల్ డ్యూటీ ముగిశాక నేరుగా గదికి వచ్చి చక్కగా ముస్తాబయి అబ్బాయిల ఈవినింగ్ డ్యూటీ...అదే... పేవ్‌మెంట్ పహరాకి వెళ్ళబోతున్న మురళిని, ఇంటి ముందున్న లాన్‌లో కుర్చీలు వేయించుకు కూర్చుని కూతురితో చదరంగం ఆడుకుంటున్న రంగారావు గారు చూశారు. "ఇలారావోయ్. మా బేబీని ఇంట్రడ్యూస్ చేస్తాను." అని పిలిచారు.

ఎదురుచూడని ఈ అవకాశానికి ఆనందంగా వున్నా కొద్దిగా తడబాటు పడ్డాడు మురళి. అదేవిటో రంగారావుగారి కంఠస్వరం, అదిలించినట్టు గానో, ఆజ్ఞాపించినట్టుగానో వినబడుతుంది.

దగ్గరగా వెళ్ళి ఆయన చూపించిన కుర్చీలో బుద్ధిమంతుళ్ళా వినయమొలకబోస్తూ కూర్చున్నాడు.

శరీర తపముపశమించే చల్లపాటివేళ; కళ్ళ కింపుగా చుట్టూరా గాలికి ఊగులాడే పువ్వుల మొక్కలూ, కాళ్లకింద మెత్తగా పచ్చటి పచ్చిక, ఎట్ట ఎదుట మనసు ఉర్రూతలూగించే హిమబిందు లావణ్యపుశోభ– ఒక్క హిట్లర్ మీసాల మిలటరీ ఆఫీసరు గార్ని తప్పిస్తే వాతావరణం ఆహ్లాదంగా, బహుపసందుగా, మహ హుషారుగా వుంది.

"మా అమ్మాయి హిమబిందు. డిగ్రీకోర్సు సెకండియర్ చదువుతోంది. బాడ్‌మింటన్, టేబుల్ టెన్నిస్ బ్రహ్మాండంగా ఆడుతుంది. ప్రస్తుతం చెస్‌లో కూడా ఛాంపియన్ అయిపోడానికి ట్రై చేస్తోంది." అని చిరునవ్వు నవ్వి, "అన్నట్టు నువ్వు చూడలేదు గాని మా బేబీ ప్రైజ్ కప్‌లతో మా బీరువా అర పూర్తిగా నిండిపోయింది." తను సంపాదించిన అపురూప వస్తువును గురించి వూరిస్తూ చెబుతోన్న చిన్న కుర్రాడిలా సహజ గాంభీర్యం పడలించి, చిరు దరహాసం చిందుతోండగా కూతురి ప్రజ్ఞలు గొప్పచేసి చెప్పకోడంలో రంగారావుగారు తన్మయులయిన తరుణంలో అదే అదునుగా ఒక నిముషంపాటు మురళి హిమబిందుని నఖశిఖ పర్యంతమూ సెర్చిచేశాడు.

ముదురువయొలెట్ రంగు బెల్‌బాటమ్; పింక్ కలర్ లూజుబ్లౌజ్; పొట్టిగా దుబ్బుగావున్న నొక్కుల జుత్తుని ఒద్దికగా బంధించిన నల్లనిక్లిప్; చేతులకూ, మెడకూ, చెవులకూ సయితం ఏమీ సింగారించని నిరాడంబరం; హిమబిందు ఆధునికతకు ప్రతీకలా వుంది.

మరగ కాగిన పాలవంటి మేనిఛాయ; చెక్కుటద్దాలపై గులాబీరేకుల నునుపు మెరుపూ– నెన్నుదురు మొదలుకొని కాలి చిటికెన వేలు వరకూ అణువణువూ తొణికిసలాడుతోన్న తారుణ్యపు లాలిత్యమూ – కోమలత్వమూ– హిమబిందు అందానికి అధిదేవతలా వుంది.

మురళి రెప్పలార్పడం మరిచిపోయాడు.

చెంపకి చెయిజేర్చి దృష్టి చదరంగం పావుల మీద నిలిపిన హిమబిందు మటుకు అతని రాకని పట్టించుకున్నట్టే లేదు.

"మనగెస్ట్ రూమ్ అద్దెకిచ్చిందితనికే, పేరు మురళి. హౌస్‌సర్జన్ చేస్తున్నాడు." అని తండ్రి అతన్ని గురించి చెబుతున్నప్పుడు మాత్రం సభ్యతకి ఒక్కసారి రెప్పలెత్తింది. రోజూ కనబడే ఏ పేపర్ బోయ్‌నో, పోస్టు జవాన్నో చూసినట్టు ఏ మాత్రపు ఆసక్తి వ్యక్తపరచని సాదా చూపు చూస్తూ, చేతులు జోడించి, "నమస్తే" అని చెప్పి తిరిగి ఆటలో లీనమయిపోయింది.

మురళి ఉత్సాహం సహం చల్లారింది.

"అందగత్తెనన్న మిడిసిపాటు గాబోలు" అను కున్నాడు మురళి.

ఆ మాటకొస్తే తనకు మాత్రం ఏం తక్కువ? అందంలేదా ... పర్సనాలిటీలేదా ... క్వాలిఫికేషన్ లేదా ... ? ఆస్తీ పాస్తీ లేదా ? హూ ... తన కెంతుండాలి అతిశయం ! తనని చిన్నచూపుచూస్తోం దేమోనన్న అనుమానంతో మనస్సు చివుక్కుమనిపించి తక్షణం లేచిపోయేడు మురళి.

రంగారావుగారు "సర్వెంట్ షర్బత్ తెస్తున్నాడు వుండు" అంటూన్నా ఆగక మర్యాదగా "సారీ" అంజెప్పి శెలవు తీసుకువెళ్లిపోయాడు.

* * *

'హిమబిందు ఒట్టి అహం భావి' అని తేల్చుకున్న మురళి నిర్ణయాన్ని కొన్నిరోజుల్లోనే మార్చుకోవాలి సొచ్చింది.

ఆ రోజు ఆదివారం. మురళికి ఆఫ్. మధ్యాహ్నం మెస్‌లో భోంచేసి వచ్చాక రూమ్‌లోనే వుండి పోయాడు;ఏదో మెడికల్ జర్నల్ తిరగేస్తూ.

ఓరగా వున్న తలుపుల్ని తోసుకుని సుమ పరిమళం మోసుకొస్తున్న పిల్ల తెమ్మెరలా లోపలి కొచ్చింది బిందు.

ఆమె ఆకస్మిక ఆగమనాన్ని ఊహించనీ – ఆశించనీ మురళి విస్మయం చెందాడు.

'ఆ రోజు అంతలా బిగదీసుకున్న మనిషి ఈ రోజు ఉరమని పిడుగల్లే పిలవాపెట్టకుండా ఎందు కొచ్చిందబ్బా ?' అని ఆలోచిస్తూనే, మంచంమీద పడుకున్నవాడల్లా చటుక్కున లేచి కూర్చుని "రండి–రండి" అని ఆహ్వానించాడు అప్రయత్నంగా.

"మిమ్మల్ని డిస్టర్బ్ చేయలేదు కద ?" ఏ మాత్రం సంకోచం లేకుండా అతని మంచం ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చోబోతూ, "ఏమీ తోచక టైమ్ పాస్ చేయడానికిటు వచ్చాను. నాకు కంపెనీ ఇవ్వగలరా ?" అన్నది చిరునవ్వుతో.

"ష్యూర్" అనుమానం విడిచిపెట్టి ప్రసన్నంగా చూశాడు మురళి.

ఆదరా బాదరా మంచం దిగి చేతిలో పుస్తకం టేబిల్‌మీదికి గిరవాటేసి ఫ్యాను స్పీడు పెంచాడు. మళ్లీ వచ్చికూర్చుని ఎలా సంభాషణ ప్రారంభించాలా? అన్నడైలమాలో పడ్డాడు మురళి.

వెయ్యి పున్నాగలు ఒకేసారి విరిసినట్లున్న అందమైన ఆమె వదనం చూస్తూంటే ఆమెపట్ల పెంచుకున్న విముఖత్వం కరిగిపోయింది. ఆ కళ్లలో నిర్మలత్వం, మాటాడిన ఒక్క మాటాలోనే తొంగిచూస్తున్న స్నేహాభిలాష చూస్తూంటే తాన మకున్నంత తల బిరుసుతనం లేదు పాపం ఈ అమ్మాయి దగ్గర! బహుశా ఆరోజు ఆటలో మునిగి



**జరిగిన కథ – 5 :** కలప వ్యాపారంమీద రెండు చేతులా సంపాదిస్తున్న కేశవరావ్, కామేశ్వరమ్మ గార్ల ఏకైక పుత్రుడు మురళి – హైస్కూలు మాస్టారుగా రిటైరయి, వున్న ఆస్తినంతా తెగనమ్మి ముగ్గురు కూతుళ్ల పెళ్లిళ్లు చేసేసి, కేశవరావ్ అవుట్ హౌస్‌లో అద్దెకి దిగిన రంగనాథం, రాజ్యలక్ష్మమ్మ గార్ల ఆఖరి సంతానం మీనాక్షిని మాయమాటలతో మోసపుచ్చి తన కోర్కెను తీర్చుకొంటాడు మురళి. కామేశ్వరమ్మకు ఆడపిల్ల పుడుతుంది. మీనాక్షి గర్భవతి అవుతుంది. మురళి కనిపించకుండా తప్పించుకు తిరుగుతుంటాడు. ఆతని తల్లితో ఈ విషయాన్ని రాజ్యలక్ష్మమ్మ చెప్పగా, ఆమె వీళ్లమీదే అపనిందలు వేస్తుంది. రంగనాథం కేశవరావ్ దగ్గరకు వెళతాడు. కేశవరాల్ రంగనాథానికి అభయమిస్తాడు. దాంతో ఇంట్లో కేశవరావ్, కామేశ్వరమ్మగార్ల మధ్య ఘర్షణ జరుగుతుంది. ఇక కేశవరావ్ తన మాట వినే పరిస్థితిలో లేడని మురళికి కొంత డబ్బు ఇచ్చి, ఏవేవో చెప్పి సాగనంపుతుంది. మురళిని కేశవరావ్ వైజాగ్ మెడికల్ కాలేజీలో చేర్పించి వస్తాడు. చివరికి చేసేదిలేక మీనాక్షిలో పెరుగుతున్న పాపాన్ని రంగనాథానికి ఇష్టం లేకపోయినా రాజ్యలక్ష్మమ్మ నాటు వైద్యంతో నిర్మూలించాలనుకుంటుంది. ఆ వైద్యం మీనాక్షి ప్రాణాల్నే హరిస్తుంది. రంగనాథం దంపతులు పెద్దకొడుకు విశ్వంతో వెళ్లిపోతారు. మురళి చదువు పూర్తిచేసి హౌస్ సర్జన్ చేస్తుంటాడు. తన ఇంటి ఓనర్ మిలటరీ ఆఫీసర్ రంగారావు గారి ఏకైక పుత్రిక హిమబిందుతో పరిచయం కల్గుతుంది మురళికి.



అలా వున్నది గావును. అదే నిర్లక్ష్యమని తమ పొర పాటు పడ్డాడు.' అని అర్థమయిందతనికి.

ఇంతలో స్మితంగా గది నలుమూలల్నీ కళ్లతో పరిశీలిస్తున్న హిమబిందు "అరె" అంటూ ఆశ్చర్యార్థకంలా లేచిపోయి, "ఆ తలుపులు మూసా రెందుకూ ?" అంటూనే వెళ్లి వెనక వైపు కిటికీ తలుపుల్ని బార్లగా తెరిచేసింది.

"ఆ... వచ్చినే... పాడుహోరు... పిచ్చిగాలి." విసుగ్గా నొసలు ముడిచి నసిగాడు మురళి.

"వ్వ్... వ్వ్ .. పాడుహోరా... పిచ్చిగాలా...?" ఆశ్చర్యంగా నొచ్చుకున్నది బిందు.

"దేవతలు బృందగానం చేస్తున్నట్టు వినబడు తుంది నాకాహోరు. అమ్మ అతి ప్రేమగా ఒళ్లు నిమురుతోన్నట్టుంటుంది ఆ చల్లటిగాలి శరీరానికి తగులుతోంటే..." అన్నది తన్మయంగా.

నవ్వి వూరుకున్నాడు మురళి.

కిటికీ తలుపుల్ని ఆనుకుని నించున్నది బిందు. కిటికీ లోంచి వీస్తున్న చిరుగాలి ఆమె నుదుటి ముంగురులతో ఆటలాడుతోంది. వూసల్లోంచి కన బడుతోన్న సముద్రాన్ని తదేకంగా చూస్తూ అప్పుడు చెప్పింది బిందు — ఆ అఖండ జలరాశికీ మనుష్య జీవితానికీ ఉన్న పోలికలు —

"కెరింతలతో చేరువయి, గారాబంగా కాళ్ళు చుట్టేసి, అంతలో ఏ చిలిపి తలపో మెదిలి చటుక్కున ఏ తలో చేరిపేసి కిలకిల లాడుతూ చేతికి దొర క్కుండా పరుగులు పెట్టే పసిపాపల్లా—

తుళ్లి గింతలతో రివ్వున వాలి కొంటెతనంగా తుంపర్లు పైకెగజిమ్మి గమ్మున వెనక్కి జారుకునే ఆ కెరటాలు మనిషి బాల్యదశకి ప్రతిబింబాలు.'

'ఇంకొంచెం పైకిచూస్తే— బ్రతుకులో డక్కాముక్కీలు తిని భయంకరమైన చేదు అను భవాలని జీర్ణించుకుని, వెలుపలికి చెప్పుకోలేని వ్యధలని గుండెల్లో గుంభనగా పొదుపుకొని పైకి గంభీరంగా ప్రవర్తించే పెద్దమనిషిలా —

అంతు తెలియని అగాధాలనీ, ముంచివేసే సుడి గుండాలనీ, మాడ్చివేసే దావానలాన్నీ— ఎన్నింటినో తన అడుగున దాచుకుని పైకి అతి ప్రశాంతంగా కనిపించే ఆ సముద్ర మధ్యం వ్యక్తి యొక్క ప్రౌఢ త్వానికి చిహ్నం.

ఇక— ఇంకా దూరంగా చివరాకర్ని నీలాకాశంలో లీనమయినట్టు భ్రాంతి కలిగించే క్షితిజాన్ని పరికిస్తే — జీవితాన్ని కాచివడబోసి చివరికి మిగిలేది శూన్యమే ననీ అంతా ఆ అనంతంలో కలిసిపోయేదేననీ గుర్తించి ఆ జ్ఞానోదయంతో విరాగియై మహాయాత్రా పథాన నిదానంగా సాగిపోయే వృద్ధునిలా— ఆత్మా పరమాత్మా అని బాహ్యదృష్టికి ద్వివిధాలుగా అగుపడి నా అంతర్నేత్రాలకు అని రెండూ ఏకరూపమే అని చాటుతున్నట్టే — సముద్రమూ నీలాకాశమూ కలిసి పోతూ మానవుని అంతిమ స్థితిని గుర్తుకు తెస్తుంది.'

కళ్లు అరమూసి పారవశ్యంగా చెబుతోన్న బిందు వంక వింతగా చూస్తూ ఆశ్చర్యంగా విన్నాడు మురళి. 'టీన్స్ దాటని ఈ పిల్ల ఏ ట్విస్ట్ డాన్స్ గురించో చెప్పక వయసు పండినదానిలా ఆత్మా పరమాత్మా అంటూ వేదాంతం వల్లిస్తుందేమిటి ? విరాగిలా ఆ శూన్యావలోకనాలేమిటి ?

అంతా విన్నాక కొంచెంసేపాగి అడిగాడు "మీ మెయిన్ సబ్జెక్ట్ ఏమిటి ?"

"ఫిలాసఫీ."

"ఓ" అర్థమయినట్టు తల పంకించాడు మురళి.

అతడు సబ్జక్టడిగిన కారణం అప్పటికి బోధపడి పక్కుమన్నది బిందు; బిందు లేపే నర్తకి కాలి అందెలు ఘల్లుమన్నట్టు.

ఆ నవ్వుతో ఆమె మూడ్ మళ్లీ మామూ లయింది. "నా అభిమాన విషయం అదేగాని నేను మాత్రం ఫిలాసఫర్ని కాదండోయ్. పూర్తిగా ఇహలోక పావనంకీ సుఖాలకీ లొంటడిపోయిన పిామ్యురాల్ని." అన్నది వాతావరణాన్ని తేలిక చేసేస్తూ.

ఆ తరవాత ఇద్దరూ యిష్టాగోష్ఠిలో పడ్డారు.

చిత్రమేమిటంటే మాటలతో గారడీ చెయ్యగల మురళి అంతటివాణ్ణిగూడా నోరు మెదపనీకుండా కబుర్లు చెప్పగల దిట్ట బిందు. ఆమె వున్నంతసేపూ 'ఆ' – 'ఊ' అని తప్ప మారుమాటాడే సందివ్వలే దతనికి. పైగా వెళ్తూ వెళ్తూ "చూసారా మీ గడుసుతనం... ! ఇంతసేపూ నన్ను వాగించేరేకానీ



మీరొక్క మాటన్నా మాటాడేరు కారూ... !'' అని నిందవేసి చక్కాపోయింది.

వెర్రిమొహం వేసి చూస్తూండిపోయాడు మురళి.

* * *

బిందు ఈ లోకంలోపడి కన్ను తెరవటం, ఆమె తల్లి ఏ లోకాలకో తరలిపోతో కన్ను మూయటం ఏకకాలంలో జరిగిపాయి.

తొలి సంతానాన్ని అందుకున్న ఆనందం అనుభవానికి రాకముందే భార్యావియోగ విషాదం రంగారావుగార్ని ఉప్పెనలా ముంచెత్తివేసింది.

భార్యని ఎంతగానో ప్రేమించిన ఆయన ఆ దుఃఖ భారాన్ని తట్టుకోలేక చేస్తున్న ఉద్యోగానికి రిజైనిచ్చి, మిలటరీలో చేరిపోయి, కుటుంబానికీ, వేధించుకు తింటున్న ఆ జ్ఞాపకాలకీ దూరంగా పారిపోయేడు.

తాతా బామ్మల సంరక్షణలో పెరిగిన బిందుకి పదేళ్లు వచ్చేవరకూ తండ్రంటే అప్పుడప్పుడూ చుక్క రాలినట్టు చుట్టపు చూపుగా వచ్చి చూచి పోతూండే బంధువుగా మాత్రమే తెలుసును. ఇక రంగారావుగారి కయితే, కూతురు గతమనే గాయాన్ని మానుపట్టనీకుండా కెలుకుతోన్న ఓ ముల్లు.

ఆ దృష్టితోనే అన్నేళ్లూ రక్తంలో రక్తమైన ఆ పసిప్రాణానికి సన్నిహితంగా రాలేకపోయారు; మమకారం పెంచుకోలేకపోయారు.

రంగారావుగారు అనుకున్నారు; తనకిక ఏ బంధనాలూ వద్దని. అంచేత పునర్ వివాహం చేసుకొమ్మన్న తల్లిదండ్రులా, బంధుమిత్రులా మాటల్ని వినిపించుకోలేదు! బిందుని దగ్గరకు చేర్చుకోలేదు.

'తల్లీ తండ్రీ ముది వగ్గులు కారు. ఆరోగ్యంగానే వున్నారు. మనమరాలి బాధ్యత వారే వహించగలరు. తనకే ప్రమేయమూ లేదు; వుండకూడదు.' అని ఆయన దులుపుకున్నట్టు ఊరుకున్నా విధి వూరుకోలేదు.

విషజ్వరం వచ్చి నాలుగురోజుల తేడాతో తల్లీ తండ్రీ ఒక్కసారే పోవడంతో బిందు రంగారావుగారి కాళ్లకు సంకెల అయింది.

కానీ కన్నులు విడక మునుపే కన్నకడుపు కమ్మదనాన్నీ, వూహ తెలుస్తూనే సాకిన ఒడి వెచ్చదనాన్నీ కోల్పోయిన నిర్భాగ్యురాలు... బిందు దుఃఖం తండ్రి యొక్క ఉదాసీనతను పారద్రోలి అభిమానానికి తావు చేసింది.

'గతంలో తగిలిన దెబ్బను తానొక్కడే ఒంటరిగా భరించాడు. కానీ ఇప్పుడు ఈ దుఃఖాన్ని పంచుకోను బిందు వుంది.' అన్నభావన కలిగి ఆ సంకెల సంకెల లాగాక తనకు మిగిలిన ఒకే ఒక ఆత్మీయతాను బంధంగా తోచి అన్నేళ్లు ఘనీభవించివున్న మనస్సు కరిగి కదిలిపోయాడాయన.

కుమార్తెను ఒడిలోకి చేర్చుకుని పోయిన మన శ్శాంతి తిరిగి లభించినట్టు సంతృప్తి చెందాడు. అప్పటి నుంచీ ఆయన ఆలోచనలకీ ఆశయాలకీ కేంద్ర బిందువయింది బిందు.

తిరస్కారంతో అణిచి వుంచటం వల్ల అన్నేళ్లూ ఆయన హృదయంలో ఏ మూలో నివురు

కాలంకరిచాక

గప్పినట్టుండిపోయిన అపేక్ష, వాత్సల్యమూ వెల్లువలై ఉప్పొంగుతున్నాయి ఆ తరుణంలో.

అది అంతా ఒక్కమారే కుమ్మరించి బిందుని అపురూపంగా చూసుకోవచ్చు; అల్లారు ముద్దుగా సాకవచ్చు: పువ్వుల్లా పెట్టి పెంచవచ్చు.

కానీ దాని ఫలితం మంచిగా వుండకపోవచ్చు. బిందు పెంకిగా, మూర్ఖంగా తయారయ్యే ప్రమాదం వుంది. చేతులారా మనస్తాపాన్ని కొని తెచ్చుకున్న వాడవుతాడప్పుడు.

రంగారావుగారా పొరపాటు చెయ్యలేదు. చీకటైన తన బ్రతుకును వెలిగించే చిరుదీపం బిందు. ఆ దీపాన్ని ప్రజ్వలింప చెయ్యాలి: ప్రకాశవంతం చెయ్యాలే తప్ప ఇల్లంటించుకో గూడదు.

## హృదయస్తంభన!

పశ్చిమ జర్మనీ డాక్టర్లు గుండె పని చేయడాన్ని రెండు గంటలసేపు ఆపగల ఒక క్రొత్త విధానాన్ని రూపొందించారు. ఈ విధానం ''ఓపెన్‌హార్ట్'' సర్జరీలలో అత్యంత లాభదాయకంగా వుంటుంది. ప్రస్తుతం చేస్తున్న ఆపరేషన్లలో యీ స్తంభన కాలం 45నిమిషముల సేపు మాత్రమే వుంటుంది. డాక్టర్లకు రెండు గంటల సేపు వ్యవధి లభించడం వలన కష్టతరమైన శస్త్రచికిత్సలను సులభంగా, కాస్త విశ్రాంతిగా చేయడానికి వీలవుతుంది. శరీరంలో, గుండె పరికరాలలో ఉష్ణోగ్రతను తగ్గించడం వలన యిది సాధ్యమైంది. ఈ విధంగా గుండెను నిలిపి వుంచడాన్ని ''కార్డియోప్లెజీ'' అని అంటారు. రక్త ప్రవాహాన్ని మరల గుండెలోనికి మళ్ళించిన తరువాత మరల గుండె పనిచేయడం ప్రారంభిస్తుంది. పశ్చిమ జర్మనీలోని మాక్స్ ప్లాంక్ విశ్వవిద్యాలయ శాస్త్రవేత్తలు గీసెన్ విశ్వవిద్యాలయ శాస్త్రవేత్తల సహకారంతో యీ అద్భుత ప్రక్రియను సాధించారు.

ఎంతో నిగ్రహం పైన తన ప్రేమకి ముక్కుతాళ్లు వేసి, మంచి మార్గాన నడిచేటందుకు ఏ విధమైన శిక్షణ గరపాలో ఆ విధంగా బిందుని జాగ్రత్తగా పెంచారు రంగారావుగారు.

మొగ్గని సహజంగానే వికసించ నివ్వాలి గానీ ఓ పరిధిలో బిగించ గూడదన్న తత్వం రంగారావుగారిది. ఇది ఆడపిల్ల. దీన్నొక రకంగా పెంచాలి; వీడు మగపిల్లవాడు. వీణ్ణి మరొకలాగ పెంచాలి .. అన్న భేదం పాటించేలేదు. తన ఇష్టాలు ఆమె నెత్తిన రుద్దలేదు.. మంచి ఏదో చెడు ఏదో మనస్సుకు హత్తుకునేలా విప్పిచెప్పి ఏదారిని ఎంచుకోవాలో నిర్ణయాన్ని ఆమెకే వదిలే వారు. స్వాతంత్ర్యం ఇస్తూనే భాధ్యతలు తెలియజెప్పేవారు.

చిన్నతనంలో గంభీర స్వభావంతో ముభావంగా వుండే తండ్రి పట్ల బిందు భయభక్తులు మాత్రమే ప్రదర్శించినా ఎదుగుతోన్నకొద్దీ, ఆ గంభీరాకృతి వెనకాతల అంతరంగమంతా అనురాగామృతంతో నింపి తనకోసమే దాచివుంచిన ఆయన్ని అర్థం చేసుకున్న తర్వాత తండ్రిని శిక్షకుడిగానే కాక అత్యంత ఆప్తునిగా, హితం కోరే మిత్రునిగా భావించి బెదురు వదిలి చేరువయిపోయింది.

పితృ పర్యవేక్షణలో తనదంటూ ఓ ప్రత్యేకత వున్న వ్యక్తిత్వాన్ని రూపొందించుకొన్న బిందు కిప్పుడు యిరవయి ఏళ్లు.

విద్య యందు శ్రద్ధా, తలచిన కార్యంలో చొచ్చుకుపోయే చొరవా, సాధించగలిగే నేర్పూ, వాగ్ధోరణిలో చమత్కృతి, మనసునాకట్టే చురుకుతనమూ, చూపునాకట్టే రూపురేఖా విలాసాదులూ ఆమెచుట్టూ ఓ మిత్ర బృందాన్ని చేర్చాయి.

విశేషమేమంటే ఆ స్నేహితుల్లో ఆడపిల్లలెంతమందో మగవాళ్లంతమంది.

ఇంకో విశేషమేమంటే తమకు లేని ఇన్ని అర్హతలు ఆ అమ్మాయికున్నా, ఆమె స్నేహమాధురి చవిచూసిన ఏ ఆడపిల్లా ఆమెను చూసి ఈర్ష్యపడదు. పైపెచ్చు ఆమె స్నేహభాగ్యమబ్బినందుకు గర్వపడుతుంది.

సగటు ఆడపిల్లలా మగవాణ్ణి చూడగానే మెలికలు తిరుగుతూ ముదుచుకుపోకపోయినా, ఎంత అధునాతనంగా అలంకారం చేసుకున్నా ఆమె సంస్కార ప్రవృత్తి ఎరిగిన ఏ మగవాడూ పరోక్షంగానైనా ఆమె గురించి వేలెత్తి చూపించడు; విమర్శించడు; అసభ్యతగా మాటాడడు. పైగా గౌరవిస్తాడు.

బిందు స్నేహశీలి; చైతన్య స్రవంతి.

ఆమె యొక్క స్నేహ పుష్పకంలో మురళికి సులువుగానే సీటు దొరికిపోయింది.

* * *

అతన్నొక రోజు, 'స్త్రీ పురుష సమానత్వం మీద మీ అభిప్రాయమేమిటి?' అనడిగింది బిందు.

వెంటనే సమాధాన మివ్వటానికి తబ్బిబ్బయ్యాడు మురళి.

తరచూ సాయంకాలాలు రంగారావుగారూ, బిందూ టీ తీసుకునే సమయాల్లో మురళిని కూడా కేకెయ్యటం, కాలక్షేపంగా ఏదో పిచ్చాపాటీ ముచ్చటించుకోవటం పరిపాటయింది.

ఈ ముగ్గురూ అలా సమావేశమయిన సందర్భాల్లో, సినిమాలూ, స్వీట్సూలాంటి తేలికపాటి విషయాలు మాటాడుతూనే వున్నట్టుండి గభాలున టాపిక్ మార్చి, గాఢనిద్రలో ఉన్నవాణ్ణి ఒక్క ఉదుటున లేవదీసి ''పదమూడు పదమూళ్లెంత? టక్కున చెప్పు'' అని నిలదీసినట్టు, అమెరికా అప్పు గురించో, విశ్వనాథ కవిత్వం గురించో, డయాబిటీస్ రోగి పథ్యం గురించో, యాపిల్ చెట్ల పెంపకం గురించో, అరవిందుడి ఆధ్యాత్మిక చింతన గురించో, ఆడవాళ్ల హక్కుల గురించో — ఇదిగో ఇలాగే అతనికి నలుగుడు పడని చర్చల్లోకి లాగి మురళిని కంగారు పెట్టేస్తుంటుంది బిందు.

'అయినా ఆడదీ మొగాడూ సమానమెలా అవుతారూ? మగాడు జుట్టు పట్టుకు బయటకీడిస్తే, కాళ్లు పట్టుకు వేళ్లాడి ఈ పాదాల దగ్గర ఇంత చోటిమ్మనే పరాధీన అతనితో సమానమెలా అవుతుంది?

కను చీకటి పడితే మగతోడు లేకుండా పదదు

గులు ముందుకు వెయ్యలేని అబల ఎన్ని పుణాలు వేస్తే అతనితో సమానవుతుంది ?

పలుకులొచ్చిన చిలకకి గిరాకెక్కువట. చదువొచ్చిన పిల్లయితే రేపు దక్షిణతో సహా దానం పట్టే వరుడికి మోజుగా వుంటుందని, కన్నపాపానికి తండ్రి చదువు చెప్పిస్తోంటే ఆ విద్యను చూసుకొనీ, —

ఇల్లు చక్కబెట్టించుకోడంతో ఆగక, ఆర్థిక స్థితి కూడా మెరుగు పరుచుకునే నిమిత్తం భర్తలు భార్యల్ని ఉద్యోగానికి పంపుతోంటే ఆ ఉద్యోగాల అండను చూసుకొనీ,—

పెంపుడు కుక్కను వెంటతిప్పుకుంటున్నట్టు, మగవాడు సరదాకి తనతోపాటు ఆడదాన్ని బయటకు రానిస్తోంటే ఆ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల రుచి వంట బట్టించుకొనీ, —

మేమూ మగవాళ్లతో సమానమంటూ వెన్ను విరుస్తూ ఆత్మవంచన చేసుకుంటూన్న ఆడవాళ్ల వెర్రిబాగుల తనానికి నవ్వొస్తుంది.

కట్టుకొయ్యకు కట్టిపడేసిన ఆవులాంటిది ఆడది. కాకపోతే ఈ మధ్య దయదలిచి ఆ కన్నెతాడు కొంచెం పొడవు చేసారంతే. మగవాడు తలుచుకుంటే అది కుచించటం చిటికెల్లో పని.

'కానీ, నా అభిప్రాయ మిదీ అని పై కంటె హిమబిందు తనని బ్రతక నిస్తుందా? విరుచుకు పడదూ ?'

ఆనాటి రుద్రమ, ఝాన్సీరాణిమొదలు ఈనాటి ఇందిరాగాంధి, గోల్డామేయర్ వరకూ ఎన్ని పోలికలు తెస్తుంది ? ఎన్ని ఉదాహరణ లిస్తుంది !

"స్త్రీకి సహనమెక్కువ. త్యాగమూ, దయా, క్షమా, ఈ గుణాలతో ఇంతవరకూ పురుషుడి ఆగడాల్ని సహించి క్షమిస్తోంది.

ఆడది కళ్లుతెరిస్తే, రుద్రమూర్తియై హుంకరిస్తే, ఆ ప్రళయ ఝంఝా మారుతంలో పురుషుడు ఎడ్రస్ లేకుండా కొట్టుకుపోతాడు. సృష్టే స్తంభించి పోతుంది" అంటో ఆరితేరిన ప్లీడర్లా ధణధణా వాదించి తనని వూపెయ్యదూ !

అలాటప్పుడే తనపని ఇరకటాన పడుతుంది. అటు ఆమె వాదం ఖండించలేడు; ఇటు తన మాట సమర్థించుకోలేడు.

అందుకే ఏ పేచీలేని ఉత్తమమయిన పద్ధతి ఎప్పుడో ఎన్నుకున్నాడు తను.

"సందేహమెందుకూ ? స్త్రీకి ఆలంబనం పురుషుడు. పురుషుని మనుగుడకు మూలమే స్త్రీ. పకృతిలోనే ఇరువురికీ సరిసమానమైన ప్రాధాన్యత ఉన్నప్పుడు హెచ్చుతగ్గుల అనుమానానికి ఆస్కారమే ముందీ ?" అంటో ఆమెతో ఏకీభవించి వాదన పెరక్కుండా విరక్కొట్టేశాడు.

ఆ 'మనిషిలోని మడిసి'ని ఎరుగని బింధు అతని భావ ప్రకటనా విశాలతకు సంతోషించింది.

క్రిందటి రోజు తమ కాలేజీలో ఈ అంశం పైన డిబేటింగ్ జరిగింది. మాంసం తినేవాళ్లు అహింస గురించి ఉపన్యసించినట్టు వక్తల్లో చాలా భాగం పురుషపుంగవులే. కానీ పాపం ఎవరూ బొమికల్ని దాచుకో ప్రయత్నించలేదు. కాకపోతే చెప్ప టంలో కొంచెం తేడా కనబర్చారంతే.

ఒకడు, "మగవాడి కంటి కొనచూపు ఆజ్ఞకు బద్ధురాలయి వుండాల్సిన పిపీలికం లాంటి ఆడది నేనూ నీతో సమానమే ననటం మగజాతికే అవమానం" అంటో మొరటుగా హుంకరిస్తే —,

ఒకరు, "యుగయుగాలుగా పురుషుని ప్రత్యక్ష దైవంగా పూజిస్తో, సేవిస్తో, పునీతమై తరించి ధన్యమౌతున్న స్త్రీజాతిలో ఇప్పుడిలా స్వాతంత్ర్య కాంక్ష ప్రబలటం దేశానికే ముప్పనీ, గౌరవ ప్రదమైన మన సంస్కృతికే తీరని కళంకమ"నీ పాలిష్డ్ లాంగ్వేజిలో వాపోయాడు.

"మనస్సా మృదువు; దేహమా సున్నితం; ఇక మేధ చూద్దామా... పప్పుచారూ సాంబారు పొడీ అంటో వంటింటిని దాటిపోని తెలివితేటలు. అలాంటి ఆడవాళ్లు మాతో సమానమనటం హాస్యాస్పదం" అని ఇంకొకరు ఈసడించి మాటాడితే,

"నూటికో ఝాన్సీలక్ష్మి, కోటికో మేడమ్ క్యూరీ, నారీలోకంలో ప్రభవించినంత మాత్రాన మురిసిపోయి, గర్వించి, కొమ్ములు మొలిపించుకొని మీతో మేమూ సమానమంటూ మాతో పోటీకి దిగే బదులు ప్రతి మహిళా అంతవారవటానికి ప్రయత్నిస్తే ముందు ముందయినా మమ్మందుకో గలరేమో." అంటో సానుభూతితో సలహా ఇచ్చేడు మరొకడు.

ఇక చర్చలో పాల్గొన్న ఒకరిద్దరు ఆడపిల్లలూ తోడేళ్లగుంపుముందు కుందేలు పిల్లల్లా జంకుతో నచ్చులు కొడుతో ఏదో మాట్లాడబోయినా అక్కడ విన్న వాళ్లూ వినవిచ్చినవాళ్లూ మెచ్చుకు లేరు.

తనకెంతో బాధేసింది. పౌరుషమనిపించింది. అయినా తనప్పుడు వాళ్లవాదన ఖండించబూను కోలేదు; వాళ్ల గోలలో తనగోడు కలిసిపోతుంది తప్ప ప్రయోజనం లేదని.

అప్పట్నించి అబ్బాయిల్ని తలుచుకుంటే మంటెత్తు కొస్తుంది బిందుకి. పన్నీటి జల్లులా మురళి అభిప్రాయం ఆ మంటని చల్లార్చిందిప్పుడు.

'అందరి మగవాళ్ల మాదిరి కాదీయన.' అనే ప్రత్యేక అభిమానభావ ముదయించి మురళి మీద ఇది వరకే ఏర్పడిన గౌరవభావం ఇనుమడించింది.

మురళికి కావలిసిందదే. ఏ పరిస్థితుల్లోనూ తన మీద ఆమెకున్న సుముఖాభావం చెదరనివ్వ కూడదన్నదే అతని ఆరాటం.

అసలు బిందు సమక్షంలో అతని సహజ ప్రవృత్తి నిద్రపోతుంది.

నిజానికి మెడికల్ కాలేజీలో చేరిన కొత్తల్లోనే తననడవడిక చాలావరకూ మార్చుకున్నాడు మురళి.

ఆడపిల్లని జూడగానే ఈలవెయ్యటం, కన్ను గీటడం, అపభ్రంశపు మాటలు విసరటం లాంటి వికార చేష్టలకి ప్రేరేపించే చిత్తానికి బుద్ధిగరిపి, దుడుకు తనం మాన్పించి పెద్దరికం నేర్పాడు.

ఆ బుద్ధిమంతనం ఏడిపించే అబ్బాయిలకి ఎదురు తిరగడమే కాకుండా, తోక జాడించేలా చెయ్యగల నేర్పున్న అమ్మాయిల ప్రతాపం చవి చూచాక తెచ్చుకున్న మార్పు తప్ప స్వతహాగా వచ్చిందికాదు.

'మగవాడి భోగవస్తువు ఆడది.' అన్న అభిప్రాయం అతనిలో మొన్నమొన్నటివరకూ చెక్కు చెదరలేదు.

ముద్దరాలైన కన్య అనుభవయోగ్యమేకాక ఆరాధనీయం కూడా — అన్న వూహ తొలుతగా అతనికి కలిగించింది బిందు.

బిందు ఎదుట ఏ చపలత్వానికీ లోనుకాని పారవశ్యంలో వుండిపోతోంది అతని హృదయం





## కాలం కరిచాక

ఆమె తలపే అతనికో అనిర్వచనీయమైన ఆనందానుభూతిని కలిగిస్తోంది. సతతమూ ఆమె సాన్నిధ్య సుఖాన్ని కోరుకుంటోంది మనస్సు.

ఆమె ప్రసన్నవదన స్నేహ వీక్షణం కొరకు, ఆమె అభిమానానుగ్రహం కోసమూ తహ తహ లాడుతున్నాడతను.

కానీ అంతటి తన్మయంలోనూ, అంతటి తహతహలోనూ కూడా ఏవో అపశృతులు వినిపిస్తున్నాయి; అతన్ని కలతపరుస్తున్నాయి.

బిందు వస్త్రధారణా, ఆమె స్నేహాలూ, స్వేచ్ఛా ప్రవృత్తీ పంచదార గుళికల మధ్య వేపగింజల్లా వెగటు కలిగిస్తున్నాయి.

తానామెను చేరుకునే త్రోవలో కంటకాలలా బాధిస్తున్నారు మిగతా ఆమె బాయ్‌ఫ్రెండ్సు.

ఆమె సంభాషణా చతురతలో తానను భవిస్తున్న థ్రిల్ వాళ్ళూ పంచేసుకుంటున్నారే అన్న దుగ్ధ;

అతికినట్టున్న దుస్తుల్లో ఆమె అవయవ సౌష్టవ ప్రాభవాన్ని తాను కన్నులతో గ్రోలినట్టే వాళ్ళూ తాగేస్తున్నారని జెలసీ;

తనతో నవ్వినట్టు వాళ్ళతోనూ తుళ్ళుతుందే మని బిందుమీద అలక;

అడ్డమైన వెధవల్తోటీ స్నేహాలేమిటని ఈయనన్నా కోప్పడడేమని మధ్య మధ్య రంగారావు గారిమీద ఓ గాలివిసురు;

'అమ్మాయ్ ఇది నీకు తగదు' అని తనే చెప్పేస్తే సరి అని ఓ అడుగు వేగిరపాటు;

ఇంతకీ అలా చెప్పేందుకు 'ఆమెకు తానెవరిని?' అన్న విచారం;

ఆమెనలా శాసించగలిగే అధికారాన్నీ, ఆమెను తన ఆజ్ఞాబంధనంలో బిగించగలిగే హక్కునీ భుక్తం చేసుకోవాలనే తొందర;

ఆ ఆశ ఎప్పటికి తీరేనో అన్న నిట్టూర్పు;

మురళి నలిబిలి అయిపోయేడు కొన్నాళ్ళు.

ఆ నలిబిలిలోనే అతని హృదయం వెలువరిస్తున్న ప్రణయ సందేశాలు చేరవలసిన చోటికి చేరుకున్నాయి. అతని వలపుబాటకు పునాది పడింది.

వసంతవేళ కోకిల కూతకి పులకితం కాని హృదయమూ, పరువపువేళ వలపు పిలుపుకుబదులిడని హృదయమూ ఉండవేమో !

బిందు మనసూ అందుకు అతీతం కాలేదు.

అబ్బాయిల సహవాసం బిందుకి కొత్తేమీకాదు. కానీ సమవయస్కులూ, సహాధ్యాయులూ ఐనవారిలో ఎవరూ ఆమె మనోమందిరపు కవాటాలు తెరవ ప్రయత్నించలేదు.

మురళి ఆ మందిర ప్రవేశం చేయటమేకాక శ్రుతి చేసిన వీణలాటి ఆమె హృదయాన్ని తొలిగా మీటిన వైణికుడయ్యాడు.

జగత్తంతా ఆ మృదుమధుర ప్రణయగాన తరంగాలతోనే నిండినట్టు తోచసాగింది బిందుకి.

కానీ ఇరువురి మనోగత భావాలు పరస్పరం వెల్లడి చేసుకునే అవకాశం ఇంకా రాలేదు

(ఇంకా వుంది)




పోర్టికోలో నిలబడి క్రింది గార్డెన్‌లోకి చూస్తున్న మధు చూపులు గేటు ధాటుకొని వస్తున్న తండ్రి కారుపై ప్రసరించాయి. డోరు తీసుకొని క్రిందకు దిగిన రావుగారు సరాసరి ఇంట్లోకి వెళ్ళకుండ గార్డెన్‌లోకి అడుగుపెట్టి మెల్లగా పచార్లు చేయసాగారు. అస్తమయ సూర్యుని అరుణ వర్ణపు కాంతిలో తోటలోని ప్రతి మొక్క చిత్రమైన అందాన్ని సంతరించుకొంటు మెల్లగా వీచే గాలికి తలలూపుతూ రావుగారికి ఆహ్వానం పలుకుతున్నాయి. ఒక ప్రక్కగా వున్న తెల్లగులాబీ మొక్క దగ్గరగా తండ్రి నిలబడి తదేక ద్యానంతో చూస్తుండటం మధుకు కనిపించింది.

• తండ్రిని చూస్తున్న మధులో తాత్కాలికంగా మర్చిపోయిన బాధ తిరిగి చిన్నగా రేగటం మొదలెట్టింది. తనకే తెలియని ఏదో ఆందోళన, ఆరాటం మధుని అనిశ్చితమైన పరిస్థితిలోనికి నెడుతున్నాయి. చిన్నతనంనుండి తండ్రి పట్ల ఏర్పరచుకొన్న గౌరవ భావానికి భంగం ఏర్పడితే తట్టుకోలేనట్లుగ తండ్రిని చూస్తున్న మధు చూపుల్లో ఒక విధమైన బేలతనం అసహాయత కొట్టవచ్చినట్లుగ కనిపిస్తున్నాయి. తన అంతరంగంలో తండ్రిని గురించి ఇలా అగౌరవంగా తలపోయటానికి మధులో సంస్కారం అడ్డు పడుతున్నది. అయితే తను ప్రత్యక్షంగా చూచిన







# విలువలు

దృశ్యం కళ్ళముందు మరుపురాకుండా గిర్రున తిరుగుతున్నది. చాలా రోజులుగా తనలో వున్న సందేహానికి ఆ సంఘటన బలాన్ని చేకూర్చింది. తండ్రి ప్రవర్తన పట్ల తనకు కలిగిన సందేహానికి తప్పు చేసినట్లుగ బాధకు గురియవుతున్న మధు నిన్నటి సంఘటనతో తండ్రి ప్రవర్తనను ఏ విధంగా బేరీజు వేయాలో తెలియక సతమతమవుతున్నాడు. మనసులో తండ్రిని శంకించవలసిన దుఃస్థితి కలిగినందుకు మధుకి తన సంస్కారం పట్ల నమ్మకం సడల జొచ్చింది. తన దృష్టిలో తండ్రి. ఒక మహోన్నతమైన వ్యక్తిత్వం గల మనిషి. చిన్న తనం నుండి మనసులో తండ్రి పట్ల ఏర్పరుచుకొన్న భావాన్ని ఎట్టి పరిస్థితిలోనూ తేలిక పరచుకోవటం తనవల్లకాదు. తన అంతరంగంలో రూపుదిద్దుకొన్న తండ్రి వ్యక్తిత్వం పట్ల తనకు నమ్మకం వుంది. మరయితే తండ్రి ప్రవర్తనపట్ల తనకు రెండు రోజులుగా ఇంతటి ఆందోళన ఎందుకు కలుగుతున్నదీ మధుకి అర్థం కావటం లేదు. నిజాన్ని తండ్రిని అడిగి తెలుసుకొనే చొరవ, తమ ఇద్దరి మధ్య అటువంటి స్నేహపూర్వక అనుబంధం వున్నాగాని తండ్రి వ్యక్తిగత విషయాల్లో తలదూర్చటం ఎంతవరకు సమంజసమా ? అన్న శంక మనసుని పట్టి పీడిస్తున్నది. చూచిన విషయాన్ని మర్చిపోవటం తండ్రి పట్ల పూర్వం వలె ప్రవర్తించటం కూడా సాధ్యం కావటం లేదు.

మొన్నటి రోజు రాధతో కలసి బీచికి వెళ్ళిన మధు కొద్ది దూరంలో సముద్రానికి అభిముఖంగా కూర్చున ఒక నడి వయస్సు స్త్రీ పురుషులలో పురుషుడిని తన తండ్రిగా గుర్తుపట్టాడు. వెనుక భాగంలో వున్న ఆ స్త్రీని పరికించి చూచే అవకాశం మధుకి కలగలేదు. చాలా రోజులుగా తండ్రిని గురించి తాను అక్కడక్కడ వింటున్న మాటలకు ఈ సంఘటనతో ఆధారం లభించినట్లయినది.

ఒక ప్రొఫెసర్‌గా, సంఘంలో గౌరవ ప్రతిష్టలు గలవాడు, విద్యాధికుడు అయిన తన తండ్రి ఈ విధంగా ప్రవర్తించటానికి ఏదో బలీయమైన అంతరింగిక కారణం వుండి వుంటుంది. లేకుంటే తండ్రి మంచి చెడ్డలు తెలియక వివక్షణా రహితంగా ప్రవర్తిస్తారంటే మధుకి మనసు అందుకు అంగీకరించటం లేదు.

హఠాత్తుగా మధుకి ఒక విషయం జ్ఞాపకం వచ్చింది. అది వారం రోజులుగా తండ్రికి తాను చెప్పదలుచుకొన్న విషయం. ఈ రెండురోజులుగా తాను పొందుతున్న ఆరాటం వలన మరుగున పడిపోయింది. ఆ విషయం తండ్రితో మాట్లాడుతూ వీలైతే తన సందేహాన్ని కొంతవరకైనా నివృత్తి చేసుకోవచ్చు. అప్పటికిగాని తన మనసు తేలికపడదు. ఆలోచనల నుండి తేప్పరిల్లి మధు గార్డెన్‌లోకి చూచాడు. తండ్రి అక్కడ కనపడలేదు. బహుశా రీడింగ్ రూములో వుండవచ్చు. కాలేజీనుంచి వచ్చి టీ త్రాగి చదువుతూ కూర్చోటం తండ్రికి అలవాటు.

మెట్లుదిగి వస్తున్న మధుకి అప్పుడే కారుదిగి లోపలికి వస్తున్న తల్లి ఎదురైంది.

"హలో మధూ కాలేజీనుంచి వచ్చి ఎంత సేపైంది ?" రమాదేవి గొంతులో కొడుకుని తల్లి పలకరించే విధానంకన్నా నేటి నాగరిక లక్షణాలే ఎక్కువగా ప్రస్ఫుట మౌతుంటాయి.

పెదవులకు లిప్‌స్టిక్, స్లీవ్‌లెస్, బ్లౌజ్, హైహీల్సు షూస్ మొదలగు అలంకరణతో నేటి నాగరిక సమాజానికి ప్రతిరూపంగా భాసిస్తుంటుంది రమాదేవి రూపం. వయసుకి తగని ఆ అలంకారం మధుకి నచ్చదు. తల్లి దగ్గర చిన్నతనం నుంచీ చనువు ఏర్పడకపోగా ఏదో బెరుగ్గా ఫీలౌతాడు మధూ. తండ్రిపై మధుకి ఎంతటి గౌరవభావముందో తల్లి ప్రవర్తన పట్ల అంతటి విముఖత వుంది. ఇల్లు పట్టకుండా ఇరవైనాల్గుగంటలు క్లబ్బులకు, సినిమాలకు తిరుగుతూ స్నేహితులతో సరదాలు తీర్చుకొనే తల్లినుండి ఒక కొడుకుగా మధు ఏనాడు ఆదరణ, ఆప్యాయతకు నోచుకోలేదు. మధు తమ్ముడు మధుకర్, చెల్లెలు సుజాత మాత్రం తల్లి అడుగుజాడలలోనే నడుస్తుంటారు. మధు స్వభావం చిన్నతనం నుంచీ విలక్షణంగానే వుండేది. మధులో తండ్రి లక్షణాలు, పోలికలు ఎక్కువగా కనిపిస్తాయి. తండ్రికి కొడుకుగా పెరగటమే మధుకి ఇష్టం. అందుకే ఈనాటి విశృంఖలమైన నాగరికతా ఛాయలు మధుపైన ఎటువంటి ప్రభావాన్ని చూపలేకపోయాయి.

రమాదేవి దృష్టిలో మాత్రం తండ్రికొడుకు లిద్దరూ అనాగరికులే. భర్త చూస్తే ఎప్పుడూ పుస్తకాలు చదువుతూ కూర్చోవటం, లేకుంటే బొమ్మలు వేస్తూ కూర్చోటం తప్ప ఇతరత్ర ఏ సరదా లేని మనిషి. కొడుకు చూస్తే జాలీగా రోజులు క్షణాలుగా గడపవలసిన ఏజ్‌లో కాలేజి ఇల్లు తప్ప మిగిలిన ప్రపంచం పట్టదు. అందుకే వీళ్ళిద్దరికి దూరంగా తన ఆనందం తాను వెతుక్కుంటుంటుంది రమాదేవి.

తండ్రి రీడింగ్ రూమ్‌లో అడుగుపెట్టిన మధు ఒక్క క్షణం రూమ్‌ని పరికిస్తూ వుండి పోయాడు. నలువైపులా అద్దాలు బిగించబడిన రాక్సు నిండా అమర్చిన పుస్తకాలు ప్రపంచంలోని విజ్ఞాన సంపదనంతా తమలో గుప్తంగా దాచుకొని మౌనంగా గంభీరంగా చూస్తున్నట్లు, పొందికగా సర్దబడియున్నాయి. వాటికి వేసిన రంగురంగుల అట్టలు చిత్రకారుడు గీసిన వర్ణచిత్రాన్ని చూస్తున్నట్లుగా ఒక విధమైన అనుభూతిని కలిగిస్తున్నాయి. ఒక్కప్రక్క రాక్‌మీద అందంగా అమర్చిన పూల కుండీలోని లిల్లీపూలు సున్నితమైన పరిమళాన్ని గదినిండా వ్యాపింపజేస్తున్నాయి. ఇంకొక వైపుగా వున్న రాక్‌మీద అర్ధనగ్నమైన భంగిమలో వీనస్ శిల్పం ధవళకాంతులు వెదజల్లుతూ సొయగాలు చిందిస్తూ నిలబడియున్నది. వేరొకవైపున పెదవులపై మెత్తని చిరునవ్వుతో కళ్ళలో వింత కాంతులు కురిపించుచుతూ ముగ్ధమోహనకరంగా వున్న ముఖ భంగిమతో ఒక అపరిచిత యువతి ఫొటో చీకటి ఫ్రేమ్‌లో బిగించబడివుంది. తన ఎదురుగా లేత నీలిరంగు వేసిన గోడకు తగిలించిన చిత్రపటం లోని దృశ్యాన్ని చూచిన మధు హృదయం ఒక్క క్షణం ఏదో తెలియని రసానుభూతికి లోనై పరవశించింది.

ఆ చిత్రంలో మహోత్సాహంతో ఎగిసిపడుతున్న తెల్లని సముద్ర కెరటాలకు నీలివర్ణాన్ని పులుముతూ వెండిముద్దలా ప్రకాశిస్తున్నాడు చంద్రుడు. ఆ లేత నీలి వెన్నెలలో అస్పష్టంగా కనిపించీ కనిపించని ఒక మానవాకారం

నిర్నిమేష దృక్కులతో ఆ ప్రకృతిలో పరవశించిపోతూ కడలికి అభిముఖంగా నిలబడి వున్నది. ఆ ఆకారం కాళ్ళ క్రిందగా మెత్తటి తెల్లటి ఇసుక చిత్రించబడి వుంది. ఆ చిత్రంలో ఒక మూలగా 'ఆర్' అనే తన తండ్రి సంతకం వ్రాయబడి వుంది. ఆ చిత్రం చూస్తున్న వారెవరైనా ఒక్క క్షణం ఆ నీలి వెన్నెలలో తాము కూడ సముద్రపుటొడ్డున విహరిస్తున్న అనుభూతికి లోనౌతారు.

తన కుడి చేతి వైపు వున్న తండ్రి కూర్చుని చదువుకొనే టేబుల్ పై మధు దృష్టి ప్రసరించింది. పెన్‌స్టాండ్, లేటర్‌పాడ్, తండ్రి వుపయోగించే గోల్డ్ ఫ్రేమ్ కళ్ళజోడు, పేపర్‌వెయిట్ క్రిందగా గాలికి రెపరెప కొట్టుకొంటున్న తెల్లని కాయితాలు, టేబుల్ కెదురుగా తండ్రి కూర్చోడానికి రివాల్వింగ్ చైర్ వేసివున్నాయి. గదినంతటిని కలయచూస్తున్న మధు తండ్రి అభిరుచిని మనసులోనే అభినందించాడు.

ఇంతలో తండ్రి వస్తున్నట్లుగా మెత్తని సాండిల్సు చప్పుడు వినిపించటంతో తేరుకొని వచ్చిన పని గుర్తు చేసుకొంటూ నిలబడిపోయాడు. —

మధుని రూములో చూచిన రావుగారి కళ్ళు ప్రశ్నార్థకంగా ముడిపడ్డాయి. ఎంతో అవసరమైతే తప్ప కొడుకు తన రీడింగ్ రూములోకి రాడని రావుగారికి తెలుసు. ఇంట్లో ఎవరు కూడ తను ఈ రూములో వుంటే డిస్టర్బ్ చేయరు. పిల్లలకు కూడ ఆ విధంగా చిన్నతనం నించి తర్ఫీదు ఇవ్వబడింది. గదిలోకి వచ్చిన రావుగారు కళ్ళజోడు పెట్టుకొంటూ వచ్చిన పని చెప్పమన్నట్లుగ కొడుకు కళ్ళలోకి చూచారు.

మధు ముఖంలో ఏదో చెప్పాలనే ఆరాటం, ఎలా చెప్పాలనే సంశయం రావుగారి కళ్ళపడక పోలేదు.

"మధూ! నిలబడి వున్నావే కూర్చో" ఆ కంఠంలో మృదుత్వం, కొడుకు పట్ల ఆత్మీయతా భావం పెనవేసుకొని వున్నాయి.

తండ్రి మూడ్‌ని పసికట్టిన మధులో కొంత ధైర్యంరాగా సోఫాలో తండ్రికెదురుగా కూర్చుంటూ—

మెల్లగా తన చేతిలోని పుస్తకంలోంచి ఒక కార్డుసైజు ఫొటో తండ్రి చేతిలోపెట్టాడు. ఫొటో చూడగానే పరిస్థితి గ్రహించిన రావుగారు వివరాలు కొడుకు నోటి వెంట వినాలనే కుతూహలంతో,

"ఎవరీ అమ్మాయి ?" అంటూ ప్రశ్నించారు.

"పేరు రాధ. మా కాలేజీలోనే చదువుతోంది. మీరనుమతిస్తే ఈ సంవత్సరం చదువు పూర్తవగానే వివాహం చేసుకోవాలని నిర్ణయించుకొన్నాము."

కొడుకు కంఠంలో ధ్వనించిన భావోద్వేగానికి రావుగారి పెదవులపై చిరునవ్వు విచ్చుకుంది.

"ఎప్పటినుంచీ మీ పరిచయం ?"

"ఒక సంవత్సరకాలంగా రాధ నాకు తెలుసు. రోజూ కలుసుకొంటుంటాము" మధు ముఖంలో ఒక లిప్తకాలం ఎరుపు తొంగిచూచి మరుక్షణం మాయమయింది.

"మధూ . నీవు చిన్నవాడివి కాదు. నీ జీవితాన్ని నీవు ఏ విధంగా మలుచుకోవాలో నిర్ణయించుకొనే పాటి వివేకం నీకుందని నా నమ్మకం. నీ మనసుకు వ్యతిరేకంగా నేనెట్టి పరిస్థితిలోను ప్రవర్తించనని నీకు తెలుసు. అది నా అభిమతం కూడ కాదు. అయితే వివాహం అనేది జీవితంలో అతి ముఖ్యమయిన మలుపులాంటిది. ఈ మలుపు దగ్గరే వివేకంతో ప్రవర్తించాలి. లేకుంటే భవిష్యత్ జీవితానికి మన ఆనందాన్ని, సంతోషాన్ని బలిచేసి జీవించినవ్వాళ్ళు వేదనతోనే రోజులు గడపవలసి వస్తుంది."

తండ్రి చెబుతున్నది కాదనలేనట్లుగా మధు మెల్లగా తల వూపాడు.

"మధూ ! యవ్వనంలో వున్న నీ కళ్ళకు పరిసరాలన్నీ ఆనందమయంగానే కనపడుతుంటాయి. అట్లాగే అందమయిన స్త్రీని చూస్తే నీ హృదయం లయతప్పి నీ వివేకం మరుగునపడి ఆ ఆనందాన్ని ఆస్వాదించాలనే కోరిక కలగటం నీ వయసులో సహజం. స్త్రీ పురుషుల మధ్య వుండే ఆకర్షణ బలీయమైనది. ఒక్కసారి ఆ ఆకర్షణకు లోనై వివేక శూన్యంగా జీవితం పట్ల నిర్ణయం తీసుకొన్నామంటె చివరకు తన అస్తిత్వాన్నే పోగొట్టుకొంటాము ."

"కానీ నాన్నగారూ !"

తండ్రి ధోరణికి అడ్డుపడుతున్నట్లుగ అన్నాడు మధు. చెప్పటం ఆపి ఇక చెప్పవలసింది కొడుకు వంతే అన్నట్లుగ మధు కళ్ళలోకి చూస్తుండిపోయారు రావుగారు.

"నాన్నగారూ ! ఇది కేవలం ఆకర్షణతో తీసుకొన్న నిర్ణయం కాదు. రాధతో సహచర్యాన్ని నా మనసు కోరుకొంటున్నది. ఒక్క రోజు రాధను చూడకపోతే ఏదో పోగొట్టుకొన్నట్లుగ నా మనసుకు తెలుస్తున్నది. రాధ అందమైనదే కావచ్చు నాకు కావలసింది రాధ తప్ప రాధ అందం కాదు." నన్ను అర్థం చేసుకోండి అన్నట్లుగా తగ్గు స్వరంతో తండ్రికి తన బాధ విప్పి చెప్పటానికి ప్రయత్నిస్తూ అన్నాడు మధు.

కొడుకు కళ్ళలో ప్రతిఫలిస్తున్న భావం రావుగారికి అర్థం అయింది. చిన్న తనం నుంచీ కొడుకు స్వభావం తెలిసి వుండటంతో ఆలోచించే ఈ నిర్ణయం తీసుకొన్నట్లుగ నమ్మకం కలిగింది. కానీ తన మనసు పొరల్లో గుప్తమై పోయిన ఏదో వేదన కొడుకుకి త్వరగా అనుమతి ఇవ్వటానికి అంగీకరింపచేయటం లేదు. కొన్ని నిముషాలు మౌనంగా వుండిపోయిన తండ్రి ముఖంలో ఏదో బాధ నీడ చూపి వట్లై మధు హృదయం గిలగిల లాడింది. తండ్రిని ఆ పరిస్థితిలో ఎన్నడూ చూడని మధు కొంత ఆశ్చర్యానికి లోనైయ్యాడు.

"నాన్నగారు ఏమిటలా అయిపోయారు ? " మధు కంఠంలో ఆతృత, ఆరాటం.

కొడుకు ప్రశ్న వినిపించిందో లేదో గాని రావుగారు మాత్రం దాదాపు శూన్యమైన దృక్కులతో టేబులు పైన వున్న ఫొటోవైపు చూపులు బరిపి మౌనంగా కూర్చుడి పోయారు.

"మధూ ! వైవాహిక జీవితంలో అనాలోచితంగా తీసుకొన్న నిర్ణయాలకు జీవితాన్నే పోగొట్టుకొంటాము. ఉదాహరణకు నా జీవితంలో కొన్ని ముఖ్యమైన విషయాలను చెబుతాను. నీవు పెద్దవాడివయ్యావు. జీవితం పట్ల సరియైన దృక్పథం ఏర్పరచుకోవలసిన అవసరం ఎంతటిదో నీవు నా జీవితం గురించి విని నిర్ణయించుకొంటే సంతోషిస్తాను." కళ్ళు మూసుకొని కుర్చీలో వెనక్కు వాలి గంభీర స్వరంతో మెల్లగా చెబుతున్న తండ్రి మాటలు శ్రద్ధగా, కుతూహలంతో వినసాగాడు మధు.

"మీ తాతగారు సాంప్రదాయబద్ధంగా జీవించే వ్యక్తి. చాలా పట్టుదలగలవారు. చాలా చిన్నతనంలోనే ఇంట్లో పరిస్థితులు నా మనసుకు నచ్చక వారితో ఘర్షణకు దిగలేక నాదనుకొనే ఒక ప్రపంచాన్ని ఏర్పరచుకొని సమయమంతా అందులోనే గడిపేవాడిని. అప్పుడే చదువుతోపాటుగా సాహిత్య






# కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనా ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవదని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపుఅతికించిన కవరు జతవేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– సం॥

## విలువలు

మంటేకూడా నాలో మంచి అభిరుచి వుండేది. చాలా చిన్నవయసునుంచి వివిధ రకాల సాహిత్యాన్ని నిత్యం పఠిస్తుండేవాడిని. అట్లాగే చిత్రలేఖనం అంటే కూడ నాకు మొదటినుండీ ఎంతో ఇష్టం. దానిలో కూడ కృషి చేస్తూనే వచ్చాను. జీవితంలో నా ఇష్టాని కనుగుణమైనవన్నీ పొందానేగాని జీవితంలో ముఖ్యమైన ఆనందాన్ని మనశ్శాంతిని మీ తాతగారి పట్టుదలకు లొంగి అనాలోచితంగా బలి చేసుకొన్నానని తెలిసేటప్పటికే పరిస్థితి చెయ్యిదాటిపోయింది.

కాలేజీ రోజులలో వసంతంటే నా మనసులో అంతులేని ఇష్టం ఏర్పడింది. వసంత రూపం, వసంత తలపులకు నా గుండె విపరీతంగా స్పందించేది. ఇద్దరం ఒకరు లేకుండా ఇంకొకరు బ్రతకలేమని తెలుసుకొని జీవితాన్ని కలసి పంచుకోవాలని నిర్ణయించుకొన్నాము. మీ తాతగారి దృష్టిలో వసంత సంఘంలో తక్కువ స్థాయిలో వున్న వ్యక్తి. ఈ కారణంగా వసంతను కోడలిగా అంగీకరించటానికి మీ తాతగారు సుతరామూ ఒప్పుకోక వారి పట్టుదలకు మా జీవితాలను బలి చేశారు. ఆ లేత వయసులో భవిష్యత్ జీవితంలో నాకు కావలసిందేమిటో తెలుసుకొనే లోపునే నేను వసంతను పోగొట్టుకోవటం, మీ అమ్మ నా జీవితంలో ప్రవేశించటం జరిగిపోయింది.

మేడలు, కార్లు, సంఘంలో హోదా ఇవే మీ అమ్మ దృష్టిలో జీవితమంటే! డబ్బు, నగలు, చీరలు, తనను అనుక్షణం భట్రాజుల్లా పొగుడుతుండే స్నేహితులు, క్లబ్బులు, సినిమాలు, సరదాలు ఇవే మీ అమ్మ దృష్టిలో జీవిత విలువలంటే. మనుషుల మధ్య వీటన్నింటిని మించిన విలువలు వుంటాయన్నది మీ అమ్మకు ఎప్పటికీ స్ఫురణకు రాని విషయం. జీవితంలో నిజమైన ఆనందం అంటే ఏమిటో తెలియని మీ అమ్మ ఇటువంటి కృత్రిమపు ఆనందానికి అలవాటుపడి ఆ వ్యామోహానికి లొంగి తెల్లారి లేస్తే వాటివెంట పరుగులు పెడుతుంటుంది. కట్టుకొన్నవాడికి భార్యగా ఆదరణను, ఆప్యాయతను అందివ్వాలనే స్పృహ మీ అమ్మలో ఏ కోశానా లేదు. నా నిత్యజీవితావసరాలన్నింటికీ ఇన్ని సంవత్సరాలుగా నౌకర్లమీదే ఆధారపడుతూ వచ్చాను. మీరు పుట్టింతర్వాత మీ పట్ల కూడ మీ అమ్మ తన బాధ్యతలను నెరవేర్చలేదు. అందుకే మొదటిసారిగా నీవు పుట్టినప్పుడు నాలోని పితృవాత్సల్యంతో నీవు అనాదరణకు గురి కాకూడదనే నిన్ను నాకు దగ్గరగా పెంచాను.

ఆత్మీయత, అనురాగము అనే పదాలు మీ అమ్మ దృష్టిలో ఎందుకు కొరగానివి. జీవితాన్ని అందినంతవరకూ అనుభవించటమే ఆమె ధ్యేయం. నా కోసం మీ అమ్మ తన ప్రవర్తనను ఎన్నటికీ మార్చుకోలేదు. నేను నా జీవిత విధానాన్ని వదులుకొని కృత్రిమమయిన విలువల కోసం పరుగులు పెట్టే స్వభావం నాలోలేదు. ఈ విధంగా మా జీవితమార్గాలు వేరు పడిపోయాయి. ఇవి ఎన్నటికీ కలిసే ఆశ లేదని నాకు క్రమక్రమంగా అర్థమైంది.

ఆత్మీయత కరువై యాంత్రికంగా నిర్జీవంగా రోజులు దొర్లిస్తున్నా నా బ్రతుకులో తిరిగి ఒకనాడు హఠాత్తుగా వసంత ప్రవేశించింది. ఈ వూరులోనే కాక తాళీయంగా వసంత నాకు తారస పడ్డది. తన తండ్రి చనిపోవటంతో కుటుంబ భారమంతా తన మీద పడటం, తన రెక్కల కష్టం మీదే చెల్లెళ్ళను చదివించి వివాహం చేశానని, తాను మాత్రం నా స్మృతులలో జీవిస్తూ అవివాహితగానే మిగిలి పోయానని వసంత చెబుతున్నపుడు నేను జీవితంలో పోగొట్టుకొన్నది ఎంతటి విలువైనదో నా కర్థమైంది.

నా ఆనందాన్ని, సంతోషాన్ని ఎవరి దగ్గరయితే వదలి ఇన్నాళ్ళూ జీవచ్ఛవంలా బ్రతికానో వారు నాకు కలిగించే మనశ్శాంతి నా చుట్టూ వున్న ఈ సంపద నుంచి కొన్ని క్షణాలు కూడ నేను పొందలేకపోయానని తెలుసుకొన్నాను.

నన్నభిమానిస్తూ, నా కోసం జీవించే వ్యక్తి కోసం అలమటించి పోతున్న నేను వసంత చూపే అనురాగానికి, ఆదరణకు తిరిగి వూపిరి పోసుకుని వసంత సహచర్యంలో ఆనందాన్ని వెతుక్కోటం మొదలెట్టాను. రోజు మొత్తంలో వసంతతో గడిపే ఆ క్షణాలే నేను నిజంగా జీవించే క్షణాలు. నానుంచి భౌతికమైన సంపదలనేవీ వసంత ఆశించటంలేదు. ఈ జీవితంలో మిగిలిన ఈ సమయాన్నైనా నా సాన్నిధ్యంలో గడపాలని వసంత కోరుకొంటోంది. అందుకే సంఘం కోసం వెరచి జీవిత చరమాంకంలో దక్కిన ఈ కొద్దిపాటి ఆనందాన్ని పోగొట్టుకోటం నా కిష్టం లేదు.

నీకు వయసు వస్తున్నది. ఈ విషయాన్ని నీవు ఎవరినోటివెంటో విని దురభిప్రాయం ఏర్పరచుకొనే కన్నా నా నుంచి వినాలనే వుద్దేశ్యంతోనే నీకు ఈ విషయాలు చెప్పాను. తాత గారి చాదస్తం వల్లనే నా జీవితం పాడైంది. తిరిగి నేను అటువంటి పొరపాటు చేయను. మనుషులను కుల గోత్రాలు, సంపద, హోదా ముసుగులలోంచి నేను చూడనని నీకు తెలుసు. నా దృష్టిలో మనుషులకు మానవత్వానికి వున్న విలువ జీవితంలో మరి వేటికీ లేదు. మనిషి కోసం మనిషి బ్రతకటంలోనే నిజమైన ఆనందం వుంది. రాధ లేకుండా నీవు జీవించలేవని, రాధతోనే నీ ఆనందం ముడిపడివుందని నీవు నమ్మితే నా కభ్యంతరం ఏమీ లేదు. కానీ జీవితంలో స్థిరపడే దాకా మీ వివాహాన్ని వాయిదా వేస్తే అప్పటివరకు మీరిద్దరూ ఇంకా ఎక్కువగా ఒకరి నొకరు తెలుసుకోటానికి అవకాశం వుంటుంది. ఆలోచించు" చెప్పటం ఆపి మధు వంక చూచారు రావుగారు.

తండ్రి మాటలు వింటూ ఇన్ని సంవత్సరాలుగా తండ్రి పోగొట్టుకున్నదేమిటో, దాని నుంచి తండ్రి ఎంతటి ఆవేదనకు గురి అయ్యాడో మధు గ్రహించాడు. తండ్రిపట్ల సానుభూతితో హృదయం బరువెక్కగా—

"థాంక్సు నాన్నగారు. రాధను మీరు కోడలిగా అంగీకరించినందుకు నాకు చాలా సంతోషంగావుంది. వివాహం మీరు చెప్పినట్లే జరుగుతుంది" మెల్లగా తండ్రికి సమాధానం చెప్పి గదినుంచి బయటపడ్డాడు మధు. తండ్రి ప్రవర్తనపట్ల కలిగిన సందేహం తొలగిపోగా ఇనుమడించిన గౌరవాభిమానాలతో మధు మానసం తేలికపడి మనసులోనే మరొక్కసారి తండ్రికి కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. 

VIP PRESENTS

# THE CHAMP

**THE DESIGN CHAMP***
Contoured to give you the best support.

**THE ELASTIC CHAMP***
The toughest and most comfortable. Made from imported rubber.

**THE FABRIC CHAMP**
Finest 100% doubled-combed Egyptian cotton.

**THE GRIP OF A CHAMP**
A gentle but firm 'stretch' band around your legs, too.



* FABRIC AND ELASTIC DESIGN REGD.

# VIP CHAMP

**Deluxe Briefs**

• 6 WINNING COLOURS.

**You can't beat it for quality. Or price.**

Avenues HH/IR/244

( గత సంచిక తరువాయి )































[ఇంకా ఉంది]

# నీవు నేర్పిన విద్యయే నీలకంఠా!

కంచుమర్తి వెంకటేశ్వరరావు



కలెక్టరాఫీసులో ఎల్. డి. సి పోస్టు కని ఇంటర్వ్యూకెళ్ళి దిగాలుగా వచ్చిన కొడుకు రామంను చూసి ఏమీ అనలేక పోయాడు నీలకంఠం.

ఎన్ని ఇంటర్వ్యూలకెళ్ళినా ఫలితం దక్కడంలేదు. అతనికి తెలుసు ఎక్కడ లోపముందో. ఆఫీసర్లు కోరిన బరువు వారి జేబులను నింపాలి లేదా ఒక మినిష్టరు లేదా ఎం. పి గారి రికమెండేషనయినా ఉండాలి.

ఆ రెండూ నీలకంఠానికి అందుబాటులో లేవు.

హైస్కూలు టీచరుగ పని చేసి రిటైరయిన నీలకంఠం ఎంత సంపాదించాడో తెలియదు గాని ఇద్దరమ్మాయిలకు పెళ్ళిళ్ళు తన తాహతుకు తగిన సంబంధాలు చూసి జరిపించాడు. పెద్ద కొడుకు రామంను బి ఎ వరకు చదివించాడు రెండో కొడుకును పదవ తరగతి వరకు చదివించి మరి ఆర్థికంగా తట్టుకోలేక ఐ. టి. ఐ. లో చేర్పించాడు. ఇదీ నీలకంఠం బడి పంతులుగ పని చేసి సంపాదించినది.

పెద్ద మనుష్యుల పెదవుల మీద తన పేరును పలికించు కోలేక పోయాడు. తన వృత్తి ధర్మాన్ని నెరవేర్చడంలో మాత్రం నూటికి నూరు పాళ్ళు విజయం సాధించాడు. అతను పని చేసిన స్కూల్లో ప్రతి సంవత్సరం అతను తీసుకున్న పదవ తరగతి సెక్షనులో విద్యార్థులు చాలా మంది ఫస్టుక్లాసులో పాసవ్వడం జరిగేది.

"నీలకంఠం...విద్యార్థులను క్రమశిక్షణతో నడిపి వారిని ఉత్తేజపరచి వారి భవిష్యత్తుకు సరియైన పునాదులు వేస్తున్నావు. ఈ స్కూలులో నీలాంటి టీచరుండడం నాకెంతో ఆనందంగా ఉంది. అ యామ్ వెరీ ప్రౌడాఫ్‌యూ..."

హెడ్ మాష్టారు గారు విన్నోసార్లు పొగిడేవారు.

అలా హెడ్ మాష్టారు చేత, తోటి టీచర్ల చేత గౌరవింపబడి, విద్యార్థుల చేత మంచి మాష్టారని పించుకున్న నీలకంఠం రిటైరై విశ్రాంతి తీసుకుంటున్నాడు.

అతని ఆలోచనలన్నీ రామం గురించే. బి ఏ. పాసై మూడు సంవత్సరాలైనా ఉద్యోగం రాలేదు. వచ్చిన ప్రతి ఇంటర్వ్యూకు వెళ్ళడం, నిరాశగా తిరిగి రావడం.

"నాన్నగారూ... ఇంటర్వ్యూలో ఒక విషయం తెలిసింది. మెరిట్‌లో నా కంటె ఇద్దరు అధిక్యతలో ఉన్నారు. ఎవరైనా రికమెండ్ చేస్తే రావచ్చు."

మధ్యాహ్నం భోజనాలు చేస్తుండగా ఆ మాటే అన్నాడు రామం.

నీలకంఠం చేతిలోని ముద్ద నోట్లోకి వెళ్ళలేదు.

ఎవరి చేతనైనా రికమండ్ చేయిస్తే ...

ఎవరు . ఎవరు చేస్తారు.

వరండాలో కొచ్చి వాలుకుర్చీలో కూర్చుని ఆలోచించడం మొదలు పెట్టాడు. ఆ సాయంత్రం పోస్టుమేన్ నీలకంఠానికి ఒక కవరిచ్చి వెళ్లాడు.

ఎవరబ్బా వ్రాసింది ... అనుకుంటూ విప్పాడు.

నీలకంఠం ఆశ్చర్యపోయాడు.

కలెక్టర్ శేఖర్.

ఎవరీ కలెక్టర్ శేఖర్.

కలెక్టరు తనకు లెటరు వ్రాయడమా ...

అతని కళ్ళు అక్షరాలపై పరుగెత్తాయి.

మాష్టారు గారికి నమస్సులు,

నేను శేఖర్‌ను. కొన్ని సంవత్సరాలు గడిచాయి కదా! మీరు మరచిపోయి ఉండొచ్చు. మీ జీవిత కాలంలో ఎందరో విద్యార్థులను చూసారు. అందరినీ గుర్తుంచుకోవడం కష్టమే మరి.

ఒకప్పుడు మీ హైస్కూల్లో నేను

విద్యార్థిని. పదవ తరగతిలో మీరు మాక్లాసు టీచరు, పుస్తకంలోని పాఠాలు కంటె మీరు చెప్పే నీతి కథలు, భవిష్యత్తులో పెద్ద పెద్ద అధికారాల్లో ఉంటే ఎలా ప్రవర్తించాలి, దేశ ప్రగతికి మనం ఏ విధంగా తోడ్పడాలి ... మొదలగు విషయాలు నా మనస్సులో ముద్రలు వేసాయి. మీ మాటలే నా భావి జీవితానికి బాటలు వేసాయి. మీరు వెలిగించిన జ్ఞానజ్యోతి నా జీవితానికి వెలుగును ప్రసాదించింది.

మాష్టారూ ... మీకు నేను గుర్తు రావడానికి ఒక సంఘటన చెప్పమంటారా ...

ఆ సంవత్సరం పదవతరగతి పరీక్షలయిన తర్వాత మా క్లాసు విద్యార్థులు ఫేర్‌వెల్ ఫంక్షను ఏర్పాటు చేసారు. ఆ పార్టీకి మీరు అధ్యక్షులు. ఫంక్షను చివరి అంశంగా "భవిష్యత్తులో మీరు ఏంచెయ్యదలచుకున్నారు" అని అందరినీ అడిగారు. కొందరు డాక్టర్లవుతామని, కొందరు లా చదువుతామని చెప్పారు.

"నేను కలెక్టరునవుతాను .. దేశ ప్రగతికి కృషి చేస్తాను" అని నేను చెప్పినప్పుడు మీరు నా భుజం తట్టి, "శేఖర్... నీ ఆశయ సిద్ధి కోసం నువ్వెంతో కృషి చెయ్యాలి. బాగా చదవాలి" అని మీరెన్నో సలహాలిచ్చారు.

ఇప్పుడు గుర్తుకొచ్చానా మాష్టారూ.

మీ ప్రోత్సాహ బలమే నన్ను కలెక్టరును చేసింది.

మీరు మా ఊరొచ్చినప్పుడు నా దగ్గరకు రావలయును.

మీరు తప్పకుండా వస్తారని, నా ఆతిథ్యం స్వీకరిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు,
మీ శిష్యుడు శేఖర్.

# నీవు నేర్పిన విద్యయే ...

లెటరు చదివిన నీలకంఠానికి కళ్ళు చెమ్మగిల్లాయి.

విద్యార్థులు వారి స్కూలు జీవితం ముగియగానే ఎవరి గమ్యాలను వారు చేరుకోడానికి పరుగులుతీస్తారు, మధ్యలో ఎందరు తారసపడినా మళ్ళీ తర్వాత మరచిపోతారేమో గాని టీచర్లను సాధారణంగా మరచిపోరు. విద్యార్థికి, టీచరుకుమధ్య అంతటి విలువైన బంధ ముంది.

శేఖర్ తననింకా గుర్తుంచుకోవడం, తన ఆశయ సిద్ధిని నెరవేర్చుకుని అదంతా మీ ప్రోత్సాహ బలమేనని గుర్తు చేయడం నీలకంఠానికి ఆనందంగా ఉంది.

ఆలోచించే కొలది నీలకంఠానికి బడిపంతులు జీవితం ఎంతో పవిత్రమైనది, తనకంటూ ఏమీ మిగలకపోయినా తను నేర్పిన విద్య కొందరి జీవితాలను బంగారు బాటలో నడిపిస్తుందనుకున్నాడు.

నీలకంఠం ఆలోచిస్తూనే దాన్తాని కొచ్చాడు.

"నాన్నగారూ ... ఎవరైనా రికమెండ్ చేస్తే ఉద్యోగం రావొచ్చు"

రామం మాటలు గుర్తుకొచ్చాయి.

చేతిలో శేఖర్ ఉత్తరం రెపరెపలాడింది.

తనంటె శేఖర్ కెంతో గౌరవం.

తను వెళ్ళితే ఎంతో సంతోషిస్తాడు.

రామం గురించి చెప్పితే కాదనడు.

నీలకంఠానికి ధైర్యం వచ్చింది.

తృప్తిగ నిట్టూర్చాడు.

* * *

రెండంతస్తుల మేడ ముందు నిలబడి చుట్టూ చూసాడు నీలకంఠం. గేటు దగ్గర "కలెక్టర్ శేఖర్" అన్న నేమ్ బోర్డు చూసి అతని కళ్ళు మెరిసాయి.

కారు హారను శబ్దానికి వెనక్కు తిరిగాడు.

కారు లోపలకు వెళ్ళి పోర్టికోలో ఆగింది.

కారులోంచి దిగిన ఒక యువకుడు అప్రయత్నంగా గేటు దగ్గర నిలబడిన నీలకంఠాన్ని చూసి దగ్గరకు వచ్చాడు.

"మాష్టారూ..."

నీలకంఠంకు రవ్వంత ఆశ్చర్య మేసింది.

నిండు సూటులో శేఖర్ కలెక్టర్ శేఖర్.

నీలకంఠం కలెక్టర్ శేఖర్‌కు నమస్కారం పెట్టడానికి రెండు చేతులెత్తే లోగా శేఖర్ మాష్టారు పాదాలకు నమస్కరించాడు.

నీలకంఠం శేఖర్ భుజం తట్టాడు.

"రండి మాష్టారూ"

లోపలకు తీసుకెళ్ళాడు శేఖర్.

అదొక పెద్ద హాలు. ఆ హాలు ఖరీదైన సోఫాసెటలతో, అందమైన తివాచీలతోఉంది. కిటికీల కున్న రంగు రంగుల కర్టెన్లు, పూల కుండీలు అందంగా అమర్చి ఉన్నాయి.

ఒక సోఫాలో ఇద్దరు పెద్దమనుష్యులు కూర్చుని ఉన్నారు. వారిని చూసి ఎవరన్నట్లు శేఖర్ వైపు చూసాడు.

"మాష్టారూ ... ఈయన మా డాడీ రంగారావుగారు. ఆయన డాడీ స్నేహితులు రాజారావుగారు."

ఇద్దరినీ పరిచయం చేసాడు.

ఇద్దరికీ నమస్కరించి ఒక సోఫాలో కూర్చున్నాడు.

"మాష్టారూ, మీ గురించి అప్పుడప్పుడు మా శేఖర్ చెబుతుంటాడు. ప్రతీ స్కూల్లో మీలాంటి టీచర్లుంటె విద్యార్థులు మంచి భవిష్యత్తులోకొస్తారు."



# టాప్ స్టార్ ఉన్న కప్పు ఏది ?



## చూడండి, ఇక్కడ చిక్కని, కమ్మని టీ ఉన్నది

**చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం**
**రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం**

చిక్కదనపు పరీక్ష...చేసి చూడండి...టాప్‌స్టార్ అన్నిటికన్నా మెరుగు...మరే ఇతర టీకన్నా చిక్కనిది — చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్.

ఎందుకంటే, ప్రత్యేకమైన భారతీయ తేయాకుల తాలాకు ఘాటైన (స్ట్రాంగ్) సమ్మేళనం నుంచి తయారైంది లిప్టన్ టాప్‌స్టార్... సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ కోరుకునే వారి కోసం!

500 గ్రా., 250 గ్రా., 100 గ్రా.లలో దొరుకుతుంది.

# లిప్టన్ టాప్ స్టార్ టీ




LIPTON

**చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్**

LINTAS-LTS. 8-2315 TL

# నీవునేర్పిన విద్యయే ...

రంగారావుగారు అలా అనడంతో నీలకంఠం హృదయం సంతోషంతోపాటు రవ్వంత గర్వంతో తొణికిసలాడింది.

"నేను చేసిందేముందండి. అంతా వాళ్ళ కృషి"

అన్నాడు నవ్వుతూ.

లోపలినుండి ఇరవై రెండేళ్ళ యువతి వాళ్ళ దగ్గరకు వచ్చి "అంకుల్ ... మీరు ఇప్పుడు అర్జంటుగా డైనింగ్ రూంకి రావాలి. మీరు కూడా సిద్ధం కావాలి" అని శేఖర్‌తో



అనబోయి నీలకంఠాన్ని చూసి ఆగింది.

"మాష్టారూ...నా భార్య శైలు"

శైలు నీలకంఠానికి నమస్కరించింది.

"అబ్బాయ్... శైలు ఆర్డరు వేసింది... ఆలస్యం చేసావా అప్పై అలక పోగొట్టడం నీతరం కాదు" అన్నారు రంగారావు నవ్వుతూ.

భోజనాలు చేస్తున్నంతసేపూ శేఖర్ చిన్ననాటి స్కూలు విశేషాలు చెబుతుంటె రంగారావు, రాజారావు నవ్వుతూనే ఉన్నారు.

తనొక కలెక్టరనే గర్వం కొంచెమయిన శేఖర్‌లో కనబడలేదు నీలకంఠానికి.

భోంచేసి రీడింగ్ రూంలో కొచ్చారు నలుగురూనూ.

నీలకంఠం గుండెలో రామం మాటలు కదులుతుంటె శేఖర్‌కు ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాడు.

"మాష్టారూ.. ఏమైనా విశేషాలు చెప్పండి. అన్నట్టు మీ పెద్దబ్బాయి ఏం చేస్తున్నాడు"

శేఖర్ రామం సంగతి ఎత్తగానే ధైర్యం వచ్చింది నీలకంఠానికి, వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టయింది. ఏలాగైనా ఉద్యోగం వచ్చేటట్టు చెయ్యమని చెప్పడానికిదే మంచి సమయమనుకున్నాడు.

'బి. ఏ. పాసయ్యాడు' అని ఆగి రంగారావుగారివైపు చూసాడు.

అంతవరకూ ఏవో కబురు చెప్పుకుంటున్న రంగారావు, రాజారావుగార్లు కబుర్లాపి నీలకంఠంవైపు చూసారు.

"మాష్టారూ... మీతొక చిన్న సహాయం చెయ్యాలి"

రంగారావుగారి మాటలు విచిత్రంగా తోచాయి నీలకంఠానికి.

"నేను సహాయం చెయ్యాలా...జోక్ చేస్తున్నారా..."చిన్నగా అన్నాడు నీలకంఠం.

"కాదు మాష్టారూ మీరీ సమయంలో వచ్చారంటే నన్ను ఒక సమస్యలోంచి రక్షించడానికి వచ్చిన దేవదూతతో సమానం మొన్న ఈమధ్య కలెక్టరాఫీసులో ఎల్.డి.సి. పోస్టుకు ఇంటర్వ్యూ జరిగింది. మా ఫ్రెండు ఓ కేండేట్‌కు రికమెండ్ చేసి నాదగ్గరకొచ్చాడు. నేనున్నాననే కొండంత ఆశతో ఆ కుర్రాడికి మాటిచ్చేసాడు. కలెక్టరు నా కొడుకుకదాయని నేను మా ఫ్రెండుకు మాటిచ్చేసాను. అన్ని అర్హతలున్న వ్యక్తికే ఉద్యోగం రావాలని శేఖరంటున్నాడు. అన్ని అర్హతలున్న వ్యక్తులతే

ఉద్యోగాలు ఇస్తే ఈ రికమెండేషన్ల విలువ ఏమయిపోతుంది చెప్పండి లంచాలు, లక్షలు గడించడం ఎలా సాధ్యం. ససేమిరా ఒప్పుకో నంటున్నాడు శేఖర్. మీ మాటలు మా శేఖర్ వింటాడు. మీరీ విషయంలో శేఖర్‌కు నచ్చ చెప్పారంటె నా పరువు, నా ఫ్రెండు మాట నిలబెట్టినవారవుతారు.''

రంగారావుగారి మాటలకు గుండాగినంత పనయింది.

తనెందుకు వచ్చాడు?

తనకు ఎదురయిన పరిస్థితి ఏమిటి?

ఇలా జరిగిందేమిటి?

''మాష్టారూ... ఏంటాలోచిస్తున్నారు.''

శేఖర్ పిలవడంతో నీలకంఠం కాస్తంత తడబడ్డాడు.

''మాష్టారూ...డాడీ మాటలు విన్నారు కదా...అన్ని అర్హతలున్న కేండేట్‌కు రావలసిన ఉద్యోగం కేవలం రికమెండేషను పేరుతో మెరిట్ లేని కేండేట్‌కు ఇవ్వడం న్యాయమా... అన్నీ తెలిసిన మనమే అవినీతిని, లంచగొండి తనాన్ని అనుసరిస్తే దేశం ఏం బాగుపడు తుంది చెప్పండి. నేనీ విషయంలో ఎవరికి సహాయం చెయ్యలేను. నత్తి విషయంలో ఎవరికీ తలవంచను. డాడీ ఎంత చెప్పినా వినడంలేదు.''

శేఖర్ అలా అనడంతో నీలకంఠం అంత వరకు చెబుదామనుకున్న విషయం గొంతు వరకు వచ్చి ఆగిపోయింది.

అంతా అయోమయంగా ఉంది.

''మాష్టారూ...రికమెండేషన్లు, లంచాలతో కలుషితమవుతున్న సమాజానికి యువ తరం ఎదురు తిరగాలి. అవినీతిని కూకటి వేళ్ళతో పెకలించడానికి యువత సాహసించాలి. ఎంత పెద్ద పదవులలో ఉన్నప్పటికి ఒకప్పుడు మనమూ యువకులమేనని గుర్తించి నేటి యువతరానికి చేయూత నివ్వాలి. కేవలం స్వార్థంతో పదవులు మన చేతిలో ఉన్నాయి కదాయని మన ఇష్టంవచ్చిన వాళ్లకు ఉద్యోగాలు ఇస్తే అధికార దుర్వినియోగం చేసినట్లు కాదా...

ఈ మాటలు ఒకప్పుడు మీరు ఉపదేశించినవే. అప్పుడే కాదు, ఇప్పుడూ గుర్తుంటాయి మాష్టారూ...మీ శిష్యుడిగ నేను మీరుచూపిన బాటలోనే నడుస్తాను గానీ మరో అడ్డుదారి పట్టను.

నేటి యువకులలో అన్ని అర్హతలుండీ ఉద్యోగాలు దొరకక ఎంత బాధపడుతున్నారో, మానసికంగా ఎంతగ దిగజారుతున్నారో చూస్తుంటె హృదయం తరుక్కుపోతుంది. ఎక్కడ చూసినా రికమెండేషన్లు, లంచాలు విలయతాండవం చేస్తున్నాయి. వాటిని రూపుమాపడానికి నిరుద్యోగుల జీవితాలలోని నిరాశా, నిస్పృహలను తొలగించడానికి కృషి చేస్తాను. కేవలం నా ఒక్కడివలనే దేశంలోని అవినీతి, లంచగొండితనం సమసిపోతాయని నేననుకోవడంలేదు. నా అధికార పరిధిలో నాకు సాధ్యమైనంతవరకు చేస్తాను.

చైతన్యవంతమైన సమాజంకోసం ఎదురు చూస్తుంది యువతరం. దాన్ని ధైర్యంతో ముందు తరాలకు ఆదర్శప్రాయమైనదిగా చూపించే నవయువత కోసం వెదుకుతుంది సమాజం. యువతరం కోరే మరో సమాజం రావాలన్నా, సమాజంయొక్క తీరుతెన్నులు సరిగా చూసే నవయువత రావాలన్నా, అవినీతి, లంచగొండితనం ఇంకా ఎన్నో అనేక క్లిష్టసమస్యలకు గురి చేస్తున్న అడ్డుగోడలేవీ ఉండకూడదు.

మాష్టారూ... ఇదీ నా కోరిక.

'శేఖర్ నా విద్యార్థి. నేను అతన్ని ప్రగతి పథంలోకి పయనించమనే చెబుతాను గాని అవినీతికి పాల్పడమని చెప్పను అని మీరే డాడీకి చెప్పండి.''

గంభీరంగా ఉన్నాయి శేఖర్ మాటలు.

నీలకంఠం శేఖర్‌వైపు చూసాడు.

తనయితే మాటలే అన్నాడు గాని ఆ మాటలతో ప్రగతికి క్రొత్తబాటలు వేస్తున్నాడు శేఖర్.

నీలకంఠం దృష్టిలో ఎంతో ఎత్తుకు ఎదిగాడు శేఖర్.

తను అందుకోలేని ఉన్నతాశయ శిఖరాలను చేరుకున్నాడు శేఖర్.

తను లెక్కకట్టలేని ఎన్నోరెట్ల వ్యక్తిత్వపు విలువలను సంతరించుకుని ప్రగతిమార్గ రహదారిలో మున్ముందుకు సాగిపోతున్నాడు శేఖర్.

నీలకంఠం లేచి శేఖర్ భుజం తట్టి ''నిన్ను చూసి ఎంతో గర్వపడుతున్నాను. బాధ్యతముందు... బాంధవ్యాలు తరువాత. నువ్వు చెప్పిందే నిజం. నువ్వు నా విద్యార్థివి... నా విద్యార్థివి.''

అని తను ఏ ఉద్దేశ్యంతో వచ్చాడో దాన్ని అతని గుండెలోనే సమాధి చేసి బయటకు నడిచాడు భారంగా నీలకంఠం.






తెల్లనారినట్టు సూచనగా కాకులు కావు కావు మని అరుస్తున్నాయి, పిచ్చుకలు కిచ కిచ మంటున్నాయి. చల్లటి గాలి కిటికీ లోంచి లోనికి వీస్తున్నాది. కొళాయి దగ్గర నీళ్లకోసం బిందెల చప్పుళ్లు ! బరబరా తోముతున్న శబ్దాలు ! కలగాపులగంగా మాటలు వినబడుతున్నాయి. ముగ్గు అమ్మే మనిషి వీధిలో కేకలు వేస్తూ అమ్మకానికి బయలు దేరింది.

రాత్రి వున్న నిశ్శబ్దత చెల్లాచెదురై పోయింది. పని మనుషులు వీధి గుమ్మాలు కడుగుతున్న చప్పుళ్లు; పాలవాళ్ల కేకలు; పావురొట్టి, ఇడ్లీలు అమ్మేవాళ్ల అరుపులు; యివన్నీ వుదయానికి స్వాగతం పలుకుతున్నట్టున్నాయి.

"పిన్నీ ! పిన్నీ ! సుజాత పిన్నీ !" తలుపు దబ దబా బాదేస్తోంది ఉష.

నిద్రమత్తు యింకా పూర్తిగా వదలని సుజాతకి ఆ పిలుపు కలలో లాగ అనిపించింది !

సీతాపతి కొంచెం యిటూ – అటూ కదిలేడు. సుజాతని మరింత దగ్గరకు లాక్కుని చేతుల్తో, కాళ్లతో చుట్టేసి పడుకున్నాడు. రాత్రంతా నిద్ర లేదు. తెల్ల తెల్లవారుతూండగా పడుకున్నారు యిద్దరూ ! అప్పుడే పడుకున్నట్టు అనిపిస్తున్నాది ! అంతలో తలుపు చప్పుడు !

"పిన్నీ ! పిన్నీ !" మళ్లీ తలుపు బాదిన చప్పుడు ! ఉష కేక ! ప్రతీరోజూ యిదే వరస !

సుజాత విసుక్కుంది.

లేవాలంటే బద్ధకంగా వుంది ఆమెకి !

"అబ్బ ! చూడండి, రాత్రంతా నిద్రలేదు. వళ్లు పచ్చి పుండులా వుంది, ఇప్పటికిప్పుడు లేచిపోయి పన్లు మొదలెట్టమంటే నా కెలా వుంటుంది. చెప్పండి ? నేనూ మనిషినేనా !" సీతాపతి మొహంలో మొహంపెట్టి గోముగా అంది సుజాత.

కళ్లు పూర్తిగా తెరిచాడు సీతాపతి.

"ఏమిటె సుజాతా ? ఎవరా తలుపు చప్పుడు ! ... బాప్‌రే ! ఉష పిలుస్తోందా?! వదిన రమ్మనుంటుంది. లే లే, లేచి తొందరగా చీర కట్టుకో. బాగా తెల్లవారి పోయినట్టుంది. వదినా వాళ్లు ఏమనుకుంటారో ఏమిటో ?..."

తన మాట వినిపించుకోని భర్త మీద కించిత్ కోపం వచ్చింది. అయినా తమాయించుకుంది, లేచి కూర్చుంది. చీర కోసం వెతికింది, కనిపించలేదు.

"నా చీర ఎక్కడ పెట్టేరు ? ... ఇలాగే వెళ్లిపోవాలా అవతలకి?..." రుసరుసలాడుతూ అంది.

చీర లేని సుజాతని చూసేసరికి పిచ్చి కోరిక తలెత్తింది సీతాపతిలో. కొంటెగా నవ్వేడు.

"మీరలా నవ్వితే నేను అవతలకి వెళ్లను అస్సలు. మీరు ఆఫీసుకు కెళ్లిందాకా యిలాగే పడుకుంటాను" అంది బుంగమూతి పెడ్తూ.

"అమ్మో ! అంతమాటనకు సుజా ! అవతల వదిన... మనిద్దరి పరువూ తీసే

స్తుంది! చూడు. ఈ మంచంకీ, గోడకి మధ్యన నీ చీర పడిపోయి వుంటుంది. గబగబా చీర తీసుకుని, సరిగ్గా కట్టుకుని వెళ్లు."

మంచం కింద నలిగిపోయి, వుండలా చుట్టుకుపోయిన చీరని పైకి తీసింది సుజాత

"సారీ సుజా! యింత పొద్దున్న నీకు లేవడం అలవాటు లేదని చెప్పేవు, నిజమే. కాని ఏం చెయ్యడం చెప్పు? అది పుట్టిల్లు! ఇది అత్తవారిల్లు! ఇక్కడ కొంచెం నీ అలవాట్లు మార్చుకోవాలి. నలుగుర్నోనూ సర్దుకుపోవడం నేర్చుకోవాలి. పెద్ద వదిన, చిన్న వదిన పని దొంగలు. నాకు తెల్సు.ఎంతో పెద్ద పని వున్నట్టు హడావుడిగా అటూ — ఇటూ పదిసార్లు తిరుగుతూంటారు. కాని ఆఫీసు వేళకి ఏ నాడూ వంట వండి పెట్ట లేదు. నువ్వు వచ్చేవు, నిన్ను మెల్లగా వంటలోకి తొయ్యాలని వాళ్ల తాపత్రయం. వాళ్ల స్వార్థం వాళ్లు చూసుకుంటున్నారు. కాని మన సంగతి వాళ్లు అర్థం చేసుకోరు. నువ్వు వెళ్లు మరొక్క అరగంట నాకు వదిలీ. నేను వచ్చి నీకు సాయం చేస్తాను. మరేం చెయ్యమంటావు చెప్పు అంతకంటే? ..." జాలిగా అర్థిస్తున్నట్టున్న అతని మాటల్ని వినేసరిక్కి కరిగిపోయింది సుజాత.

మెల్లగా గడియ తీసి యివతలకి వచ్చింది.

అందరి కళ్లూ తన మీదే వున్నట్టు, అందరూ తనని కోర్టులో ముద్దాయిని చూసినట్టు చూస్తున్నారేమో ననిపించి గిల్టీగా ఫీలవసాగింది సుజాత. అయినా పైకి ఏ భావం కనబడనీయకుండా తన పన్లు తను చేసుకోసాగింది.

"ఏవమ్మా సుజాతా! ఇంత బేగిరం లేచి పోయేవు? ఇంకో గంట పడుకోలేకపోయేవూ? మాకేం పోయింది! నీకే నష్టం! మీ ఆయనకి ఆఫీసు వేళకి వంట అవకపోతే కస్సు బుస్సులాడతాడు!" నవ్వుతూనే అన్నా, విశాలాక్షి మాటల్లోని వ్యంగ్యం గ్రహించేసరికి దుఃఖంతో గొంతు పూడుకుపోయింది.

తనెప్పుడూ యింతే. ఎవరైనా పల్లెత్తు మాట అంటే చాలు ఆదేమిటో దుఃఖం ముంచుకొచ్చేస్తుంది!

అన్నయ్య ఎప్పుడూ అంటాడు అందుకే "దానికి నెత్తిమీద నీళ్ల కుండ వుంది. అందుకే అనుకున్నప్పుడల్లా కళ్లంట నీళ్లు వచ్చేస్తుంటాయి" అని!

కొత్తగా పెళ్లయిన తను, చీటికి మాటికి కళ్లనీళ్లు పెట్టుకుంటే "ఏమిటీ ఏడుపు మొహం?" అని ఎవరైనా విసుక్కుంటారేమోనని భయంతో దుఃఖాన్ని దిగమింగి తోటి కోడలి మాటలకి ఏమీ జవాబివ్వకుండా వూరుకుంది.

పొయ్యి మండడం లేదు. వర్షా కాలం. కర్రలన్నీ తడిసి పోయేయి. కర్రల పొయ్యిమీద వంట!

అసలు సుజాతకి కర్రల పొయ్యి ఎలా మంట పెడ్తారో కూడా తెలీదు. అంత మంది వున్న యింట్లో గ్యాసు పట్టుమని పదిహేను రోజులైనా రాదు. అందులోనూ రోజు రోజుకీ గ్యాసు ధర పెరిగిపోతున్నాది. అందుకే కర్రలపొయ్యి పెట్టింది విశాలాక్షి.

## మలేరియాకి టీకాలు!

మలేరియా జ్వరాన్ని నిరోధించగల టీకా మందును జర్మను శాస్త్రవేత్తలు కనుగొన్నారు. మలేరియా వల్ల ఒక్క ఆఫ్రికాలోనే యేటా పదిలక్షల మంది చనిపోతున్నారు. మలేరియాకు టీకా మందుగా ఉపయోగపడగల "మెరి జోయిట్స్" ను పశ్చిమ జర్మనీ, అమెరికా శాస్త్రవేత్తలు రూపొందించారు. అయితే లక్షలాది మందికి టీకా మందును తయారుచేయడం ప్రస్తుతం సాధ్యం కాదు. జెనిటిక్ ఇంజనీరింగ్ సహాయంతో యాంటీజన్ల తయారీకి శాస్త్రజ్ఞులు కృషి చేస్తున్నారు.

ఏ కూరకి ఏ పోపు వెయ్యాలో, పులుసులు, సాంబార్లు అవీ ఎలా చెయ్యాలో కూడా తెలీని సుజాతకి కర్రల పొయ్యి మీద వంట అనగానే రోజూ పొద్దున్న నిద్ర లేచేసరికి గుండె గుభేలుమంటూ వుంటుంది.

విశాలాక్షి వీధిలో కొచ్చిన కూరలు బేరం చెయ్యడానికి వెళ్లింది. ఆవిడ వెళ్లిందీ అంటే అరగంట దాకా రాదు. కూరలు ఎంచి, తూచి కొనటం, కూరలవాళ్లతో అనవసర బాతాఖానీ యివన్నీ అయ్యేసరికి, యివతల సుజాత కాకుండా మరెవ్వరైనా వంట సరిగ్గా వచ్చిన వాళ్లకైతే సగం వంటయి పోతుంది!

సుజాత కళ్లు మండి పోతున్నాయి పొగకి. మనసు మరింత మండిపోతున్నాది.

కాని కర్రలు మాత్రం మండడం లేదు.

సీతాపతి కర్రల పొయ్యి ముట్టించడంలో ఎక్స్‌పర్ట్. "అతన్ని వెళ్లి లేపితే బాగుణ్ణు" అనుకుంది!

కాని యిప్పుడు తను, గదిలో కెళ్లి అతన్ని లేపిందంటే, అతను వదలరు. అల్లరి పెడతారు. అదీకాక చూచాయగానైనా యింట్లో వాళ్లకి తెల్సిందంటే తిట్లు తనకే!

"అతను మగాడు! పొద్దున్నే నీతోపాటూ లేచిపోవాలని ఎక్కడుంది? ఎంత సేపైనా పడుకుంటాడు!" అని.

అందుకే సుజాత అటు వెళ్లలేదు.

పచ్చడి రుబ్బడానికి పీట వేసుకుని రుబ్బురోలు దగ్గర కూర్చుంది. అర్ధశేరు పప్పు!

రెండు పూటలకి సరిపడాలి మరి!

ఎప్పటికి నలుగుతుంది?

ఎంత తొందరగా రుబ్బుదామన్నా రోలు అరిగిపోయి వుంది. నలిగేసరికి ఖచ్చితంగా అరగంట పైనే పడ్తుంది!

సుజాతకి తీరని దుఃఖంగా వుంది.

రుబ్బుతూ ఆలోచిస్తోంది—

నిజంగా తనెప్పుడూ యిలాంటి పన్లు చెయ్యలేదు. అమ్మ ఏనాడూ తనని వంట పక్కకే రానిచ్చేది కాదు. ఎప్పుడైనా సాయం చేద్దామని వెళ్లినా, "పెళ్లయ్యాక ఎలాగూ తప్పదు. ఇప్పుడైనా హాయిగా చదువుకుని మంచి మార్కులు తెచ్చుకోవే" అనేది! తీరా పెళ్లిచూపు లప్పుడు, "మా అమ్మాయికి వంట పన్లు అన్నీ వచ్చు" అని చెప్పింది గొప్పగా! పన్లు రావంటే ఇక్కడ చేసుకోవంటారో భయం! అప్పుడప్పుడు అమ్మ వంట చెయ్యడం అదీ చూసి జ్ఞాపకం పెట్టుకుని, మిగతావి వూహించుకుని ఎలాగో తంటాలు పడ్తున్నాది.

ఇంతమంది వున్నారు. ఎవ్వరూ వంటకి సాయంకైనా రారేమిటి? ఈ యింట్లో ఆడవాళ్లకన్నా మగవాళ్లే నయం. మరిదివచ్చి కూర కలిపి వెళ్లేడు. పొయ్యి విసిరేడు. ఏమైనా అందామన్నా యింకా స్నానం చెయ్యలేదని సాకు చెప్తారు. ఎప్పటికీ స్నానం చెయ్యరు. స్నానం చెయ్యడానిక్కూడా తీరుబాటు లేనన్ని పన్లు వున్నా యంటారు మళ్లీ!

ఏదీ గట్టిగా అడిగే స్వభావం కాదు సుజాతది.

అంటే పడ్డమేగాని తిరిగి అనడం తెలీదు ఆమెకి.

"వాళ్లూ ఆడవాళ్లే! అయినా అనే అధికారం వాళ్లకుంది, కాని అర్థం చేసుకునే హృదయం మాత్రం లేదు" వాపోయింది సుజాత. కళ్లంట నీళ్లు వచ్చేస్తూంటే అతి కష్టం మీద ఆ పుకుంటూ పచ్చడి రుబ్బుతోంది.

"సుజా! కాఫీ!" అంటూ వంటింట్లోకి వచ్చేడు సీతాపతి.

దగ్గరగా వచ్చి సుజాత పక్కనే కూర్చుని ఆమె ముఖంలోకి చూసి గతుక్కుమన్నాడు.

"అరే! ఏడుస్తున్నావా? ఏమైంది?" అడిగేడు ఆదుర్దాగా.

"లేదండీ. పచ్చడి కంట్లో తుళ్లింది. కళ్లు మండుతున్నాయి" అందంగా అబద్ధం ఆడింది.

"సారీ డియర్! ఏమనుకోకు. నీకు సాయం చేస్తానని చెప్పేను కదూ. నిద్ర పట్టేసింది. పోనీ యిప్పుడు చెప్పు ఏం చెయ్యాలో. కాఫీ వెచ్చపెట్టుకు తాగెయ్యనా? వదినలిద్దరూ ఏరీ? ఎవ్వరూ యిక్కడ లేరేం...?" కాఫీ వెచ్చబెట్టుకుంటూ అడిగేడు సీతాపతి.

ఏం చెప్తుంది సుజాత?!

మాట్లాడకుండా వూరుకుంది. "భర్త అయినా తనని ఆ మాత్రం అర్థం చేసుకుంటున్నారు. అంతే చాలు" అనుకుని నిట్టూర్చింది.

విశాలాక్షికి తొమ్మిది మంది పిల్లలు. ఆఖరి పిల్ల రెండేళ్లది! రెండో ఆవిడ, సరస్వతికి, ఐదుగురు పిల్లలు!

## కా వ్వా

తొమ్మిదింటికి తీరుబాటుగా స్నానాలు చేసుకుని, వంటింట్లో కొచ్చేరు యిద్దరూ!

అమర్చిన దాంట్లో అత్తగారు వేలు పెట్టినట్టు ఒకరు మజ్జిగ రుద్ది వెన్నతీస్తే, మరొకరు పీటలు—కంచాలు వేసేరు.

వడ్డించడం పని సుజాతదే.

పిల్లలకి అన్నాలు తినిపించే మిషతో పిల్లల పక్కనే కూర్చున్నారు యిద్దరూ.

సీతాపతి భోంచేసి గదిలోకి వెళ్లిపోయేడు.

సుజాత మనస్సు కొట్టుకుపోతోంది!

వెంటనే గదిలోకి వెళ్లిపోయి అతని గుండెల్లో తల దాచుకుని వెక్కి వెక్కి ఏడ్వాలనుంది!

భర్త ఆఫీసు కెళ్తున్నప్పుడు భార్య వీధిలో కొచ్చి, కళ్లతోనే ఏవేవో తీయగా మాట్లాడి, సంతోషంగా సాగనంపుతుందని వింది.

సీతాపతి ఆఫీసు కెళ్లే టైం అయింది.

సుజాతకి అతనిక్కావల్సినవి అందించాలని వుంది. అతను చేసే చిలిపి చేష్టలకి పరవశించి పోవాలనుంది! కాని ధైర్యం చెయ్యలేక పోతోంది. సగం వడ్డిస్తూ మధ్యలో వెళ్ళి పోతే ఏం బాగుంటుంది?...

బీరువాలోంచి బట్టలు తీస్తున్న సీతాపతి భార్య గురించే ఆలోచిస్తున్నాడు.

అతనికీ సుజాతని పిలవాలని వుంది! తన సుజాతతో గంటల తరబడి కబుర్లు చెప్పాలనీ, ఆమెను దగ్గరగా ... యింకా దగ్గరగా ... హృదయానికి హత్తుకుని ముద్దులతో ముంచెత్తాలనీ, ఆమె శరీరం లోని ప్రతీ అణువునూ స్పృశించి, పరవశించి పోవాలనీ వుంది! కాని అది సాధ్యమయ్యే పని కాదు. అతనికి సిగ్గూ, భయమూ రెండూ ఎక్కువే!

పైగా పెద్ద వదినగారు నోటి దురుసు మనిషి!

"హవ్వ! ఇన్నాళ్లకి ఈ మగాడొక్కడే పెళ్లిచేసుకుని పెళ్లాన్ని తెచ్చుకున్నాడమ్మా!" అంటూ బుగ్గలు నొక్కుకుంటూ అందరితో చెప్తుందేమోనని అనుమానం!

అతనిలోని భావోద్వేగాన్ని పైకి కనబడ నీయకుండా మామూలుగా జోళ్లు వేసుకుని వంటింటి గుమ్మం దగ్గరకు నడిచేడు.

"సుజా! నేను ఆఫీసుకి వెళ్తున్నాను" అని చెప్పి వెళ్లిపోయేడు.

సుజాతకి ప్రాణం ఆగిపోయినట్టని పించింది. "తన బతుకు యింతేనా!" అనుకుంది ఆ క్షణంలో.

*　　*　　*

సాయంత్రం అయిదయింది. అప్పుడే పడుకుని లేచింది సుజాత. పెరట్లో కెళ్లి రెండుసార్లు సబ్బు రుద్ది ముఖం బాగా కడుక్కుంది. మెడా, కంఠం, చెవులు, అంతటా పఫ్‌తో పౌడరు దట్టంగా అద్దింది. ఎర్రటి సింగార్ గుండ్రంగా రెండు కనుబొమల మధ్యన పెట్టింది. తలంటుకున్న జుత్తు వదులుగా అల్లి జడ వేసింది. బీరువాలోంచి తెల్లటి జాకట్టు, చిన్న చిన్న నీలం పువ్వులున్న తెల్లటి పాలియస్టర్ చీర తీసింది. కుచ్చిళ్లు అన్నీ ఒకేలైనులో వచ్చేటట్టు, అందంగా కనబడేటట్టు కష్టపడి కట్టింది చీరెని!

"...భర్త ఆఫీసు నుంచి వచ్చే టైంకి తను చిరునవ్వుతో ఎదురువ్వాలి! అతను తనను చూసి అమాంతం ఎత్తుకున్నంత పని చెయ్యాలి! అతను షర్టు, బనియను కూడా విప్పేక, అతని గుండెలమీద వాలిపోయి గుసగుస లాడుకోవాలి. పెదవుల కందని భావాలు, కళ్లతోనే తెలపాలి! తన్మయత్వంలో మునిగి పోవాలి!..."

తీయని ఊహల్లో తేలిపోతూ పరుపు మీదున్న బెడ్‌షీట్ శుభ్రంగా దులిపి నీట్‌గా సర్దింది. గలీబులమీద "స్వీట్ డ్రీమ్స్" అని అందంగా ఎంబ్రాయిడరీ చేసిన వైపు పైకి కనబడేటట్టు తలగడాలని సరిచేసింది.

"పిన్నీ! అమ్మ పిలుస్తున్నాది" అంటూ తలుపు తోసుకుని వచ్చింది పన్నెండేళ్ల అరుణ.

నవనాడులూ కృంగిపోయేయి సుజాతకి.



# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంవిందే గట్టి పళ్ళు

# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోమకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోము కోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

***నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!***



## గ మ ని క

పాఠకులు పద్య వంటలే పడితే "ఎప్పుడూ అవే" వంటలా? అంటారు. కనుక 'వంటలు' పంపే వారు ఓసారి పాత సంచికలు తిరగేసి అందులో లేనివి వ్రాసి పంపమని—సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాయమని మనవి.

సం.







## కామా

కాళ్లకింద భూమి కదిలిపోయినట్టయింది. అరుణ వెనకాలే వెళ్లింది చేసేది లేక.

"రా. రా. ఈ దొండకాయలు కొంచెం తరిగిపెట్టు. మూడు వందల దొండ కాయలు! ఒక్కర్తినీ ఎంతకని తరగను? అందుకే నిన్ను పిల్చేను." విశాలాక్షి మరో కత్తిపీటని అందించింది సుజాతకి.

ఆవిడ తరిగిన వెన్నో లేవు. అప్పుడే వచ్చినట్టు తెలుస్తూనే వుంది.

"నేనిప్పుడు తరగను. తర్వాతొచ్చి తరుగుతాను. అందాకా అవి అలా వుంచండి." అని అనాలనుకుంది.

కాని అనలేదు.

అసలు ఆవిడను చూస్తేనే ఎందుకో గుండె దడదడలాడుతుంది.

"నడిచిన ఎద్దునే పొడవమన్నట్టు తను మారు మాట్లాడకుండా అన్ని పన్లూ చేస్తూంటే తనకే మరీ చెప్తుందీయావిడ! తను పన్లు ఎగ్గొట్టేరకం కాదు. కాని దేనికైనా సమయం సందర్భం అన్నది వుంది. అతను ఆఫీసుకు వెళ్లేటప్పుడు, ఆఫీసు నుంచి వచ్చేటైంలో కాస్తంత భర్తతో ఏకాంతం కోరుకోవడం తప్పా?! ఏమైనా అందామన్నా 'మంచి'గా అర్థం చేసుకోదు ఆవిడ" అనుకుంది సుజాత.

మాట్లాడకుండా తరగడానికూర్చుంది. మనసులో తోటి కోడలు మీద పీకలదాకా కోపం వుంది. మింగలేక, కక్కలేక అవస్థ పడిపోతున్నాది.

విశాలాక్షి రెండేళ్ల కూతురు అక్కడ జాగా అంతా పాడుచేసింది. మరో పిల్ల వచ్చి ఏదో కొనిపెట్టమని పేచీ పెట్టడం మొదలు పెట్టింది. వాళ్లిద్దర్నీ తీసుకుని విశాలాక్షి అవతలకి వెళ్లిపోయింది.

అంతే! సుజాత ఒక్కర్తీ కూర్చుని దొండకాయలన్నీ తరగడం పూర్తి చేసింది. కాని ఆమె రాలేదు!

ఒళ్లు మండిపోయింది సుజాతకి.

ఆమె మనసు, శరీరం, రెండూ తొందర పడుతున్నాయి సీతాపతి కోసం. ఎంత వేగిరం గదిలోకి వెళ్లిపోదామా అని వుంది.

వెళ్లిపోదామని లేవబోతూంటే విశాలాక్షి వచ్చేసింది చంకలో పిల్లతో.

"సుజాతా! ఆ బియ్యం, రాళ్లు అవీ ఏరేసి, కడిగేసి, పొయ్యిమీద పెట్టే. ఆలస్యమయితే పిల్లలు ఆకలికి వుండలేరు. ఏడుస్తారు" ఆజ్ఞాపించింది!

ఆవిడ ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ! తిరుగులేదు.

కళ్లంట నీళ్లు వచ్చేస్తున్నాయి సుజాతకి. ఆపుకుందికి విశ్వ ప్రయత్నం చేస్తున్నాది. బియ్యంలో రాళ్లు ఏరింది; కడిగింది. పొయ్యి ముట్టిస్తూంటే సీతాపతి వచ్చేడు నేరుగా వంటింట్లోకి.

తను ఎన్ని అనుకుంది? ఎన్నివూహించింది? ఛీ! ఛీ! అడుగడుగునా అపశృతులే.

"సుజాతా! మీ అమ్మావాళ్ల దగ్గర్నుంచి వుత్తరం వచ్చింది." వస్తూనే అందించేడు సీతాపతి, భార్య చేతికి.

ఉత్తరాన్ని గబగబా రెండు మూడు సార్లు చదివేసింది—

"మా అమ్మకి నన్ను చూడాలని వుందిటండీ. ఓసారి వెళ్దామా?" అడిగింది సుజాత, రాత్రి గదిలోకొచ్చేక, భర్తకిదగ్గరగా కూర్చుని అతని జుత్తులోకి వేళ్లు పోనిస్తూ.

"అలాగే సుజా! తప్పకుండా. రేపు ఉలవు చీటీ ఎవరిచేతనైనా పంపించేస్తాను. పొద్దుట బస్సులోనేవెళ్దాం. సరేనా!" అన్నాడు ఆమెను మీదకు లాక్కుంటూ.

"మరి మీ వదినగారికి ఏమని చెప్తారు?" సందేహంగా అడిగింది.

"మీ అమ్మకి వంట్లో ఏమీ బాగాలేదు, అందుకే రమ్మని వ్రాసేరని చెప్తాను. ఓ...కే..."

ఆమెకి మహా సంతోషంగా వుంది. పుట్టింటి కెళ్తే ఏ పని చెయ్యక్కర్లేదు. కొత్త సినిమాలన్నీ చూడొచ్చు. ఇక్కడైతే సినిమాకి వెళ్తారని తెలిస్తే చాలు పిల్లలందర్నీ తమ వెంట పంపించేస్తుంది తోటి కోడలు!

అక్కడైతే తామిద్దరే. ఎవ్వరూ వెంట పడరు వస్తామని. అన్నా అమ్మ ఒప్పుకోదు. "వాళ్లిద్దరూ సరదాగా వెళ్తూంటే మధ్యలో మీరెందుకు?" అంటుంది!

ఈ పన్లు... పన్లు... హడావుడి... పొయ్యి... కర్రలు... వంట... వడ్డన... వాటినుంచి తాత్కాలికంగానైనా తనకి విశ్రాంతి లభిస్తుంది!

కాని యీ విశ్రాంతి 'కామా' లాంటిది!

"ఫుల్‌స్టాప్ అన్నది దీనికి లేదు" అని సుజాతకి తెల్సు.



## అచూకీ తెలియకుండా పోయిన ఆడిటర్ !

ధన్‌బాద్‌కు చెందిన భారత్‌కోకింగ్ కోల్‌లిమిటెడ్ కంపెనీ ఆదాయ వ్యయ వివరాలను తనిఖీ చేయడానికి కలకత్తాలోని జి.పి. అగర్వాల్ అండ్ కంపెనీ తన ఉద్యోగస్తులను ఎప్పటిలా ఈసారీ పంపిందట. 29 ఏళ్ల సాస్వత్‌సుందర్‌దాస్ అనే ఉద్యోగి తన విధి నిర్వహణలో ఆ కంపెనీఅధికారులను సవాలక్ష ప్రశ్నలువేసి, వేధింపనారంభించాడట. డబ్బు తనిఖీ చేయాలి ఇనప్పెట్టె తెరవండని అక్కడి క్యాషియర్నడిగితే మరో తాళంచెవి ఏరియా ఫైనాన్స్ మేనేజర్ వై. వి. సింగ్‌వద్ద ఉందనీ, ఆయన కలకత్తా వెళ్లాడనీ, అన్నారట. తర్జన భర్జనలై, ఆ మర్నాడు డబ్బు లెక్కెట్టుకోమంటే అది ఎంచక్కా సరిపోయిందట, ఏప్రిల్ 27వ తేదీ తాజా హోటల్లో కూర్చుని, దాసు అతని తోటి అధికారులు ఈ విషయం కలకత్తాలోని అగర్వాల్ కంపెనీకి తెలియజేయాలనుకున్నారట. ఆ రోజు రాత్రి అంతా కలసి భోజనానికి వెళ్లడానికి తయారయ్యారట. ఉన్నట్టుండి దాసు కనబడలేదట. రాత్రి 1,15 కు రైలుపట్టాల మీద ఒక మానవ హస్తాన్ని లైన్‌మన్ చూసి ఎగిరి గంతేశాడట. పట్టాలకవతలపక్క మరో చెయ్యి, కొంతదూరంలో మొండెమూ, మరి కొంత దూరంలో పొదలో తలా ఉన్నాయట. ఎ ఎస్.ఐ. వచ్చి చూసి, ఎవరో రైల్లోనుంచి జారి పడి, మరణించి ఉంటారని నిర్ణయించి, అక్కడి రైలుకట్ట పక్కన గొయ్యి తీసి, ఆ ముక్కలవన్నీ అందులో పడేసి, గొయ్యి పూడ్చేశారట. పోలీసు (ఎ.ఎస్.ఐ) అసిస్టెంట్ సబ్ ఇన్‌స్పెక్టరు సామాన్యంగా జరపాల్సిన దర్యాప్తుగానీ, రివాజుగా జరపాల్సిన పోస్ట్‌మార్టమ్‌గానీ జరుపలేదట. పైగా, ఆశ్చర్యకరంగా, ఆసక్తికరంగా అర్జంటుగా శవాన్ని అక్కడికక్కడే ఎందుకు పాతి పెట్టెయ్యాల్సొచ్చిందో తెలియలేదు.

భారత్ కోకింగ్ కోల్ లిమిటెడ్ సంస్థ భారత దేశపు పెద్ద పబ్లిక్ సంస్థలలో ఒకటిట. దీని ఏటి వ్యాపారం 370 కోట్లట. 80 కాలరీలతో కలిపి మొత్తం నూరు యూనిట్లు ఉండి అది చూడ్డానికో సామ్రాజ్యంలా ఉంటుందట ఇది జరియా—రాణిగంజి ప్రాంతాలను ఆక్రమించి ఉన్నదట. ఇంతకూ దాసు మరణం స్వాభావికమా, విపరీతమా అన్న విషయం తేలాల్సి ఉన్నది.




### నిదలో నిలువుదోపిడీ !

టెంకాశి అనే వూరుకు చెందిన ఇలంగి అనే వూరులో షణ్ముగ సుందరం అనే అతనూ, అతని భార్యా ఆరుబయట నిద్రపోతుంటే ఆమెకు ఏదో అలజడి అయినట్టయి, లేచి చూసేసరికి వో ఇద్దరు వ్యక్తులామె మంచం పక్కన నేల మీద కూర్చునివున్నారట. వారిని చూసి, ఒళ్లు జల్లుమని, చల్లారి పోయి, శక్తి కూడ దీసుక్కేచుమనరిచే సరికి షణ్ముగ సుందరం లేవడం, వారు పారిపోడం జరిగాయట. చూసుకుంటే మాంగల్యంతో సహా ఆమె వంటినున్న నగలన్నీ వారు ఒలుచుకుని చక్కాపోయారట. మొత్తం పది కాసుల బంగారమట. బంగారం కాసెంతుంది ఆచార్లు గారూ ? !

## కాన్సర్‌ని నిరోధించే కారెట్ !

కొన్ని రకాల కూరలు, పళ్ళు తినే వారిలో ఊపిరితిత్తుల కాన్సర్ వచ్చే అవకాశాలు తక్కువగా ఉంటాయి. 'కెరోటిన్' అనే పదార్థం ఎక్కువగా ఉండే పళ్ళు, కూరగాయలు కాన్సర్‌ని నివారిస్తాయని చికాగో వైద్య బృందం పరిశోధనలు వెల్లడించాయి.

కెరోటిన్‌శరీరంలో విటమిన్ 'ఏ'గా మారుతుంది. ఇది కారట్, పీచ్‌పళ్ళు, స్పినాక్, టొమాటోలలో ఎక్కువగా ఉంటుంది. అంతేకాక ముదురని, పసుపు పచ్చ, ఆకుపచ్చని పండ్లలో, కూరగాయల్లో కూడా ఈ కెరోటిన్ ఉంటుంది.

19 సంవత్సరాలు పరిశోధన ఈ ఫలితాలని వెల్లడించింది. వెస్టన్ ఎలక్ట్రిక్ కంపెనీలో పనిచేసే 2 వేల మంది ఉద్యోగులపై చికాగోలోని రష్ ప్రెస్బిటేరియన్- సెయింట్ లూక్స్ మెడికల్ సెంటర్‌లోని శాస్త్రజ్ఞులు ఈ పరిశోధనలని జరిపారు.

30 సంవత్సరాలుగా పొగ తాగే వారైనా ఈరకం పళ్ళు, కూరగాయలు తినటం ద్వారా కాన్సర్‌ని నివారించుకోగల్గుతున్నట్లు ఈ పరిశోధనలు నిరూపించాయి.

కెరోటిన్ ఎక్కువగా ఉండే ఆహారం తీసుకునే వారిలో కంటే తీసుకోనని వారిలో ఎనిమిది రెట్లు కాన్సర్‌కి గురి అవుతున్నట్లు ఈ పరిశోధనల వల్ల తేలింది.




## కళాభారతి నృత్యోత్సవాలు

నిజామాబాద్ జిల్లా జవహర్‌బాలకేంద్రంలో ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ జిల్లా సాంస్కృతిక వ్యవహారాల మండలి సహకారముతో కళాభారతి జిల్లా నృత్యోత్సవాలను నిర్వహించింది.

జిల్లా కలెక్టర్ శ్రీమతి షీలాభిడే ప్రారంభించిన ఈ నృత్యోత్సవాలు మూడు రోజులపాటు వివిధ నృత్య కార్యక్రమములతో రసజ్ఞులను ఆకట్టుకున్నవి. శ్రీ గులాం సమ్దాని, శ్రీమతి అరుణావ్యాస్, శ్రీ పి. అబ్బన్న ముఖ్య అతిథులుగా, యువ సినీనటుడు శ్రీ ప్రదీప్ ప్రత్యేక ఆహ్వానితులుగా విచ్చేశారు.

జిల్లాస్థాయి నృత్యోత్సవాల ప్రాముఖ్యం గురించి సంస్థ అధ్యక్షుడు శ్రీ ఏ. చంద్రప్రకాష్ ఉపన్యసించారు. శ్రీమతి అరుణావ్యాస్ నృత్యకళ రీతులు వాటిరూప పరిణామమును విపులీకరించారు. కళాభారతి విద్యార్థినుల సిద్ధార్థ నృత్య నాటిక, శ్రీ కోరాడ పర్యవేక్షణలో కుమారి వీణామూర్తి (బెంగుళూరు) భరతనాట్యం, బాలభవన్ విద్యార్థుల బాంగ్రా, లంబాడీల గిరిజన నృత్యం, శ్రీగోపాల్ రాజభట్ బృందం వివిధ జానపదనృత్యాలు, చిందుల యక్షగానం ప్రదర్శించారు.

శ్రీ ఎం. ప్రభాకర్‌రావు నాట్యాచార్యులు శ్రీ టి. భీమన్‌లకు సన్మానం జరిగింది.

శ్రీ ఎం. గంగాధర్, శ్రీ వి. రామమోహన్‌రావ్ వందన సమర్పణ చేశారు. శ్రీ ఏ. సూర్యప్రకాష్ వ్యాఖ్యాతగా వ్యవహరించారు.

## దివ్య ఖుర్ ఆన్

(అనువాదం, సంక్షిప్త వ్యాఖ్యానంతో). మూలానువాదం. శ్రీ మవులానా సయ్యద్ అబుల్ అలా మవుదూది (రహ్మలై)

ఆంధ్రానువాదం. శ్రీ షేక్ హమీదుల్లాషరీఫ్, తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ వారు ప్రచురించిన 816 పేజీలు గల ఈ గ్రంథం వెల 45 రూపాయలు. ప్రతులకు: తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, 22—7—499, పురానాహవేలీ, హైదరాబాద్—500002.

## ఒక దశాబ్ది బహుమతి కథలు

కథల పోటీలలో ఎన్నికై బహుమతి పొందిన వివిధ పత్రికలలో ప్రచురితమైన విశాఖ సాహితి సభ్యులు రాసిన 12 కథల సంకలనం. 196 పేజీలు. వెల 12 రూపాయలు. ప్రతులకు: నవోదయ పబ్లిషర్స్, ఏలూరురోడ్డు, విజయవాడ—2.

## రా గ ర థ ం

లలితగీతాలు. రచన: శ్రీ వడ్డేపల్లి కృష్ణ. 104 పేజీలు. వెల 7 రూపాయలు. ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్డు. సికింద్రాబాదు—500003 లేదా ఆంధ్రసారస్వతపరిషత్, తిలక్ రోడ్డు హైదరాబాదు—500001.

## గౌతమ ప్రభ

సాహిత్య మాస పత్రిక ప్రారంభ సంచిక (జూన్ 1982) 48 పేజీలు వెల రూపాయున్నర. ప్రతులకి, వివరాలకి ఎడిటర్, గౌతమీ ప్రభ మాస పత్రిక, కర్నూలురోడ్డు, గుత్తి, అనంతపురం జిల్లా కి రాయాలి.

## సైన్సు మనస్సు

రచన: డా. జి. సమరం. 64 పేజీలు. వెల 5 రూపాయలు. ప్రతులకు : నాస్తిక కేంద్రం, బెంజి సర్కిల్, విజయవాడ—520006.

## పునర్జన్మ కట్టు కథలు

వ్యాస సంకలనం. 40 పేజీలు, వెల: మూడు రూపాయలు. ప్రతులకు: నాస్తిక కేంద్రం, బెంజి సర్కిల్, విజయవాడ—520006.

## నవగ్రహ స్తుతిః

(సంస్కృతాంధ్ర వ్యాఖ్యాన సహితం) రచన శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యం. 62 పేజీలు, వెల: 6 రూపాయలు, ప్రతులకు : రచయిత పేర శ్రీ భావనారాయణ స్వామి సంస్కృత కళాశాల, పొన్నూరు—522124.

## సైబ పద చిత్రాలు

నిజామాబాద్ ఇందూరి భారతి వారు కవి చిత్రకారుడు శ్రీ సైబ గేయాలని సచిత్రంగా ఈ పుస్తకంలో ప్రచురించారు. 58 పేజీలు వెల 8 రూపాయలు. ప్రతులకు : ఇందూరు భారతి, ఆకృతి ఆర్ట్ స్టుడియో, జవహర్ రోడ్, నిజామాబాద్.

## అన్వేషణ - అనుభూతి

స్వీయ గాథ. రచన: డా. మోపిదేవి కృష్ణస్వామి. 46 పేజీలు, వెల 3 రూపాయలు. ప్రతులకు: పబ్లికేషన్స్ డైరెక్టర్, ది వరల్డ్ టీచర్స్ ట్రస్ట్, రాధామాధవం, 12—38—2, ముప్పిడి కాలనీ, విశాఖపట్నం.

## క దం బ ం

మినీ కథల సంకలనం. సంకలన కర్త శ్రీ బులుసు వెంకట కామేశ్వరరావు. 86 పేజీలు. వెల 5 రూపాయలు. ప్రతులకు గుంటూరు సాహితి, 6/5, ఇం. నెం. 6—6—6, అరండల్‌పేట, గుంటూరు— 522002.

## గో య్యి

నాటిక. రచన: శ్రీ తనికెళ్ళ భరణి. 32 పేజీలు. వెల రూపాయి. ప్రతులకు ధర్మ విజయం, పోస్టు బాక్స్‌నెం. 1654. సికింద్రాబాదు—3.

## వ్యాస విపంచి

వ్యాస సంపుటి. రచన. శ్రీ వట్టిపల్లె సుబ్బారాయుడు. 84 పేజీలు, వెల 8 రూపాయలు, ప్రతులకు: రచన సాహిత్య వేదిక, 2/194, నాగరాజుపేట, కడప—516001



ఇటీవల మదరాసు 'కళాసాగర్' కార్యక్రమాలలో ఆర్టిస్ట్స్ అసోసియేషన్ విజయవాడ వారు ప్రదర్శించిన 'బ్రహ్మ నీరాత తారుమారు'లో శ్రీ ఆర్. రామచంద్రరావు, శ్రీ మాడుగుల రామకృష్ణ, శ్రీమతి వై. రాజకుమారి.

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యవంతమైన గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంది. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

***నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!***




DC.G.74 TL

## గమనిక

పాఠకులు పడ్డ వంటలే పడితే "ఎప్పుడూ అవే" వంటలా? అంటారు. కనుక 'వంటలు' పంపే వారు ఓసారి పాత సంచికలు తిరగేసి అందులో లేనివి వ్రాసి పంపమని—సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాయమని మనవి.

సం.







## కామా

కాళ్లకింద భూమి కదిలిపోయినట్టయింది. అరుణ వెనకాలే వెళ్లింది చేసేది లేక.

"రా. రా. ఈ దొండకాయలు కొంచెం తరిగిపెట్టు. మూడు వందల దొండ కాయలు! ఒక్కర్తినీ ఎంతకని తరగను? అందుకే నిన్ను పిల్చేను." విశాలాక్షి మరో కత్తిపీటని అందించింది సుజాతకి.

ఆవిడ తరిగిన వెన్నో లేవు. అప్పుడే వచ్చినట్టు తెలుస్తూనే వుంది.

"నేనిప్పుడు తరగను. తర్వాతొచ్చి తరుగు తాను. అందాకా అవి అలా వుంచండి." అని అనాలకుంది.

కాని అనలేదు.

అసలు ఆవిడను చూస్తేనే ఎందుకో గుండె దడదడలాడుతుంది.

"నడిచిన ఎద్దునే పొడవమన్నట్టు తను మారు మాట్లాడకుండా అన్ని పన్లూ చేస్తూంటే తనకే మరీ చెప్తుందీయావిడ! తను పన్లు ఎగ్గొట్టేరకం కాదు. కాని దేనికైనా సమయం సందర్భం అన్నది వుంది. అతను ఆఫీసుకు వెళ్లేటప్పుడు, ఆఫీసు నుంచి వచ్చేటైంలో కాస్తంత భర్తతో ఏకాంతం కోరుకోవడం తప్పా?! ఏమైనా అందామన్నా 'మంచి'గా అర్థం చేసుకోదు ఆవిడ" అనుకుంది సుజాత.

మాట్లాడకుండా తరగడానికూర్చుంది. మనసులో తోటి కోడలు మీద పీకలదాకా కోపం వుంది. మింగలేక, కక్కలేక అవస్థ పడి పోతున్నాది.

విశాలాక్షి రెండేళ్ల కూతురు అక్కడ జాగా అంతా పాడుచేసింది. మరో పిల్ల వచ్చి ఏదో కొనిపెట్టమని పేచీ పెట్టడం మొదలు పెట్టింది. వాళ్లిద్దర్నీ తీసుకుని విశాలాక్షి అవతలకి వెళ్లిపోయింది.

అంతే! సుజాత ఒక్కర్తీ కూర్చుని దొండకాయలన్నీ తరగడం పూర్తి చేసింది. కాని ఆమె రాలేదు!

వళ్లు మండిపోయింది సుజాతకి.

ఆమె మనసు, శరీరం, రెండూ తొందర పడుతున్నాయి సీతాపతి కోసం. ఎంత వేగిరం గదిలోకి వెళ్లిపోదామా అని వుంది.

వెళ్లిపోదామని లేవబోతూంటే విశాలాక్షి వచ్చేసింది చంకలో పిల్లతో.

"సుజాతా! ఆ బియ్యం, రాళ్లు అవీ ఏరేసి, కడిగేసి, పొయ్యిమీద పెట్టే. ఆలస్యమయితే పిల్లలు ఆకలికి వుండలేరు. ఏడుస్తారు" ఆజ్ఞాపించింది!

ఆవిడ ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ! తిరుగులేదు.

కళ్లంట నీళ్లు వచ్చేస్తున్నాయి సుజాతకి. ఆపుకుందికి విశ్వ ప్రయత్నం చేస్తున్నాది. బియ్యంలో రాళ్లు ఏరింది; కడిగింది. పొయ్యి ముట్టిస్తూంటే సీతాపతి వచ్చేడు నేరుగా వంటింట్లోకి.

తను ఎన్ని అనుకుంది? ఎన్నివూహించింది? ఛీ! ఛీ! అడుగడుగునా అపశృతులే.

"సుజాతా! మీ అమ్మావాళ్ల దగ్గర్నుంచి వుత్తరం వచ్చింది." వస్తూనే అందించేడు సీతాపతి, భార్య చేతికి.

ఉత్తరాన్ని గబగబా రెండు మూడు సార్లు చదివేసింది—

"మా అమ్మకి నన్ను చూడాలని వుంది టండీ. ఓసారి వెళ్దామా?" అడిగింది సుజాత, రాత్రి గదిలోకొచ్చేక, భర్తకిదగ్గరగా కూర్చుని అతని జుత్తులోకి వేళ్లు పోనిస్తూ.

"అలాగే సుజా! తప్పకుండా. రేపు శలవు చీటీ ఎవరిచేతనైనా పంపించేస్తాను.పొద్దుట బస్సులోనేవెళ్దాం. సరేనా!" అన్నాడు ఆమెను మీదకు లాక్కుంటూ.

"మరి మీ వదినగారికి ఏమని చెప్తారు?" సందేహంగా అడిగింది.

"మీ అమ్మకి వంట్లో ఏమీ బాగాలేదు, అందుకే రమ్మని వ్రాసేరని చెప్తాను. ఓ...కే..."

ఆమెకి మహా సంతోషంగా వుంది. పుట్టింటికెళ్తే ఏ పనీ చెయ్యక్కర్లేదు. కొత్త సినిమాలన్నీ చూడొచ్చు. ఇక్కడైతే సినిమాకి వెళ్తారని తెలిస్తే చాలు పిల్ల లందర్నీ తమ వెంట పంపించేస్తుంది తోటి కోడలు!

అక్కడైతే తామిద్దరే. ఎవ్వరూ వెంట పడరు వస్తామని. అన్నా అమ్మ ఒప్పుకోదు. "వాళ్లిద్దరూ సరదాగా వెళ్తూంటే మధ్యలో మీరెందుకు?" అంటుంది!

ఈ పన్లు... పన్లు... హడావుడి... పొయ్యి... కర్రలు... వంట... వడ్డన... వాటినుంచి తాత్కాలికంగానైనా తనకి విశ్రాంతి లభిస్తుంది!

కాని యీ విశ్రాంతి 'కామా' లాంటిది!

"ఫుల్‌స్టాప్ అన్నది దీనికి లేదు" అని సుజాతకీ తెల్సు.

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

కల్యాణ కవిగోష్ఠి :

మాతృశ్రీ ఇంజనీర్స్ అండ్ బిల్డర్స్ ప్రైవేట్ లిమిటెడ్ చెయిర్మన్, డైరెక్టర్ శ్రీ మాటూరి వెంకటసుబ్బారావు కుమార్తె సౌభాగ్యవతి లక్ష్మీ హనుమాయమ్మకు, శ్రీ చిత్రపు సీతారామయ్య కుమారుడు చిరంజీవి బదరీనారాయణమూర్తికి జూన్ 6 వ తేదీన దోమల్‌గూడాలోని పింగ్లి వెంకటరామారెడ్డి హాల్‌లో వైభవోపేతంగా వివాహం జరిగినప్పుడు ప్రముఖ కవి పండితులు కవితా రూపంలో వధూవరులను ఆశీర్వదించారు. కవి పండిత గోష్ఠికి ఆచార్య డాక్టరు దివాకర్ల వెంకటావధాని అధ్యక్షత వహించారు. ఆస్థాన కవి డాక్టరు దాశరథి, శ్రీయుతులు పోతుకూచి సాంబశివరావు, ఉత్పల సత్యనారాయణాచార్య, డాక్టర్ బి. ఆర్. శాస్త్రి, ఏడిద కామేశ్వరరావు, డాక్టర్ జి వి. సుబ్రహ్మణ్యం, ముదిగొండ శివప్రసాద్, డాక్టర్ కె. రాజన్న శాస్త్రి, జి.వి. ఎస్. శర్మ, కల్లూరి వీరభద్రశాస్త్రి, తిరుమల రామచంద్ర, అయ్యగారి వీరభద్రశాస్త్రి, కల్లూరి సుబ్రహ్మణ్య దీక్షితులు, మాధవరావు, డాక్టర్ రావూరి వెంకట సత్యనారాయణరావు, డాక్టర్ సి. నారాయణ రెడ్డి, శ్రీపాద సోమేశ్వరశాస్త్రి, డాక్టర్ యశోదా రెడ్డి, డాక్టర్ నిర్మలాదేవి, శ్రీమతులు పి. విజయలక్ష్మి, డాక్టర్ వాసాప్రభావతి, శారదా అశోకవర్ధన్, రావూరి సువర్చలాదేవి, నిడుమోలు ప్రసూన, నెల్లూరి జానకీదేవి, అయితరాజు కరుణ, ఏడిద కనకవల్లి, కాశీభట్ల విజయలక్ష్మి, డాక్టర్ సుధారాణి, శ్లోకాలు, పద్యాలు, గేయాలతో వధూవరులను ఆశీర్వదించారు. శ్రీ కంచి కామకోటి పీటాధిపతులు, శ్రీ కుర్తాలం సిద్దేశ్వర పీఠాధిపతులు, విదేశాంగమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు, కేంద్ర పెట్రోలు, రసాయన మంత్రి శ్రీ పి. శివశంకర్, గవర్నర్ డాక్టర్ ఎం. చెన్నారెడ్డి, కొందరు పార్లమెంటు సభ్యులు పోలీస్ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ పి. జగన్మోహన్ మున్నగు అధికారులు ఆశీర్వాదాలు పంపారు. శ్రీ మాటూరి వెంకటసుబ్బారావు కవి పండితులను, కవయిత్రులను అర్ధనూలు వస్త్రాలతో సత్కరించారు.

## శ్రీశైలంలో ఓషధీ పరిశోధన కేంద్రం :

శ్రీశైలం సహస్రాబ్దాలుగా ఔషధులకుపుట్టినిల్లు, సిద్ధ నాగార్జునుడు, నిత్యనాథసిద్ధుడు, రేవణ సిద్ధుడు మున్నగు ఆయుర్వేద సిద్ధులు శ్రీశైలంలో వుండి గొప్ప ఔషధయోగాలను కని పెట్టడమే కాక, రాత్రిళ్లు పెరిగే లతలను పరసవేదిని కనుగొని బంగారు సృష్టించారని కూడ ప్రాచీనాయుర్వేద గ్రంథాలలో ఉల్లేఖితమయింది, సోమనాథుడు బసవ పురాణ పండితారాధ్య చరిత్రలలో శ్రీశైల వనస్పతులను పెక్కు విధాలుగా వర్ణించాడు. 50 సంవత్సరాలక్రితం మా గురు వర్యులు, ఆయుర్వేదానికి జీవితం అంకితం చేసిన వైద్య రత్న పండిత డి.వి. గోపాలాచార్యులు ప్రప్రథమాంతేవాసులు, తిరుపతి వేంకటేశ్వరాయుర్వేద కళాశాలాధ్యక్షులు అయిన శ్రీ సి.వి. సుబ్రహ్మణ్య శాస్త్రి గారు దేవస్థానం వారితో కపిల తీర్థంలోను శ్రీశైలంలోను ఔషదీ పరిశోధన కేంద్రాలను స్థాపించడానికి యత్నించారు. స్థానిక రాజకీయ నాయకుల పరస్పర స్పర్ధలతో ఆ కేంద్రాలు నెలకొనకపోవడమే కాక, కొండనాలుకకు చికిత్స చేస్తే ఉన్న నాలుక వూడిందన్న సామెతగా ఆయుర్వేద కళాశాలే మూత పడిపోయింది. అర్ధశతాబ్ది క్రింద జరిగిన ఔషదీ పరిశోధన కేంద్ర స్థాపనేచ్ఛ రాష్ట్ర మంత్రివర్యులు శ్రీ తిరుమరంగం హయగ్రీవాచార్యులు కాలంలో మొలకెత్తి ఫలింపనుండడం ఆనంద దాయకంగా ఉంది. శ్రీ హయగ్రీవాచార్యుల జూన్ 9 వ తేదీన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ముచ్చటిస్తూ, రాష్ట్ర భారతీయ వైద్య శాఖ శ్రీశైలంలో ఆయుర్వేద వైద్యానికి పనికి వచ్చే ఔషదీ పరిశోధన కేంద్రాన్ని నెలకొల్పుతుందని, కృష్ణానదీ తీరారణ్యంలో అమూల్యమైన ఔషదీవనాలున్నవని, ఈ ప్రాంతంలో ఐదు వందల అమూల్యమైన మూలికలను వైద్యులు గుర్తించారని అన్నారు. తిరపతిలో తిరుమల తిరపతి దేవస్థానం వారు ఒక ఆయుర్వేద కళాశాలను నిర్వహిస్తారని, దీనికి అంగంగా ఔషదీతనాన్ని పెంచడానికి 120 హెక్టార్ల భూమిని కూడ ఇస్తారని మంత్రి అన్నారు. కేరళ పద్ధతి కాయకల్ప చికిత్సజరిగే ఒక ఆయుర్వేద ఆరోగ్య కేంద్రాన్ని కర్నూలు జిల్లా బనగానె పల్లెలో త్వరలో ప్రారంభించనున్నామని కూడా ఆయన తెలిపారు. భారతీయ వైద్య శాఖ పరిశోధన విభాగం అడిషనల్ డైరెక్టర్ డాక్టర్ ఐ. సంజీవరాయ శర్మ శ్రీశైలం ఔషదీ పరిశోధన కేంద్రం కార్యక్రమం వివరించారు. శ్రీశైలం అడవులలో లభించే ఔషధులు ఏయే వ్యాధులకు ఉపయోగపడుతాయో పరిశోధించడమే కాక శ్రీ శైల ప్రాంతంలోని గిరిజనులు ఔషధులను ఎలా వాడుతున్నారన్న విషయం కూడ ఈ కేంద్రం పరిశోధిస్తుందని డాక్టర్ సంజీవరావు తెలిపారు. 1980 నవంబరులో సంతాన నిరోధానికి ప్రయోగించిన పరికల్పం 57శాతం ఫలితాలు చూపిందని ఔషదీ పరీక్షా ప్రయోగశాల త్వరలో పని చేయడం ప్రారంభమై ఔషధుల ప్రమాణీకరణం జరుగుతుందని ఆయుర్వేదవుషధాలు సిద్ధ పరచడానికి ఒక మూలికా క్షేత్రం, అవుషధ యోగశాల ప్రారంభించబడుతాయని, మహబూబ్ నగర్ జిల్లా అలంపూర్ అతి ప్రాచీనమైన, ఆయుర్వేద శిక్షణప్రయోగ కేంద్రంగా వున్నట్టు ఆధారాలు న్నవని ఆయన



కిన్నెర ఆర్ట్ థియేటర్సువారు హైదరాబాదులో యిటీవల డా॥ కొర్రపాటి గంగాధరరావుని సన్మానించారు. చిత్రంలో డా॥ కొర్రపాటి దంపతులు, రాజారామదాస్, సంస్థ అధ్యక్షులు శ్రీ యం. వి. నారాయణరావు, మెమెంటో అందచేస్తున్న శ్రీ యం. వి. సుబ్బారావు, సంస్థ కార్యదర్శి మద్దాళి రఘురామ్, సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ రామకృష్ణరాజు గార్లని చూడవచ్చు.

అన్నారు. మానవుని శరీర ప్రకృతి పరిశోధనలవల్ల రోగస్వాస్థ్యమూ వ్యాధి నిర్ణయింప బడతాయి. గనుక ఆ పరిశోధనల విషయమై సమాలోచన జరుగు తున్నదని ఆయన అన్నారు.

## వ్యవసాయ కూలీల ప్రదర్శనం :

రాష్ట్ర వ్యవసాయ కార్మిక సంఘం సి.పి.ఎం. నాయకత్వంలో జూన్ 4 వ తేదీన కోటీ నుండి సచివాలయం వరకు గొప్ప ప్రదర్శనం జరిగింది. ప్రదర్శనానంతరం ప్రదర్శన ప్రతినిధులు ఉపముఖ్యమంత్రి శ్రీ జగన్నాథరావును కలుసుకుని వ్యవసాయ కూలీల సమస్యలను వెంటనే పరిష్కరించాలని కోరుతూ ఒక విజ్ఞప్తి అందజేశారు. తర్వాత జరిగిన బహిరంగసభలో పశ్చిమ బెంగాల్ వ్యవసాయ శాఖామంత్రి శ్రీ బినయ్‌కృష్ణ చౌధురి ప్రసంగిస్తూ, పెరిగిపోతున్న ధరలవల్ల వ్యవసాయ కూలీల జీవన పరిస్థితి దిగజారి పోతున్నదని, ధరల పెరుగుదలకు ప్రధాని శ్రీమతి గాంధి విధానాలే కారణమని అన్నారు. పోరాటం లేకుండా ఏమీ సాధించలేమని, కనుక వ్యవసాయ కూలీలు పోరాటాలు కొనసాగించాలని ఆయన ఉద్బోధించారు. రాష్ట్ర సి.పి.ఎం. నాయకుడు శ్రీ మోటూరి హనుమంతరావు తమ ప్రసంగంలో రాష్ట్రంలో శాంతి భద్రతలు క్షీణించడానికి ఇందిరా కాంగ్రెస్ నాయకులే కారణమన్నారు. సభకు రాష్ట్ర వ్యవసాయ కూలీ సంఘం అధ్యక్షుడు శ్రీ గంగాధరరావు అధ్యక్షత వహించారు.

## "విజయం, కలిసికట్టుగా విజయం" :

భారత సైన్య ప్రధానాధికారి జనరల్ కె.వి. కృష్ణారావు జూన్ 4 వ తేదీన సికిందరాబాద్ సమీపంలోని దుండిగల్‌లో వున్న ఎయిర్‌ఫోర్స్ అకాడెమీలో జరిగిన మూడు దళాల అధికారుల

# హైదరాబాద్ నోట్‌బుక్

పట్టభద్రతా విన్యాసంలో (గ్రాజుయేషన్‌పెరేడ్‌లో) సైనిక వందనం తర్వాత పట్టప్రదాన సమయంలో ప్రసంగిస్తూ మన పని యుద్ధాలలో గెలవడం, అదిన్నీ కలిసి కట్టుగా గెలవడం అన్నారు. సైన్యంలో మూడు దళాల మధ్య పరస్పర సమన్వయం యుద్ధ విజయాలకు చాల అవసరమని, ఏకపక్ష దృష్టి హానికరమని ఆయన అన్నారు. రక్షణ సేవలోని మూడు దళాలకు ఒకే ప్రధానాధికారి వుండాలని ఆయన సైనిక వందనం తర్వాత పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో అన్నారు. పాకిస్తాన్ అమెరికా నుంచి అధునాతన ఆయుధాలను చేకూర్చుకుంటున్నదని, అందువల్ల భారతదేశం నిశ్చింతగా వుండడానికి అవకాశం లేదని, ఎలాటి అనాహూతాన్నైనా ఎదుర్కొనడానికి సిద్ధంగా వుండాలని ఆయన హెచ్చరించారు. కాశ్మీర్‌లో షేక్ అబ్దుల్లా ప్రతిపాదించిన పౌరసత్వం బిల్లును జనరల్ కృష్ణారావు ప్రస్తావించి, 35 సంవత్సరాల క్రితం పాకిస్తాన్‌లో స్థిరపడిన కాశ్మీరీలు భారత దేశానికి తిరిగి రావడంవల్ల భారత దేశానికి తీవ్రమైన రక్షణ సమస్యలు ఏర్పడుతాయని అన్నారు. సైనిక వందనం తర్వాత ఆయన పైలట్ శిక్షణలో ఉత్తముడుగా వచ్చిన పైలట్ ఆఫీసర్ రాజేష్‌కుమార్‌కు సవనగర్ పట్టా కత్తిని బహూకరించారు. ఇతరులకు ట్రోఫీలు బహూకరించారు. ఇక్కడ ఈ సంవత్సరం పైలట్ ఆఫీసర్ల శిక్షణ పొందినవారిలో శ్రీలంక, కీన్యా, జాంబియా దేశాల యువకులు వున్నారు.

## దుర్గాబాయి స్మారక తపాలా బిళ్ళ :

ప్రముఖ సంఘసేవకురాలు, స్వాతంత్ర్య యోధురాలు, విద్యావేత్త శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముక్ స్మారకతపాలాబిళ్ళను రాష్ట్రగవర్నరు శ్రీ అబ్రహాం మే 9వ తేదీన జూబిలీ హాలులో విడుదల చేశారు. ఈ విడుదల శ్రీమతి దుర్గాబాయి ప్రథమవర్ధంతి నాడు జరిగింది. శ్రీమతి దుర్గాబాయి ప్రతిఫలం ఆశించని సంఘ సేవకురాలని, ఆమె కేవలం తెలుగువారి ఆడబడుచే కాదని, యావద్భారత భూమి సత్పుత్రి అని, ఆమె చివరి వూపిరివరకు దేశ మహిళల సమస్యలను పరిష్కరించడంలోనే నిమగ్నురాలయి ఉన్నారని గవర్నర్ ప్రశంసించారు. స్మారక తపాలా బిళ్ళ గౌరవం పొందిన తొలి ఆంధ్రప్రదేశ్ మహిళ శ్రీమతి సరోజినీ నాయుడని, రెండవ తెలుగు మహిళ శ్రీమతి దుర్గాబాయి అని గవర్నరు కొనియాడారు. శ్రీమతి దుర్గాబాయి స్మారక తపాలా బిళ్లలున్న అల్బమును గవర్నరు శ్రీ చింతామణి దేశ్‌ముక్‌కు అందజేశారు. గవర్నర్ తంతి తపాలా శాఖను ప్రస్తుతించారు. ఆంధ్ర మహిళాసభ ట్రస్టీ శ్రీమతి సుగుణమణి ప్రసంగిస్తూ, మహిళలు మగవారితో పోటీ పడినంత మాత్రాన ప్రయోజనం లేదని, నిర్వీర్యమై పోతున్న జాతిని జాగరితం చేసే బాధ్యత మహిళలదని అంటూ, దుర్గాబాయిని మహిళలు ఆదర్శంగా తీసుకోవాలని అన్నారు. రాష్ట్ర పోస్ట్ మాస్టర్ జనరల్ శ్రీ పాల్‌రాజన్ ప్రసంగిస్తూ, ప్రస్తుతం తపాలా శాఖ ఏడాదికి సరాసరి 40 ప్రత్యేక తపాలాబిళ్ళలు విడుదల చేస్తున్నదని, పలువురు ఆంధ్రప్రముఖుల స్మారకతపాలాబిళ్లలను విడుదల చేసిందని అన్నారు. శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముక్ ప్రథమ వర్ధంతి సందర్భంగా విద్యానగర్‌లోని ఆంధ్ర మహిళాసభ నర్సింగ్‌హోమ్‌ పేరును దుర్గాబాయి దేశ్‌ముఖ్ ఆస్పత్రి అని మార్చారు.

## ఉపశ్రుతి :

జూన్ 3 న కవి శ్రీ కుందుర్తి ఆంజనేయులు కుమార్తె వివాహంలో కవిపండితులు చాల మంది కలుసుకొన్నారు. మిత్రులు శ్రీ అల్లూరి వరదరాజేశ్వరరావు జోకుల మీద జోకులు కురిపిస్తూ, అందరినీ కడుపు చెక్కలయ్యేట్లు నవ్విస్తున్నారు. ఏమిటి మీ దక్షిణ భారత హిందీ ప్రచార సభ పోస్ట్ గ్రాడ్యుయేట్ పరిశోధన స్తోమం భవన నిర్మాణానికి స్థలం మంజూరయిందట గదా! భవనాలు లేవాయా ? అని అడిగారు ఎవరో ఆస్తోమం (కాంప్లెక్స్) రిజిస్ట్రారు శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ మంజూరేమో అయింది, కాని దురాక్రమణ బెడద వచ్చింది అన్నారు— శ్రీ శర్మ. వైస్ ఛాన్సలర్ చేద్దురూ! ఏ బెడదా ఉండదు – అన్నారు అబ్బూరి వరద. ●



బందరు మహిళా సేవా మండలి వారు ఇటీవల ప్రదర్శించిన 'మరబొమ్మలు' నాటికలో శ్రీమతి రావినూతల సువర్ణాకన్నన్, శ్రీమతి గంపిల రాజ్యం నారాయణరావు, కుమారి టి. లత.

# నా ప్రపంచం వికసించింది
# ...దాన్ని పెంచి పోషిస్తోంది జై కిసాన్



జైకిసాన్ అంటే సమృద్ధి, సంతోషాల దూత. ఉత్తమ పద్ధతిలో తయారైన జైకిసాన్ ఎరువులు అత్యంత పోషణనిచ్చేవి—అవి నీటిలో ఇట్టే కరిగి మొక్కలకు వెంటనే అందుతాయి. ఫలితం—బలమైన వేళ్లు, ఏపుగా పెరిగే మొక్కలు. ఈ రోజే జనప్రియమైన జైకిసాన్ ఎరువులు తెచ్చుకోండి, మీ అదృష్టాన్ని పండించుకోండి. ప్రతి పంటకి, ప్రతి నేలకి అనువైన ఉత్తమ ఎరువులు—జైకిసాన్ ఎరువులు.

**జై కిసాన్ యూరియా 46.4 % నత్రజని**
**జై కిసాన్ యూరంఫాస్ 28.28:0**
**జై కిసాన్ సంపూర్ణ 19:19:19**
**జై కిసాన్ సౌభాగ్య 14:35:14**
**జై కిసాన్ డయంఫాస్ 18 46:0**

**ఉత్తమ పద్ధతిలో ఉపయోగిస్తే ఉత్తమ ఫలితాలు :**
జైకిసాన్ ఎరువులు అద్భుత ఫలితాలు ఇవ్వాలంటే వాటిని తగిన విధంగా ఉపయోగించాలి. అంచేత, ఈ రోజే, మీకు దగ్గరలోని జువారి వారి పసుపు పచ్చని దుకాణానికి వెళ్లండి. ఎరువుల్ని సరిగా ఉపయోగించే పద్ధతి తెలిపే ఉచిత కరపత్రాన్ని పుచ్చుకోండి. ఆ దుకాణంలో మీకు మట్టి పరీక్ష ఫలితాలను అనుసరించి అన్ని పంటలకూ కావలసిన అన్ని రకాల సలహాలూ లభిస్తాయి. ఈ రోజే మీ పంటనీ,మట్టినీ బట్టి మీ ప్రియమైన జైకిసాన్ ఎరువు ఎంచుకోండి, సరైన పద్ధతిలో ఉపయోగించి పుష్కలమైన పంట పండించండి . . . మీ కలలు నిజం చేసే ఎరువులు మీ ప్రియమైన జైకిసాన్ ఎరువులు. అవి దొరికే చోటు—జువారి వారి పసుపుపచ్చ దుకాణం :

## జై కిసాన్ ఎరువులు-అత్యంత శక్తికీ, సత్వర పెరుగుదలకూ

జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.
ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు :
సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగపూర్, పుణే, జువారినగర్.







LINTAS-ZUA. 98-2315 TL.

# వంటలు

## ఉల్లిపాయ బర్ఫీ

కావలసిన వస్తువులు : ఉల్లిపాయలు — 250 గ్రా., చక్కెర — 300 గ్రా., నెయ్యి — ఒకటిన్నర కప్పు, పాలు — అర్ధ లీటరు, జొన్నరవ్వ — 750 గ్రా., కొబ్బరి తురుము — ఒక కప్పు, జీడిపప్పు - 50 గ్రా., ఎండు ద్రాక్ష 25 గ్రా, పచ్చకర్పూరం — కొద్దిగా, రోజ్ కలర్ పొడి — కొద్దిగా, వెనిల్లా ఎసెన్సు – కొన్ని చుక్కలు.

తయారుచేయు విధము : ఉల్లిపాయలకు పైపొర్లు తీసేసి కాడ భాగాన్ని, క్రింది కొన భాగాన్ని తీసేసి రెండుగా తరగాలి. వీటిని ఒక పల్చని గుడ్డలో మూటకట్టాలి. ఒక పాత్రలో నీటిని తీసుకుని పొయ్యిపై పెట్టి కాగాక జొన్నరవ్వ పోసి అందులోకి ఉల్లిపాయల మూటను వేసి కాస్సేపు మగనిచ్చి తర్వాత మూటను తీసేసి ఉల్లిపాయల్ని చల్లారనివ్వాలి. ఇప్పుడు ఉడికించిన ఉల్లిపాయలు, కొబ్బరి తురుము, సగం జీడిపప్పు రోట్లోవేసి బాగా మెత్తగా రుబ్బాలి. ఇప్పుడు మిగిలిన జీడిపప్పు, ఎండు ద్రాక్ష నేతిలో వేయించి వుంచుకోవాలి. తర్వాత రుబ్బిన మిశ్రమాన్ని ఒక పాత్రలో తీసుకుని దానికి నెయ్యి, చక్కెర, పాలు పోసి పొయ్యిపై పెట్టి అడుగంటకుండా సన్నని మంటపై బాగా కలియపెడుతూ వుండాలి. కాస్త గట్టిగా అయ్యాక రంగుపొడిని కొద్దిగా పాలలో కలిపి పోయాలి. పచ్చకర్పూరం కూడ వేసి, కొన్ని చుక్కలు వెనిల్లా ఎసెన్సు వేయాలి ఈ మిశ్రమాన్ని నెయ్యిరాసిన పళ్లెంలోకి వంచేసి, నేతిలో వేయించిన జీడిపప్పు ముక్కలు, ఎండుద్రాక్ష పైన చల్లాలి. చల్లారక ముక్కలు కోసుకోవాలి. ఈ బర్ఫీ చాలా రుచిగా వుంటుంది. ఉల్లిపాయల్ని జొన్నరవ్వలో ఉడికించడంవలన ఉల్లిపాయల వాసన పోతుంది.

## రాగి జ్యూస్

కావలసిన వస్తువులు :— రాగిపిండి పావుకప్పు, బాగా మాగిన అరటిపండ్లు రెండు, పాలు ఒకటిన్నర కప్పు, చక్కెర తగినంత, వెనిల్లా ఎసెన్సు ఒక చుక్క.

తయారుచేయు విధము :— రాగిపిండికి కొద్దిగా పాలు, నీరు చేర్చి పొయ్యిపై పెట్టి గంజివలె కాచి దించాలి. మిక్సీలో పాలు, అరటిపండ్లు వేసి బాగా కలిసేటట్లు చేయాలి. మిక్సీ లేకుంటే ఒక గిన్నెలో వేసి కవ్వంతో బాగా చిలకాలి ఇపుడు అరటిపండ్లు — పాలు మిశ్రమానికి రాగి గంజిని చేర్చి చక్కెర, వెనిల్లా ఎసెన్సు వేసి బాగా కలిపి గ్లాసుల్లో పోసి ఇవ్వాలి. ఇది వేసవి కాలంలో మరీ మంచిది. పిల్లలకూ, పెద్దలకూ పుష్టినిస్తుంది.

## టొమేటో పొడి

కావలసిన వస్తువులు : టొమేటోలు — పావుకిలో, కొబ్బరితురుము — 6 టేబుల్ స్పూన్లు, ఎండు మిరపకాయలు — ఎనిమిది; మినప్పప్పు–ఒక టేబులు స్పూన్లు, శెనగ పప్పు — ఒక టేబులు స్పూను, ఇంగువ — కొద్దిగా, చింతపండు — కొద్దిగా, బెల్లం ముక్క — చిన్నది, నూనె — ఒక టీస్పూను, ఉప్పు — తగినంత.

తయారుచేయు విధము : ఉదయం టొమేటోలని సన్నని ముక్కలుగా తరిగి ఒక పళ్లెంలో పోసి బాగా చేతో నే మెత్తగా నలిపి ఎండపెట్టాలి. తడి బాగా ఎండిపోయాక తీసుకోవాలి బాణలిలో నూనెవేసి ఎండుమిరప కాయలు, ఇంగువ వేసి వేయించి, తర్వాత శెనగపప్పు, మినపప్పు, కొబ్బరి తురుము కూడ వేసి బాగా వేయించి తీసి రోట్లో వేయాలి. దీనికి తగినంత ఉప్పు, చింతపండు, బెల్లం, ఎండబెట్టిన టొమేటో ముద్దకూడ వేసి బాగా మెత్తగా పొడి అయ్యేటట్లు దంచాలి. ఈ పొడిని అన్నంలోకి వేసుకుని నెయ్యి కలుపుకుని తింటే చాలా బావుంటుంది. లేకుంటే పొడికి తగినంత నీరు కలిపి పోపు వేసి చెట్నీ చేసుకున్నా ఇడ్లీ, దోసెలలో నంచుకోవచ్చును.

— గార్లె సరస్వతి

# ఉత్తరాలు

[4వ పేజీ తరువాయి]

### కథలు

"కల్పనా అయ్యర్" ముఖచిత్రం బాగుంది. ఈసారి యిచ్చిన కథలలో "దెయ్యం", "అంతరార్థం" బావున్నాయి.

సుజయశ్రీ (ఆదోని)

* * *

11.6.82 మా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం నచ్చలేదు. ప్రచురించిన కథలు బాగున్నవి. ముఖ్యంగా దెయ్యం కథ చాలా ఆశక్తికరంగా ఉన్నది.

వై. చంద్రశేఖరరెడ్డి, జయశ్రీ (తిరుపతి)

* * *

1 6 82 తేదీన వెలువడిన మా (మీ) ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాగానే వుంది. ఈ వారం కథలన్నీ మా ఇంటిల్లిపాదిని ఆకర్షించినవి. ముఖ్యముగా అంతరార్థం కథ చాలా బాగుంది.

బాలిరెడ్డి శేషు (సెట్టిపల్లివానిపల్లె)

11.6.82 నాటి పత్రిక ముఖచిత్రం కల్పనా అయ్యర్ అందంగా వుంది. బుద్ధరాజు సన్యాసి రాజుగారి సంఘం గెలిచింది మనిషి ఓడిపోయాడు కథ నేటి సమాజ స్థితికి చక్కని నిదర్శనం. ఎందుకీ పలాయనం కథ కూడా నచ్చింది.

కె. సాంబశివరావు, కలిమిశ్రీ (గుంటూరు)

* *

11.6.82 సంచిక ముఖచిత్రం నటి కల్పనా అయ్యర్ మోడ్రన్‌గా వుంది. ఈ వారం పత్రికలో సంఘం గెలిచింది, మనిషి ఓడిపోయాడు కథ హైలైట్, బుద్ధరాజు సన్యాసిరాజుగారు చాలా బాగా వ్రాశారు.

పి. ఉమామోహన్ (కాశీబుగ్గ)

11 6.82 ఆంధ్ర సచిత్ర వారపత్రిక చదివాను. కథలన్నింటిలోకి అంతరార్థం కథ నాకు చాలా బాగా నచ్చింది. ఈ లోకంలో మనిషి కంటే ధనానికే ప్రాముఖ్యమని ఈ కథ వలన బాగా విడమర్చి చెప్పారు.

సి. హెచ్. రమేష్ (కొత్తపేట)

* * *

ఈ వారం కథల్లో ఎందుకీ పలాయనం మంచి కథ. దెయ్యం కథలో ఆఖరున దెయ్యంవాలింది అన్న తరువాత కనకం అలా నటించింది అంటూ, కథలో దెయ్యం వాలటం భ్రమ, మానసిక బలహీనతగా చిత్రించి వుంటే కథ ముగింపు అర్థం వుండేలా తయారై వుండేది అని నా అభిప్రాయం.

బి. వి. వి. ప్రసాద్ (తణుకు)

**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna**

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA



